ఆధునిక మలయాళ కవిత్వానికి సంబంధించినంత వరకూ కవిత్రయముగా ఎంచబడే ముగ్గురు మహాకవులలో కుమారన్ ఆశాన్ ఒకరు. తక్కిన ఇద్దరూ—వళ్లతోళ్ నారాయణ మీనన్, ఉళ్లూర్ పరమేశ్వర అయ్యర్. ఆశాన్ జీవితతత్త్వంలో, సమస్యలను ఎదుర్కొనడంలో ఆయన అవలంబించిన వైఖరిలో అద్వితీయమైన ప్రాచ్య, పాశ్చాత్య సమ్మేళనం మనకు గోచరిస్తుంది. ఆశాన్ మహాకవి మాత్రమే కాదు. గొప్ప వ్యవహర్త, వ్యవస్థా నిర్మాత కూడా. శ్రీ నారాయణ గురువుకి తగిన శిష్యుడిగా, వెనుకబడిన ఈజవ కులానికి చెందిన వ్యక్తిగా ఆయన ఎస్. ఎన్. డి. పి. యోగమును వ్యవస్థీకరించాడు. ఆ సంఘమునకు 17 ఏండ్లు ప్రధాన కార్యదర్శిగా పనిచేశాడు. దళితప్రజలలో పాదుకొనిపోయిన జడత్వమును, మాంద్యమును నిర్మూలించి, వారిలో పరులకు హానికరము కానట్టి, ఆరోగ్యప్రదమైన అసంతుష్టిని రేకెత్తించడంలో, వారిలో మార్పుకోసం, చైతన్యంకోసం, సమానత్వంకోసం ప్రగాఢ వాంఛను కలుగజేయడంలో ఆశాన్ వహించిన పాత్ర, సాధించిన ఫలితం గణనీయ మైనవి. "మీకై మీరే ధర్మశాస్త్రాలను మార్చండి, లేదా ధర్మశాస్త్రాలే మిమ్మల్ని తప్పక మార్చివేస్తాయి" అని సంఘంలోని సనాతన వాదుల నాయకులకు ఆయన చెప్పిన హెచ్చరికను పరిశీలిస్తే అది ఒక ప్రవక్త చెప్పినజోస్యంగా కనిపిస్తుంది.

సాహిత్య, సాంఘిక క్షేత్రాలలో ఆశాన్ విప్లవ బీజములను నాటాడు. ఆయన ఆలోచన ఎంత సమంజసమైనదో గడచిన నాలుగు దశాబ్దాలు నిరూపించాయి.

సృజనాత్మక కృషిలో ఆయన ఉన్నత శిఖరాల నధిరోహించి మహాకవిగా సాహితీవేత్తలచే పరిగణింపబడుతూ ఉన్న దశలో జలగండం వల్ల ఆశాన్ పరమపదించాడు. మరణించినప్పుడు ఆయన వయస్సు 51 సంవత్సరాలు మాత్రమే!

వెల : రూ. 2-50

ముఖ పత్రం : సత్యజిత్ రే

ముఖ చిత్రం పి. శ్రీధరన్ నాయర్

భారతీయ సాహిత్య నిర్మాతలు

# కుమారన్ ఆశాన్

రచన:
కె. యం. జార్జి

అనువాదము:
డి. రామలింగం



సాహిత్య అకాడెమీ
న్యూఢిల్లీ

# వి ష య సూ చి క

పైన ముద్రింపబడినది కుమారన్ ఆశాన్ వ్రాతప్రతి ఛాయాచిత్రం. శ్రీ ఎ. ఆర్. రాజరాజవర్మ మృతికి సంతాపం వెలిబుచ్చుతూ కుమారన్ ఆశాన్ 1918 లో రచించిన స్మృతిగీతం "ప్రరోదనం" కావ్యం మొదటిపేజీ ఇది. ఆశాన్ తన రచనలలో ఎన్నిమార్పులు, సవరింపులు చేసేవాడో, వ్రాతప్రతిలో కనబడే కొట్టివేతలనుబట్టి మనం గ్రహించవచ్చు.

# 1. ఆరంభ దశ

స్వామి వివేకానందుడు 1892 లో కేరళ ప్రాంతాన్ని సందర్శించినప్పుడు అక్కడ అంత గాఢంగా నెలకొనివున్న కుల మత తత్వాలను గమనించి "కేరళ దేశం నిజంగా పిచ్చి ఆసుపత్రిలా వుంది" అని వ్యాఖ్యానించాడు. విశ్వమానవ సౌభ్రాత్రయుగోదయం కోసం ఉవ్విళ్ళూరుతున్న ఆయనకు కేరళలోని 'అంటరాని తనం', 'నన్ను ముట్టుకోకు నామాల కాకి' అన్న తత్వం అమితమైన ఆశా భంగాన్ని కలిగించడమే కాక అసహ్యించుకునేటట్టు కూడా చేశాయి. అనాడు ఆ మహానుభావుడు ఆమాత్రంగానైనా గర్హించడం కేరళ ప్రాంతానికి తగిన ఘాటైన మందలింపు అని అంతా తరువాత గ్రహించగలిగారు. బహుశా భారత దేశంలోని ఇతర ప్రాంతాలకు కూడా ఇలాంటి చీవాట్లు అవసరమేమో—కాకపోతే కొంచెం హెచ్చుతగ్గులుగా!

సాంఘికంగా అనాడు అమలులోవున్న నిమ్నోన్నతాలు ఇంతా అంతా కాదు. అటు బ్రాహ్మణునికీ ఇటు హరిజనునికీ నడుమ అనేక కులాలు; వాటిలో మళ్ళీ తెగలూ, శాఖలూ ఎన్నో అంతెలుగా వుండేవి. 'వెనుకబడ్డ కులాలు', 'షెడ్యూల్డు జాతులు', 'షెడ్యూల్డు తెగలు' వంటివి పెద్ద విభాగాలు. తిరిగి వాటిలో మళ్ళీ ఉపకులాలు! కేరళలో ఈజవ అనేకులం (దీనినే తీయ అని కూడా వ్యవహరిస్తారు) చాలా ముఖ్యమైన కులాలలో ఒకటి. కాని దానిని వెనుక బడివున్న కులంగా లెక్కగట్టారు. గడచిన మూడు నాలుగు దశాబ్దాలలో ఈ కులం బడుగుతనం చాలావరకు అదృశ్యమైపోయింది. కాని వివేకానందుడు కేరళకు వచ్చినప్పుడు ఇది చాలా వెనుకబడివున్న కులం. కేరళ మహాకవి కుమారన్ ఆశాన్ ఈ కులానికి చెందినవాడు.

కాయిక్కర ఒక కుగ్రామం. ఇది తిరువనంతపురానికి ఉత్తరాన సుమారు 30 మైళ్ళ దూరంలో వుంది. ఈ గ్రామాన్ని ఒకవైపు సముద్రం లాలిసూ వుంటే, మరొకవైపు అంజుతెంగు అనే సరస్సు సప్రేమంగా పీపు/తడుతున్నటు

వుంటుంది, ఎటువైపు చూచినా తెల్లని ఇసుక. అసంఖ్యాకంగా కొబ్బరి చెట్లు. కేరళ సముద్రతీర ప్రాంతం ప్రత్యేకతే ఇది. ఆ కుగ్రామ ప్రజలు బహు సాధారణులు. ఎక్కువగా ఈజవ కులంవారు వుండే పల్లె అది. జీవిక కోసం చెమటోడ్చి కష్టించే జనం. కేరళరాష్ట్ర ఆధునిక మహాకవులలో పేరెన్నికగన్న వాడైన కుమారన్ ఆశాన్ ఈ గ్రామంలో జన్మించి వుండకపోతే ఆ రాష్ట్రంలోని కొన్నివందల గ్రామాలవలె ఈగ్రామం కూడా పేరులేకుండా, బయటివారికి తెలియకుండా వుండిపోయేది. కాని ఇప్పుడు మళయాళ సాహిత్యమేమైనా తెలుసా అంటే తలవూపగల ప్రతివ్యక్తికీ ఆ మహాకవి స్మృతిచిహ్నంగా మిగిలిన గ్రామం అది. అంతేకాదు, సాహిత్యకుడైన ప్రతివ్యక్తికీ దర్శనీయ మైన పుణ్యభూమి. ఆ మహాకవి అంటే ఇంతటి గౌరవభావం వుండబట్టే ప్రజలు ఇటీవల అక్కడ స్మారకభవనమును నిర్మించారు. ప్రతియేటా ఆయన స్మారకార్థం సాహిత్య మహాసభలు అక్కడ జరుపుకుంటున్నారు

కుమారన్ ఆశాన్ 1873 సంవత్సరం ఏప్రిల్ 12వ తేదీన జన్మించాడు. మళయాళ శకమునుబట్టి ఆ రోజు 2వ మేడం (మేషం), 1048, చిత్రాపౌర్ణమి రోజు. చిత్రాపౌర్ణమి రోజున జన్మించడమంటే చాలా శుభప్రదమని జ్యోతిష శాస్త్రమంటే నమ్మకమున్నవారు భావిస్తారు. తారాబలం ముఖ్యమైనదా, లేక ఒక వ్యక్తి స్వయంకృషితో ఇంతటి పేరు ప్రఖ్యాతులు సాధించడం గొప్ప విశేషమా అన్న విషయం ఆలోచింపదగినదే అయినప్పటికీ ఇక్కడ మన కది అప్రస్తుతం. ఆశాన్ తండ్రి నారాయణన్‌గారి ముఖ్యవృత్తి కొబ్బరినార, కొబ్బరిచిప్పలు, ఇతర సరుకుల వ్యాపారం. ఆయనకు సంగీతమంటే మిక్కిలి అభిరుచి. మళయాళ తమిళ భాషలలో ఆయనకు మంచి ప్రవేశము, పరిజ్ఞానము వుండేవి. స్వగ్రామ శ్రేయోభివృద్ధుల విషయంలో చాలా శ్రద్ధ తీసుకునేవాడు. కాయిక్కరలో ప్రాథమిక పాఠశాల ప్రారంభింపబడిందంటే అందుకు ఆయనే ముఖ్య కారకుడు. ఆశాన్ తల్లిపేరు కాళిఅమ్మ. అయితే ఆమెకు చాలా సన్నిహితులైనవారు, కావలసినవారు ఆమెను కొచ్చుపెణ్ణు అని పిలిచేవారు. ఆమె చదువుకోలేదు. కాని పురాణకథలు ఆమెకు బాగా తెలుసు, ఆ కథలు పిల్లలకు చెబుతూవుండేది. ఆమె తొమ్మన్‌విళాకం ఇంటివారి ఆడపడుచు. దైవభక్తి, దయాగుణం ఆమెలో మూర్తీభవించి వుండేవి.

నారాయణన్, కాళిఅమ్మలకు రెండవ కుమారుడు కుమారన్. వారికింకా కుమారులు, కుమార్తెలు ఆరుగురు వుండేవారు. ఇద్దరు కుమారులు, ఒక

కుమార్తె చిన్నప్రాయములోనే చనిపోయ్యారు. మొదటి కుమారుడు కృష్ణన్ తండ్రికి కుటుంబ విధులలో, వారికున్న చిన్న వ్యాపారంలో చేదోడుగా వుండేవాడు. తల్లిదండ్రులు చనిపోయిన తరువాత మొదటి కుమారుడే కుటుంబ పోషణభారం వహించాడు. కుమారన్‌కంటె చిన్నవాడైన కొచ్చుశంకరన్ (ఇంటిలో ఇతన్ని కుమారు అని పిలిచేవారు) జీవితాంతం బ్రహ్మచారిగానే వుండి పొయ్యాడు. ప్రాపంచిక విషయాలు ఆయనకు పట్టేవికావు. పట్టించుకొనేవాడూ కాదు. తక్కిన ఇద్దరు సోదరులు గోవిందన్, శేఖరన్ ఉపాధ్యాయవృత్తిలో చేరారు.

ఆ రోజులలో పిల్లలను మొదట గ్రామ వీధిబడికి పంపేవారు. మళయాళంలో దానివి కుడిప్పళ్ళికూడం అనేవారు. కుడి అంటే గుడిసె; లేదా నివాసయోగ్యమైన కుటీరము, పళ్ళికూడం అనగా పాఠశాల. కొబ్బరి ఆకులతో గుడిసె కట్టి అందులో బడి పెట్టేవారు. బడి మొత్తానికి ఒక్క పంతులే వుండే వాడు. ఆయనను ఆశాన్ అనేవారు. ఒక బడిలో 25 లేక 30 మంది పిల్లలు వుండేవారు. వారికి వ్రాయడం, చదవడం. చిన్నచిన్న లెక్కలు నేర్పేవారు. పలక, బలపంకూడా వుండేవి కావు. నాలుగు తరగతులుండే ప్రాథమిక పాఠ శాలలలో మాత్రమే పిల్లలు పలక. బలపం తీసుకెళ్ళేవారు. అవి వుండడం ఆ రోజుల్లో అదొక గొప్ప. కొంతమంది పిల్లలు వీధిబడితోనే చదువుకు స్వస్తి చెప్పేవారు. తక్కినవారు అంతటితో ఆపక ప్రాథమిక పాఠశాలలో చదువు సాగించేవారు. వీధిబడికి పోయే పిల్లలు కూర్చోవడానికి వారివెంట నలు చదరంగా వుండే చిన్న చాప తీసుకెళ్ళేవారు. (మళయాళంలో దానిని తడుకు అంటారు.) పంతులుగారికి వెనక ఆనుకునే సదుపాయంగల చిన్న పీట కుర్చీ వుండేది. మరికొంచెం మంచి బడిఅయితే ఆయనకు బెత్తం, వ్రాసే గంటము ఇంకా ఆయన తెచ్చుకున్న "అమూల్య" వస్తువులు పెట్టుకునేందుకు జాజిచెక్క పెట్టె వుండేవి. అక్షరాలు తాటాకులపై వ్రాసేవారు. పిల్లలు తమముందు నేలపై పోసివుంచిన చక్కని ఇసుకపై చూపుడువ్రేలుతో అక్షరాలు, మాటలు వ్రాసేవారు. ఈవిధంగా అక్షరాలు, అంకెలు, ఎక్కాలు నేర్చుకునేవారు.

కుమార్ తన ఏడవయేట అలాంటి ఒక వీధి బడిలో చేరాడు. అతనికి చదువు చెప్పే పంతులుగారికి వైద్యం, జ్యోతిష్యం, మంత్రవిద్య తెలుసు. ఆశాన్ చదువంటే శ్రద్ధాభక్తులు గలవాడు కనుకను, విధినిర్వహణ బాధ్యత తెలిసినవాడు అవడంచేతా బెత్తం దెబ్బలు అట్టే చవిచూడలేదు. వీధి బడిలో

ఒక సంవత్సరం చదివిన తరువాత కుమారన్ ప్రఖ్యాత వైద్యుడూ, సంస్కృత పండితుడూ అయిన కొచ్చురామన్ వైద్యర్‌కు శిష్యుడయ్యాడు. ఆయనవద్ద అమరకోశము, సిద్ధరూపము, శ్రీరామోదంతము, కృష్ణవిలాసము, రఘువంశము చదువుకున్నాడు. కొంత క్లిష్టగ్రంధమైన మాఘకావ్యంలో కొంతభాగంకూడా చదివాడు. అయితే ఈ శిష్యరికం ఎన్నాళ్లో నిలువలేదు. పంతులుగారికి పిల్లలకు చదువుచెప్పే పనికన్న వైద్యవృత్తి హెచ్చు లాభసాటిగా కన్పించడంచేత ఆయన ఉపాధ్యాయవృత్తికి స్వస్తి చెప్పారు. కొచ్చురామన్ వైద్యర్ ఆయుర్వేద వైద్యుడుగా మంచిపేరు తెచ్చుకొని నాలుగురాళ్ళు సంపాదించుకొన గలిగాడు. కాని కుమారన్ చదువులేకుండా ఇంట్లోనే వుండి ఒక సంవత్సరం నష్టపొయ్యాడు. ఆ ఏడాది వ్యర్థంగానే గడచిపోయింది.

అప్పుడు కుమారన్ తండ్రి, గ్రామంలో ఇంకా కొందరు పెద్దలు ప్రభుత్వంవారి వద్దకు వెళ్ళి తమ గ్రామంలో ఒక ప్రాథమిక పాఠశాలను నెలకొల్పడానికి అనుమతి సంపాదించారు. ఇందువల్ల కుమారన్‌కు ప్రభుత్వం వారి పరిగణన పొందిన పాఠశాలలో చదువును కొనసాగించే అవకాశం కలిగింది. మూడేండ్లు ఆ పాఠశాలలో చదివాడు. పద్నాలుగేండ్ల వయస్సు వచ్చేసరికి అక్కడి చదువు పూర్తిచేసి మంచి మార్కులతో ఉత్తీర్ణుడయ్యాడు. ఆ వయస్సు గల కుర్రవాడిని అదే పాఠశాలలో ఉపాధ్యాయ పదవిలో నియమించారంటే పెద్దలకు అతనంటే ఎంత మన్నన సదభిప్రాయము ఏర్పడ్డవో మనం గ్రహించ వచ్చు. కాని ఇదికూడా ఎక్కువ నెలలు సాగలేదు. కారణమేమంటే ప్రభుత్వం వారి పరిగణన పొందిన పాఠశాలలో ఉపాధ్యాయుడుగా పనిచేయాలంటే అందుకు వయస్సు కనీసం 18 ఏండ్లు అయినా వుండాలి.

అందువల్ల కుమారన్ ఒక టోకు వ్యాపారస్తునివద్ద గుమాస్తాగా చేరాడు. పై చదువంటే ఇష్టం లేక అతను ఈ ఉద్యోగంలో చేర లేదు. విధి లేక, పరిస్థితుల వత్తిడివల్ల ఆ పనిలో చేరాడు. అప్పటికే కుమారన్ చేతికి దొరికిన పుస్తకాన్నల్లా ఆమూలాగ్రం చదివి దానిలోని విషయాన్ని ఆకళింపు జేసుకొనే స్థితికి వచ్చాడు. అతనికి అదే ఒక వ్యసనమై పోయింది. ఇంకా పై చదువులు చదవాలని అతని కెంతో అభిలాషగా వుండేది. కాని తండ్రిగారు ఏదో ఒక పని చేసి కుటుంబపోషణ భారాన్ని కొంత పంచుకోమని కొడుకును కోరాడు. ఆశాన్ ఒక సారి తండ్రికి ఎదురు తిరిగి, ఇల్లు వదిలిపోయి తాతగారింట్లో మకాం పెట్టాడు. తల్లి వెళ్లి ఇంటికి తిరిగి రమ్మని కొడుకును బ్రతిమి లాడింది. కాని తల్లి ఎంతగా

ప్రతిమిలాడినా పై చదువులపై అతనికి గల ఆసక్తి కొంచెమైనా సడల లేదు. చివరకు అతనికి పని ఇచ్చిన టోకు వ్యాపారస్తుడే పిల్లవాడి తండ్రితో మాట్లాడి ఆయనను ఒప్పించ గలిగాడు. ఆశాన్ కొత్తగా పెట్టిన విజ్ఞాన సందాయిని అనే సంస్కృత పాఠశాలలో చేరాడు అప్పుడు అతని వయస్సు 16. చదువుపై పిల్ల వాడికి గల ఆసక్తిని గమనించి, తండ్రిగారి ఆర్థిక స్థితిని తెలుసుకొని ఆచార్యులు ఈ పిల్లవాడిని ఫీజు చెల్లించమని అడగ లేదు.

కుమారన్ బాల్యంలో ఆకతాయిగా వుండే వాడు. అతని కొంటెచేష్టలను ఆ వూరివారు కథలుగా చెబుతారు. అతని జీవిత చరిత్రలు వ్రాసినవారు కూడా అతని ఆ కతాయి స్వభావాన్ని గూర్చి, అతను చేసిన చిలిపి పనులను గూర్చి వ్రాశారు. మనిషి కొంచెం పొట్టి అయినా బలిష్ఠంగా వుండే వాడు. ఈ తలో తన సావాసగాళ్ళను ఇట్టే ఓడించే వాడు. చెరువులో, సముద్రంలో కూడా ఈత కొట్టేవాడు. చేపలు పట్టడమంటే చాలా సరదా. ఒక మారు ఒక చేప త్రాడును తెంపుకొని తప్పించుకు పోయింది. కుమారన్ దాన్ని వదలక వెంట పడ్డాడు. కూడా వున్న నేస్తాలు అలా చేయడం ప్రమాదకరమని హెచ్చరించినా వినక దాని అంతు తేల్చుకున్నాడు. ఒక పనిపై అతని మనస్సు లగ్నమైందంటే ఇక వెనక్కి మళ్ళడం అతని స్వభావంలోనే లేదు. అంత పట్టుదల గల మనిషి।

సంస్కృత పాఠశాలలో చేరినప్పుడు ఆశాన్ పెద్ద కోర్కెలు పెంచు కున్నాడు. దృఢచిత్తుడై చదువు సాగించాడు., శ్లోకాలు పద్యాలు వ్రాయ నారం భించి చాలా వరకు కృతకృత్యు డయ్యాడు. అంత పిన్న వయసులోనే అతను ఒక మోస్తరు పేరు, పరిగణన పొందాడని చెప్పడానికి పేరెన్నికగన్నట్టి కవి మూలూర్ పద్మనాభ పణిక్కర్ రచించిన 'కవి రామాయణము'లోని ఒక శ్లోకం చక్కని నిదర్శనం. బహు గ్రంధకర్తయైన కఞ్ఞి కుట్టన్ తంబురాన్ అనే కవి మొదట 'కవి భారతము' రచించి ఆ పిమ్మట 'కవి రామాయణము' వ్రాశాడు. 'కవి భారతము' వ్రాయడంలో ఆయన ఉద్దేశం కేరళ దేశంలోని ముఖ్య కవులను మహాభారత పాత్రలుగా పరిచయం చేయడం. కాని తంబు రాన్ ఈజవ కవులను విస్మరించాడు. పేర్కొన దగిన ఈజవకవులు ఆ గౌరవానికి అర్హులైన వా రెందరో వున్నప్పటికీ తంబురాన్ తన లెక్క లోకి వారిని తీసుకో లేదు. చివరకు మహోన్నత కవి యైన మూలూర్ పద్మనాభ పణిక్కర్‌ను కూడా వదలి వేశాడు. ఈ అన్యాయాన్ని గమనించిన ఆశాన్ "కవి రామాయణము" వ్రాయ నుపక్రమించాడు. తాను పేర్కొన దలచిన కవుల ఔన్నత్యాన్ని ప్రకటించడమే గాక, కె. యన్. కుమారన్ అనే కవి ప్రస కి

కూడా తెచ్చాడు. ఆ కవి ఎవరో కాదు. ఆశానే! అప్పుడతను ఆ పేరుతో వ్యవహరింప బడుతూ వుండే వాడు. అలా తనను గూర్చి తాను చెప్పుకొని, ఆ కవిని 'గవయ' (వానర ప్రముఖుడు) అని ప్రస్తుతించి వేళాకోళం చేశాడు. అంటే ఆశాన్ తనను తానే వేళాకోళం చేసుకొని నవ్వుకో గల ఆరోగ్య ప్రదమైన మనస్సు గలవా డన్నమాట.

విజ్ఞాన సందాయిని సుప్రసిద్ధ సంస్కృత కవీ, ఉపాధ్యాయుడూ అయిన మణంపూర్ గోవిందన్ ఆశాన్ నడుపుతూ వుండే వాడు. ఏడాది తిరగకముందే ఆశాన్ మాఘము, నైషధము, శాకుంతలము చదువుకున్నాడు. ప్రసిద్ధ అలంకార శాస్త్ర గ్రంథమైన 'కువలయానందము'ను కూడా అభ్యసించాడు. పాఠశాలలో శ్లోక రచన విత్యాభ్యాసంగా వుండేది. కుమారన్ గంటలో 15 మొదలు 20 శ్లోకములు రచించగల సమర్థు డయ్యాడు. అయితే ఆ శ్లోక రచనాభ్యాసం ముఖ్య లక్ష్యం ఛందస్సులో తప్పులు దొర్లకుండా ఛందోబద్ధమైన కవిత తీరు తెన్నులను ఆకళింపు జేసుకోవడమేనని తరువాత ఆయనే అంగీకరించాడు. అప్పుడు భావం, శైలి, రీతి—ఇవి ముఖ్యం కావు. అసలు వాటి వూసే లేదు. ఎందుచేతనంటే పద్యములు శ్లోకములు కూర్చువారికి బాహ్య ఉపకరణములపై మాత్రమే చూపు వుండేది. అంతర్గత భావాన్ని పట్టించుకునేవారు కారు.

కుమారన్ ఇటువంటి శ్లోకములు వ్రాయడమే గాక 'వళ్ళి వివాహము' (జానపదశైలి కావ్యము), "ఉషా కళ్యాణము" అనే నాటకం కూడా రచించాడు. ఆ గ్రామ యువకులు "ఉషా కళ్యాణము"ను పలుమార్లు ప్రదర్శించారు. నూనూగు మీసాల వయస్సులోవున్న కవికి అదే పెద్ద పరిగణన కదా!

గోవిందన్ ఆశాన్‌వద్ద రెండేండ్లు విద్యాభ్యాసం చేసిన తరువాత కుమారన్ ఆయన కొక నమస్కారంచేసి వెళ్ళిపోయాడు. తన వద్ద అతను నేర్చుకోవలసింది మరేమీ లేదని గురువుగారు శిష్యునితో అన్నాడట. శాకుంతలమును బోధిస్తున్నప్పుడు ఒక శ్లోకం అంతరార్థం విషయంలో గురువుగారికీ శిష్యునికీ మధ్య వివాదం వచ్చింది. ఆ చర్చలో శిష్యుని ఆధిక్యత విస్పష్టమైంది. అప్పుడు కుమారన్ వయస్సు 18 ఏండ్లు మాత్రమే!

# 2. స్వామి, చిన్నస్వామి!

కేరళలో ఈజవ కులము వారు అక్కడి జనాభాలో నూటికి 30 వంతుల మంది వుంటారని అంచెనా-ఈ కులం వారు త్వరిత గతిని అభ్యుదయ పథం వైపు పురోగమిస్తూ ఇప్పుడు పైకి వస్తున్నారు. అయినప్పటికీ నేటికి కూడా వారిని వెనుక బడిన కులంగానే పరిగణించడం జరుగు తున్నది. కాని ఒక శతాబ్ది క్రితం వారి వెనుకబడిన తనానికీ, ఇప్పటి వారి స్థితికీ పోలికే లేదు. పూర్వం వారు సాంఘికంగా అనేక విధాలైన అనర్హతలతో పీడితులై బ్రతుకుతూ వుండే వారు. స్కూళ్ళలో వారి పిల్లలను చేర్చుకునేవారు కారు. దేవాలయాలవద్ద కొన్ని వీధు లలో వారిని నడవనిచ్చేవారు కారు. ప్రభుత్వోద్యోగాలన్నీ పై కులముల వారివే. ఈజవలు కల్లు గీయడం, వ్యవసాయం, నేతపని వంటి వారి సాంప్రదాయిక వృత్తులతో జీవించవలసిందే అని పెద్ద కులాల వారి అభిప్రాయం. తిరువాన్కూరు కొచ్చిన్ సంస్థానాలలో వారి పరిస్థితి మరీ అధ్వాన్నంగా వుండేది. కాబట్టే ప్రభుత్వ పాఠశాలల్లో తమకు ప్రవేశ మివ్వవలెననీ, ప్రభుత్వోద్యోగాలలో తమ కులం వారిని కూడా చేర్చుకోవాలనీ కోరుతూ 13,000 మంది ఈజవలు సంతకం చేసిన ఒక విజ్ఞాపన పత్రాన్ని 1896 లో తిరువాన్కూరు మహారాజా వారికి సమర్పిం చారు. కాని ఈజవలకు చదువుకోవాలన్న అభిలాష లేదనీ, ప్రభుత్వోద్యోగాలలో పనిచేయాలన్న కోర్కె వారికి అంతకన్నా లేదనీ, తమకు సంప్రదాయంగా వస్తూ వున్న వృత్తులు చేసుకుంటూ ఆ కులం వారు సంతృప్తి జెందివున్నారనీ, కనుక ఆ విజ్ఞాపన పత్రాన్ని ఎవరో కావాలని సృష్టించి పంపారన్న విషయం స్పష్టమవు తున్నదనీ వ్రాసి దాన్ని తిప్పి కొట్టడం జరిగింది.

ఈజవలు ఈ విధంగా సాంఘికంగా, విద్యా విషయకంగా, ఆర్థికంగా, పీడితులై బహుకాలంగా సమాజంలో జీవిస్తూ వచ్చారు. అయితే వీరి కన్న మరింత పీడితులైన కులాలవారు అప్పటి సంఘంలో లేక పోలేదు. కాని తాము సమాజంలో అణచివేయబడి, పీడితులమై జీవిస్తున్నా మన్న ఎరుక, అసంతృప్తి ఈజవకులం వారి నాయకులలో అధికంగా వుండేది. పరిస్థితి ఈవిధంగా వున్న తరుణంలో నారాయణగురు అనే సంఘసంస్కర్త

ఆవిర్భవించాడు. ఈయన 1856లో జన్మించి 1928లో కాలధర్మం చెందాడు. ఈయన ఎక్కువగా ఆధ్యాత్మిక వేత్తగా ప్రజలకు పరిచితుడైనప్పటికీ ఈయన కార్యక్షేత్రం మతమొక్కటే కాదు. విద్యా విషయకంగా, సాంఘికంగా కూడా ఈయనకు కొన్ని లక్ష్యాలుండేవి. ఈయన ఈజవకులం వాడైనప్పటికీ, అనేక విధాలైన సాంఘిక అనర్హతలతో అణచివేయబడివున్న అన్ని కులాలవారికి విమోచనం కలిగించడం ఈయన ధ్యేయం. అందుకు నడుముకట్టి కార్యరంగం లోకి దూకి పోరాటం సాగించాడు. హైందవ శాస్త్రముల ననుసరించి శూద్రులకు సన్యాసులయ్యే హక్కులేదు. ఇక అవర్ణుల సంగతి చెప్పనక్కరేలేదు. సన్యసించడమనేదాన్ని వారు తలపెట్టడానికే వీలులేదు. నారాయణగురు కేరళలోని అనేక ప్రాంతాలలో ఈజవలకు దేవాలయాలలో ఆరాధన చేసుకునే అవకాశం కలిగించాడు. అంతేగాక పులయలకు, ఇప్పుడు హరిజనులని వ్యవహరింపబడే నిమ్నజాతులవారికీ దేవాలయాలలో ప్రవేశం కలిగించాడు. ఒక శివాలయంలో విగ్రహ ప్రతిష్ఠాపన చేసే అర్హత ఆయనకెక్కడిదని సవాలుచేసిన వారికి తాను ఈజవశివుని ప్రతిష్ఠిస్తున్నాను గాని బ్రాహ్మణుల శివుని ప్రతిష్ఠించడం లేదని ఆయన సమాధానం చెప్పాడు. 'మానవునికి ఒకేకులం, ఒకే మతం, ఒకే దేవుడు' అని ఆయన ఉద్ఘాటించాడు. ఆయన ఎలుగెత్తి చాటిన ఈ నినాదమే పెద్ద సాంఘిక విప్లవానికి బీజము వేసింది. ఒక వ్యక్తికి, లేదా ఒక కులానికీ ప్రత్యేకమైన హక్కులు, అర్హతలన్న ప్రశ్నే లేదని ఆయన నిష్కర్షగా చెప్పాడు. వివాహాది శుభకార్యములలో పాటింపబడే అర్థరహితమైన ఆచారా లను, విధులను నిరసించి వాటికి వ్యతిరేకంగా ఉద్యమం లేవదీశాడు. సంఘంలో గాఢంగా నెలకొనివున్న మూఢనమ్మకాలను తొలగించడానికి ఆయనే కారకుడు. ఆయన గొప్ప సాంఘిక విప్లవవాది. అయితే ఎప్పుడూ ప్రశాంత మనస్కుడై నిదానముగా నిశ్శబ్దంగా వ్యవహరించే క్రాంతివీరుడు. ఆడంబరము, ఆర్భాటము ఎరుగని సంస్కర్త. నిరాడంబరత మూర్తీభవించిన మనిషి. మానవాకారంలో చెక్కరూపొందించిన సౌమ్య స్వభావమా అన్నట్లు వుండేవాడు. ప్రజలకు నారా యణగురు అంటే ఎంత గౌరవమో చెప్పడానికి ఆయనను వారు 'స్వామి' అని వ్యవహరించడమే ప్రబల నిదర్శనము.

స్వామివారి ప్రభావం ఫలితంగానే 1903 మే 15వ తేదీన "శ్రీనారాయణ ధర్మపరిపాలనాయోగం" అనే సంస్థ స్థాపించబడింది. దీనినే సాధారణంగా "ఎస్. ఎన్. డి. పి. యోగం" అంటారు. చెల్లాచెదురై చేవలేకుండా

అయిపోయిన కులాన్ని సుసంఘటితం చేయడంలోనూ, సాంఘికంగా ఆర్థికంగా దానికి విమోచనం కలిగించడంలోనూ పై సంస్థ ఎంతో కృషి చేసి ఒక బలీయమైన శక్తిగా రూపొందింది. ఈ సంస్థకు ముఖ్య నాయకుడు స్వామిగారే. 1928లో తాను సమాధిచెందేవరకూ మొత్తం 25 ఏండ్లు ఆయన ఈ సంస్థ పరంపరాభివృద్ధికి పాటుపడ్డాడు. నేటికీ ఆయన ఆధ్యాత్మిక ప్రేరణమే సర్వ వ్యాపితమై ఈ సంస్థకు మార్గదర్శకంగా వున్నది. అర్ధశతాబ్దిక్రితం ఈజవ కులంలో పట్టుమని అయిదుగురు పట్టభద్రులైనా లేరు. ఈనాడు వేలాది ఈజవలు ఉన్నత విద్యనభ్యసించి, గొప్ప గొప్ప పట్టాలు సంపాదించి బాధ్యయుతాత మైన పెద్ద పదవులలో వున్నారు. యస్ యన్. డి. పి యోగంవారి నిర్వహణక్రింద అనేక పాఠశాలలు, కళాశాలలు వున్నాయి. దీనినిబట్టి నారాయణ గురు ఆశీర్వాదప్రభావంవల్ల ఈజవకులం ఎంత అభివృద్ధిచెందినదో మనం గ్రహించవచ్చు.

తన జీవితకాలంలో స్వామి తన ప్రత్యక్షప్రభావంతో అనేకమంది వ్యక్తులను తాను ఏర్పరచుకున్న ధ్యేయంవైపు నడిపించగలిగాడు. అట్టివారందరి లోనూ కుమారన్ ఆశాన్ చెప్పుకోదగినవాడు. ఆశాన్ పై స్వామిగారి ప్రభావం మిక్కుటమైనదీ, ప్రయోజనకరమైనదీ అని చెప్పాలి. నారాయణగురును మొట్టమొదటిసారిగా కలుసుకున్నప్పుడు ఆశాన్ వయస్సు 18 ఏండ్లు మాత్రమే. గురువు వయస్సుకూడా 36 ఏండ్లే. అప్పటికే ప్రజలు అయనను అసాధారణు డైన యోగిగా పరిగణించినప్పటికీ తరువాతి సంవత్సరాలలో ఆయన సాధించిన ఔన్నత్యం, తేజస్సు, అంతస్తు, పేరుప్రఖ్యాతులు అప్పటికాయనకింకా రాలేదు. ఏమైనప్పటికీ ఇదమిత్థమని చెప్పరాని మహత్తర ఆకర్షణ ఏదో కుమారన్‌ను గురు వుకు సన్నిహితం చేసింది. గురువుకూడా కుమారన్‌తో పరిచయంకలిగినందుకు ఆనందించాడు. కారణమేమంటే ఆశాన్ భవిష్యత్తులో గొప్ప వ్యక్తి కాగలడన్న సూచనలు ఆయనకు అప్పుడే దృగ్గోచరమయ్యాయి. పోల్చి చెప్పాలంటే వారి సమాగమము రామకృష్ణ పరమహంస నరేంద్రనాధుని కలుసుకున్నటువంటిది. నరేంద్రనాధుడేకదా తరువాత వివేకానందుడైనది. గురుదర్శనం యువకుడైన కుమారన్ జీవితంలో పెద్ద మలుపు తెచ్చింది. వీరి సాంగత్యము పరస్పర ప్రయోజనకారి కావడమేగాక మొత్తం కులానికీ, నాగరక జీవితంపై కోరికలు పెంచుకున్న యావన్మంది కేరళ ప్రజలకూ మేలు కలుగజేసింది.

కుమారన్ విద్యాభ్యాసము అతని 18వ ఏటనే నిలిచిపోయిందని ఇదివరకే తెలుసుకున్నాముకదా! కాని అతను ప్రగాఢమైన విద్యా సముపార్జనేచ్ఛ గలవాడు కనుక తానే స్వయంగా గ్రంథ అధ్యయనం చేశాడు. ఎన్నో ఆశలతో స్వయంకృషి సాగించాడు చేతికందిన పుస్తకమల్లా చదివి జీర్ణించుకున్నాడు. ముఖ్యంగా తమిళ సంస్కృత భాషలపై ఆయనకు ఆసక్తివుండేది. మళయాళ భాషలో భక్తిప్రధానమైన కావ్యఖండికలు రచించాడు. సుబ్రహ్మణ్యశతకము, భక్త విలాపము ఈదశలో రచించినవే.ఈ రెండవ కృతి 'ఆశాన్ సంపూర్ణరచనలు' అనే ఉద్గ్రంథం మూడవ సంపుటిలో చేర్చబడింది. కుమారన్ కౌమారక దశలో వ్రాసిన కావ్యములను చదివించుకొని విని స్వామి మహదానందం పొందేవాడట. ఇట్లా స్వామి కుమారన్‌ను ప్రోత్సహించాడు. అయితే కుమారన్ తన కవిత్వములో శృంగార రసానికి ప్రాధాన్యమివ్వరాదని గురువు హితవు చెప్పాడు. అప్పు డప్పుడే వికాసము పొందుతూవున్న కుమారన్ మనోభావములపై స్వామివారి సాంగత్యము శ్రేయోదాయకమైన ప్రభావముద్ర వేసింది.

ఆ రోజులలోనే కుమారన్ తన ఇతర కార్యక్రమాలతోపాటు పిల్లలకు సంస్కృతము బోధించేవాడు. అప్పుడే ఆయనకు 'ఆశాన్' అనే పేరు వచ్చింది. ఆశాన్ అనగా పంతులుగారు[1]. ఈ విధంగా కుమారన్ (కుమారు అని కూడా అంటారు) 'కుమారన్ ఆశాన్' అయినాడు. చివరకు మధ్యలో వచ్చిన పేరే ఎంతగా ప్రాచుర్యం పొందిందంటే—ఆశాన్ అంటే చాలు, మళయాళ సాహిత్య పరిజ్ఞానం ఇసుమంతైనా గల వారు వెంటనే ఆ కవిని పోల్చుకో గలరు. పైగా కేవలం 'కుమారన్' అని వూరుకుంటే ఎవరా కుమారన్ అన్న ప్రశ్న ఉదయించి కొందరు చప్పున పోల్చుకోలేక పోవచ్చు! గుర్తించడం కష్టంగావచ్చు కూడా.

స్వామిగారు అప్పుడప్పుడూ కాయిక్కర వెళ్లి ఈ నవోదిత రచయితను కలుసుకొంటూ వుండే వారు. ఇద్దరూ ఏమి మాట్లాడుకునేవారో ఎవరికీ అంతగా తెలియదు. కాని ఆశాన్‌పై స్వామిగారి ప్రభావం ప్రసరించిందన్న విషయంలో ఎవరికీ సందేహం లేదు. ఆశాన్ మునుపటికన్న ఇప్పుడు ఏకాంతాన్ని ఎక్కువగా వాంఛి స్తున్నాడు. తరచు సమీపంలో వున్న కొండల మీదికీ, అడవులలోకీపోయి ధ్యాన నిమగ్నుడయ్యేవాడు. తాత్త్విక చింతనతో కలత జెందుతూవున్న అతని మనస్సు

1. 'ఆశాన్' అనే మాట 'ఆచార్య' అనే పదమునుండి ఉద్భవించింది. (ఆచార్య → ఆసిరియ ఆశాన్).

ఏకాగ్రతతో భావనాలోకంలో విహరించడానికి తగిన వాతావరణంకోసం తహ తహలాడ జొచ్చింది.

కుమారన్ శారీరకంగా దృఢగాత్రుడు. నిగ్గుదేరిన చామన చాయలో వుండేవాడు. మనిషి కొంచెం పొట్టి. తల లావుగా గుండ్రముగా వుండేది. మందపాటి మెడ. ఉంగరాల జుట్టుతో, మెరిసే విశాల నేత్రాలతో చూసేవారిని ఇట్టే ఆకర్షించే వ్యక్తిత్వం, హుందా ఉట్టిపడే ఆయన నడకతీరు ఆయనలో ఉత్తుంగతరంగములా పైకెగస్తూవున్న ఆత్మవిశ్వాసాన్ని ప్రదర్శించేవి. అయితే ఆయననుగూర్చి సరిగా తెలియనివారు ఆ నడకనుచూచి అహంకారంగల మనిషని అపోహపడటం కూడా కద్దు.

స్వామిగారు కుమారన్ ఆశాన్‌ను అరువిప్పురంలోవున్న తమ ఆశ్రమానికి రావలసిందిగా ఆహ్వానించారు. ఆశాన్ తన పనులన్నీ ఎక్కడివక్కడ వదిలేసి గురువువెంట వెళ్ళి మూడేండ్లు ఆశ్రమంలో శిష్యుడుగా గడిపాడు. మళయాళ భాషలో అరువిప్పురం అంటే నదిఒడ్డు అని అర్థం. ఆ ప్రదేశం నెయ్యార్ నదీ తీరాన వున్నది. అది జనావాసములేని అరణ్యప్రాంతం. అచటి ప్రకృతి రామణీయకత చెప్పుకోదగింది. నిశ్చలధ్యాన నిమగ్నతకు భంగము కలుగడానికి వీలులేని తావు. కాబట్టే స్వామిగారు ఆ ప్రదేశమును ఎన్నిక చేశారు. స్వామి నెలకొల్పిన మొదటి సంస్థ ఇది. ఇప్పుడిది పవిత్రమైన యాత్రాకేంద్రమై ప్రతి సంవత్సరం వేలాది జనులు దర్శించు పుణ్యస్థలంగా విరాజిల్లుతోంది.

కుమారన్ ఆశాన్ ''వివేకోదయం'' అను మాసపత్రిక సంచిక నొక దానిలో ఈ ప్రదేశ ప్రకృతి సౌందర్యమును ఈ విధంగా అభివర్ణించారు :

> 'జనావాసములేని ఆ ప్రదేశంలో మనోహరమైన ఆ నది, ముందుకు పొడుచుకొని వచ్చినట్లుండే బండలపైకి నీరు విసురుగా వచ్చి కొట్టుకొని ప్రతిధ్వనించడం, ఎటుచూచినా రాళ్ళసీమలు, ఇసుక ఒడ్డు, రెండుప్రక్కలా ఎత్తైన కొండలు, దట్టమైన అడవుల పచ్చదనము—ఈ స్వచ్ఛ నిసర్గరామణీయకత స్వామిగారికి మనోహరంగా కన్పించింది. వారికి ఏకాంతమంటే ఎంతో ఇష్టం. ఒక్కొక్కప్పుడు స్వామిగారు బీటలిచ్చిన ఆ బండరాళ్లపై కూర్చొని ఆహారమనేదే లేకుండా రోజుల తరబడి గడిపేవారు. ఈ సంగతి ఎవరికీ తెలిసేది కాదు. కాలక్రమేణా ప్రజలకు ఈ విచిత్రమైన యోగి సంగతి తెలియ వచ్చింది....'

స్వామిగారు ఈ ప్రదేశమును 1885లో కనుగొన్నప్పటికీ, ఆ తర్వాత మూడేండ్లకు దీనిని ప్రజలకు ఆరాధనా కేంద్రంగా చేశారు. కుమారన్ 1892లో స్వామిగారి అంతేవాసిగా ఇక్కడికి చేరుకొని అప్పటినుంచి మూడేండ్లవరకు వారికి అనుచరుడుగా వున్నాడు. ఇద్దరూ కలిసి చుట్టుపక్కల గ్రామాలను సందర్శించి ప్రజలకు ఆధ్యాత్మిక, సాంఘిక విషయాలనుగూర్చి చెప్పేవారు ఈ కాలంలోనే అక్కడక్కడా మందిరములు నెలకొల్పారు. స్వామిగారి సాంగత్యం వల్ల శిష్యుడిలో యోగిలక్షణాలు పెంపొందాయి. ఆ తర్వాత ప్రజలాయనను 'చిన్నస్వామి' అని వ్యవహరింపనారంభించారు. క్రమేణా ఆయన తన కుటుంబంవారితో గల బంధాలు తెంచుకున్నట్లుకూడా ఒక కథ ప్రచారం లోవుంది.

ఆశాన్ అన్నగారు, మేనమామగారు ఒక పర్యాయం అరువిప్పురం ఆశ్రమానికి వచ్చారు. అది శివరాత్రి రోజు. స్వామిగారు హాలులో గంభీర వదనులై కూర్చొని వున్నారు. వారి పక్కన కుమారన్ వున్నాడు. ఆ వచ్చిన వారు తనకు పరిచయంలేని ఆగంతకులన్నట్లుగా కుమారన్ ప్రవర్తించాడు. కాని స్వామిగారు వారితో సంభాషించారు. కుమారన్ తల్లిదండ్రులు ఆతనిని చూడవలెనని బెంగపెట్టుకొని వున్నారనీ, స్వామి వారు అనుమితిస్తే ఆతనిని ఇంటికి తీసుకువెడతామనీ ఆ వచ్చిన వారన్నారు. స్వామి అందుకు తమకెట్టి అభ్యంతరంలేదనీ, కుమారన్ తన ఇంటికివెళ్లి తల్లిదండ్రులను చూచి ఆశ్రమానికి తిరిగిరావచ్చుననీ అన్నారు. ఈ సంభాషణ జరుగుతున్నంతసేపూ కుమారన్ మాటామంతీ లేకుండా మౌనముద్రాంకితుడై వున్నాడు. అది గ్రహించిన స్వామిగారు కుమారన్ ఓణమ్ పర్వదినాన స్వగ్రామానికి రాగలడని చెప్పారు, అట్లే ఓణం సందర్భంలో కుమారన్ ఒక మిత్రునితో కలిసి తన ఇంటికి వెళ్లాడు, ఇద్దరూ ఇంటివెలుపలే కూర్చున్నారు తల్లిదండ్రులు వచ్చి ఇదేమిటని అడుగగా కణియార్ కులంవాడైన తన మిత్రునికూడా ఇంటిలోపలికి రానిస్తే తానూ లోపలికి రాగలనని ఆశాన్ అన్నాడు. పెద్దలు అందుకు సమ్మతించడమేగాక ఆశాన్ తండ్రి వారిద్దరి పంక్తిలో కూర్చొని భోజనం కూడా చేశారు.

అనుకున్న ప్రకారం కుమారన్ ఆశాన్ గురువువద్దకు తిరిగివచ్చాడు. స్వామిగారితో గడపిన ఆ మూడేండ్లలో ఆశాన్ ఎంతో అధ్యయనంచేసి మంచి శిక్షణ పొందాడు. వేదాంత గ్రంథములను క్షుణ్ణంగా చదువుకున్నాడు. యోగా భ్యాసాలు చేశాడు. యువకుడైన కుమారన్‌పై స్వామీజీ ప్రభావం గాఢంగా పడింది. కుమారన్ తన జీవితాన్ని సమాజశ్రేయస్సుకు అంకితం

చేసుకున్నాడు. అరువిప్పురంలో వున్నప్పుడే ఆశాన్ శివస్తోత్రమాల రచించాడు. గురువుగారివలెనే ఆశాన్ కూడా శివభక్తుడు.

# 3. విశాల దృష్టి

నారాయణగురు కేవలం అధ్యాత్మవిదుడు మాత్రమేకాదు. సమాజ శ్రేయస్సుకూ, పురోగమనానికీ సాంఘిక, విద్యావిషయాలు ఎట్టిపాత్ర వహించ గలవో ఆయనకు బాగా తెలుసు. అధ్యాత్మికంగానేకాక, సాంఘికంగా కూడా "విజ్ఞానమే మహత్తరశక్తి" అని ఇతరులకన్న స్వామిగారు బాగా గ్రహించారు. గుళ్లు గోపురాలు నిర్మించడం మాత్రమే అంతిమ లక్ష్యం కాదని ఆయన ప్రబోధం. దీనినే వారు 1917లో ఒక సందేశంలో నొక్కి వక్కాణించారు:

"గుళ్లు గోపురాల నిర్మాణానికై ధనం వెచ్చించడం వ్యర్థమని కొందరు విచారపడవచ్చు. కాని ఆ కృషిని అట్టి ప్రయత్నాలను పూర్తిగా విలిపివేయడం మంచిదికాదు. కాబట్టి చిన్న ఆలయాలను నిర్మింపనివ్వండి. అయితే పెద్ద దేవాలయాలనేవి విద్యాసంస్థలు మాత్రమే ...ఆలయాలద్వారా కులవిభేదాలు లేకుండా ప్రజలందిరినీ కూడగట్టవచ్చునని పూర్వం సంభావింపబడింది. కాని అది అడియాస అని అనుభవంవల్ల తెలియవచ్చింది. గుడి గోపురాలవల్ల కుల విభేదాలు అధికమవుతాయి. కాబట్టి ఇక మనం ప్రజలను విద్యావంతులుగా చేయాలి. వారికి సంగతి సందర్భాలు తెలియజెప్పాలి. వారిని అధికంగా విజ్ఞానవంతులను చేయాలి. వారి అభ్యున్నతికి అదొక్కటే మార్గం"

సాంఘిక, విద్యావిషయాక రంగాలలో జవమూ, జీవమూ తేవడానికి కుమారన్ ఆశాన్ సాధనముగా ఉపకరించగలడని దివ్యజ్ఞానియైన స్వామిగారు తెలుసుకున్నారు. కాని అతను అందుకింకా సిద్ధంగాలేడు. ఈజవ కులంలో స్వామి, చిన్నస్వామి ఇద్దరూ మహామహులు. అయితే వీరిద్దరినుండి విడదీయ రాని మూడవ వ్యక్తి మరొకరున్నారు: ఇచ్చట ఆయన ప్రసక్తి అవశ్యకమవు తున్నది. ఆయన పేరు డా॥ పి. పల్పు. ఆయన తిరువనంతపురం వాస్తవ్యుడు, ఆయనకూడా ఈజవ కులంవాడు కాబట్టి ఎక్కడో జీవిక వెతుక్కో

వలసి వచ్చింది. స్వామిగారు సాంఘిక, మతరంగాలకు తన జీవితాన్ని అంకితం చేయగా, డా॥ పల్పు తన శక్తియుక్తులను సాంఘిక ఆర్థిక రంగాలకు వినియోగించాడు.

డా॥ పల్పు 1861లో జన్మించాడు. ఈయన స్వామిగారికన్న నాలుగేండ్లు చిన్న. ఈజవలకు ప్రభుత్వ పాఠశాలల్లో ప్రవేశం నిరాకరింపబడినప్పటికీ, పల్పు తిరువనంతపురం ఇంగ్లీషు హైస్కూలు ప్రధానోపాధ్యాయుడైన ఒక ఆంగ్లేయుని సహాయంతో దొడ్డి దారిగుండా పాఠశాల ప్రవేశం సంపాదించాడు. ఎఫ్. ఏ. పరీక్ష (ప్రీ డిగ్రీ పరీక్షకు సమానమైనది) లో ఉత్తీర్ణుడై ప్రభుత్వ వైద్య పాఠశాలలో ప్రవేశం కొరకు ప్రయత్నం చేశాడు. అందుకు తగిన యోగ్యతలు అతనికున్నప్పటికీ ఆ ప్రయత్నంలో కృతార్థుడు కాలేకపోయాడు. అయినా నిరుత్సాహపడక ధైర్యంగా నిలబడి, మద్రాసువెళ్ళి ఎల్. ఎమ్. ఎస్. డిగ్రీ సంపాదించి. తిరువనంతపురానికివచ్చి ఉద్యోగంకోసం ప్రయత్నించి విఫలుడయ్యాడు. అయితే మైసూరు రాజ్యంలో అతనికి ఆశ్రయం లభించింది. అక్కడ ఆరోగ్యశాఖాధికారిగా, లింఫ్ ఇన్‌స్టిట్యూట్‌కు డైరెక్టరుగా పనిచేశాడు. ఆకాలంలోనే ఆయన నెలకు వెయ్యిరూపాయల వేతనం పొందేవాడంటే ఆయన అంతస్తును మనం ఊహించుకోవచ్చు. అయినా సొంత రాష్ట్రంలో కులాల పట్టింపుగల అధిపతులు ఆయనను హీనుడుగా ఎంచి నిరాదరణ చూపారు.

డా. పల్పు తన కులంవారికి చేసిన సేవ ఎంత గొప్పదో అంతగా పరిగణన ఆయనకు లభించలేదు. ఆయన మేధావి. కార్యసాధకుడు. సందేహాలకూ, సంకోచాలకూ తావివ్వని పథక రచయిత. ఏ పనికైనా వ్యవస్థా నిర్మాణంలో దిట్ట. ఈజవ స్మారక సంస్థకు బీజములు వేసినవాడు ఆయనే. ఎస్ ఎన్. డి. పి. యోగం సంస్థకు పునాదులు వేసినవాడుకూడా ఆయనే. తనకు మిక్కిలి ప్రియమైన లక్ష్యసాధనకు తన ద్రవ్యమును, సమయమును ఉదారంగా వెచ్చించిన వదాన్యుడు. నారాయణగురు. డా. పల్పు సన్నిహితులై ఏకోన్ముఖులు కావడం మొత్తం ఈజవ కులానికే శుభోదయమైంది. ఒకరి జవసత్వాలు, ప్రేరణ రెండవ వారి శాంతగంభీర స్వభావము మనఃపరిపక్వత—ఇవిరెండూ ఏకమై ఆ కులంవారి అభ్యున్నతికి దోహదం చేశాయి. ఒకరు మరొకరికి సహాయకులై, ఒకరిలోలేని గుణమును మరొకరు పరిపూరణ చేస్తూ అన్యోన్యంగా ముందుకు సాగారు. వీరిరువురి ధ్యేయాన్ని కుమారన్ ఆశాన్‌కూడా పంచుకొని వారి మార్గానికి

సన్నిహితుడై ప్రముఖంగా కృషిచేశాడు. ఇది జరిగిన తీరు మన పరిశీలనకు ప్రస్తుతమైన అంశము.

స్వామి, ఆయన శిష్యులు ఉత్తర తిరువాన్కూర్లో కొద్దిరోజులున్న తరువాత, 1895 లో బెంగుళూరు వెళ్ళారు. డా. పల్పు సంతోషంతో స్వామికి ఆయన శిష్యులకు స్వాగతంచెప్పి వారికి ఆతిథ్యమిచ్చారు. అంతా కలిసి తమకులం వారి అభ్యున్నతికై అనేక పథకాలు ఆలోచించి చివరకు విద్యావంతులైన యువకులపై తమ కులం భవిష్యత్తు ఆధారపడివున్నదన్న తీర్మానానికి వచ్చారు. డా పల్పు ఒక యువకుని విద్యకయ్యే ఖర్చునంతా తాను భరించగలనని అన్నారు. దానిపై కుమారన్ అందుకుతగ్గ యువకుడని స్వామిగారు సూచించారు. దీనికి డా. పల్పు సమ్మతించారు. స్వామివారి కోర్కె డా. పల్పు గారికి శిరోధార్యమైన ఆజ్ఞ.

స్వామిగారు కుమారన్ ఆశాన్‌ను అక్కడే వదలి తాము చిదంబరం, మధుర, తమిళనాడులోని ఇతర ముఖ్యకేంద్రాలను సందర్శించి తిరునెల్వేలిగుండా తిరువాన్కూరు తిరిగివచ్చారు. గురువునుండి ఎడబాటును కుమారన్ తట్టుకోలేక పొయ్యాడు. దృఢచిత్తుడైనప్పటికిని, పై చదువులయందు మిక్కిలి ఆసక్తిగల వాడైనప్పటికిని గురువుగారితో ఏర్పడిన ప్రగాఢ సాన్నిహిత్యంవల్ల ఆశాన్ కంట తడిపెట్టి దుఃఖించాడు.

డా. పల్పు తన కుటుంబంతో బెంగుళూరులో నివసిస్తున్నారు. కుమారన్ వారి కుటుంబంలో ఒక వ్యక్తిగా సంతోషంగా సాదరంగా స్వీకరింపబడ్డాడు. డా. పల్పుతో సాన్నిహిత్యము, ఆయన కుటుంబం వారితో పరిచయము కుమారన్ జీవితంలో మరొక ముఖ్య ఘట్టంగా భాసించింది. అప్పుడతని వయస్సు 22 ఏండ్లు. అనతికాలంలోనే కుమారన్ శ్రీ చామరాజేంద్ర సంస్కృత కళాశాలలో చేరాడు.

బెంగుళూరులోని సంస్కృత కళాశాల సవర్ణులైన హిందువులకు మాత్రమే పరిమితం గావింపబడిన విద్యాసంస్థ. ఆ రాష్ట్రంలోని లింగాయతులకు కూడా (వీరు బ్రాహ్మణేతరులు) అందులో ప్రవేశం లభించేదికాదు. అటువంటి సంస్థలో ప్రత్యేకంగా కుమారన్ ఆశాన్‌కు ప్రవేశం లభించింది. అందుకు కారణం అప్పటి మైసూరు రాజ్యపు దివాను అయిన సర్.కె. శేషాద్రి అయ్యర్‌తో డా. పల్పుకు గల పరిచయం, పలుకుబడి మాత్రమే. కళాశాల మొత్తంలో ఆశాన్ ఒక్కడే బ్రాహ్మణేతరుడైన విద్యార్థి!

ఆ రోజుల్లో అశాన్ తన మిత్రుడొకనికి వ్రాసిన లేఖలోని ఈ దిగువ అంశములనుబట్టి ఆ కాలపు స్థితిగతులు మనకు సూక్ష్మంగా తెలియవస్తాయి. (లేఖానువాదం రచయితది).

బెంగుళూరు.
1896 సెప్టెంబరు 1.

ప్రియమిత్రమా,

నీ పుస్తకము, జాబు చేరినవి. ఇంతవరకు ఉత్తరం వ్రాయనందుకు మన్నింపగోరుతున్నాను. నీకేకాదు, కాక్కాకుజి లోని మిత్రునికి కూడా నా క్షమాపణలు. నేను వ్రాయలేదుకాబట్టి అపరాధిని ...

నేను ఇక్కడి సంస్కృత కళాశాలలో విద్యార్థిగా చేరాను. ఈ సంస్థలో నేనొక్కడనే బ్రాహ్మణేతర విద్యార్థిని. నేనిక్కడ చదవడం చాలామందికి ఇష్టంలేదు. నా ప్రవేశాన్ని వారు వ్యతిరేకించారు. అయితే కాలగతి ప్రతికక్షుల వ్యతిరేకతను సడలింపజేసింది. ఇప్పుడు నాకు ఒకరూపాయ ఉపకార వేతనం లభిస్తున్నది. మరికొంత లభించే అవకాశాలుకూడా ఉన్నాయి. నేనిప్పుడు 'నీలకంఠీయము' అధ్యయనం చేస్తున్నాను.

ఇక్కడ జరుగుబాటు బాగానేవున్నది. నా క్షేమసమాచారములను మన ఇతర మిత్రులకు తెలియజేయగలవనుకుంటాను. ప్రతి మిత్రునికి విడివిడిగా ఉత్తరాలు వ్రాయాలని నా ఆకాంక్ష. కాని బద్ధకంవల్ల కొంత, వ్యవధి లేక కొంత ఎవరికీ వ్రాయలేకపోతున్నాను.

పద్యాలు వ్రాయడానికి సమయంలేదు. అయితే సంస్కృతంలో మళయాళంలో స్వల్పంగా రచనలు చేశాను.

మీ అందరి శ్రేయస్సుకై సర్వేశ్వరుని ప్రార్థిస్తున్నాను.

ఇట్లు,
మీ కుమార్.

ఆశాన్ మూడేండ్లు ఆ కళాశాలలో చదివాడు. తర్కశాస్త్రమును ఐచ్ఛిక విషయంగా తీసుకొని 'న్యాయవిద్వాన్' పరీక్షకు చదివాడు. మూడు నెలలకొకమారు జరిగే పరీక్షలో, ఏటా జరిగే పరీక్షలో మంచి మార్కులు తెచ్చుకునేవాడు. తుదిపరీక్షలో ప్రథముడుగా అతనే రాగలడని రూఢి అయింది. ఇది తెలిసికొన్న తక్కిన విద్యార్థులు అసూయజెంది అతను పరీక్షకు కూర్చో కుండా ఆటంకపరచాలని పథకం వేశారు. ఎన్నడూలేనిది, ఒక బ్రాహ్మణేతరునికి కళాశాలలో ప్రవేశమిచ్చినందుకు విరసనగా ఆందోళన లేవదీయగలిగారు. చివరకు దివాన్‌గారు ఆశాన్‌ను కళాశాలనుంచి తీసివేయక తప్పలేదు. ఆ కారణంగా ఆశాన్ పరీక్షకు కూర్చోలేకపోయ్యాడు.

సరిగ్గా ఈ ఆందోళన జరిగిన సమయానికే బెంగుళూరు పట్టణంలో ప్లేగు వ్యాధి వ్యాపించింది. వెంటనే కళాశాలను మూసివేశారు. పైగా ఆశాన్‌కు ఉపకారి, శ్రేయోభిలాషియైన డా. పల్పు ఉన్నత విద్యకై బెంగుళూరు వదలి యూరపు ఖండానికి వెళ్ళవలసివచ్చింది. ఇందువల్ల ఆశాన్ నిరాశకు లోనయ్యాడు.

అయితే ఆశాన్ పూర్తిగా త్యజింపబడలేదు. డా. పల్పు అతనిని తన సహాధ్యాయియైన డా. నంజుండరావుకు అప్పగించాడు. నంజుండరావుగారు అప్పుడు మద్రాసులో వుండేవారు. రావుగారు ఆశాన్‌ను బాగానే చూచారు. ఆశాన్ వినయ విధేయతలు, తెలివితేటలు రావుగారికి నచ్చాయి. తనవద్దనే వుండిపొమ్మన్నారు.

ఆశాన్ ఒక పండితునివద్ద చదువుకొంటూ మద్రాసులో ఆరుమాసాలున్నాడు. ఈ ఏర్పాటు డా. పల్పుకు తృప్తినివ్వలేదు. ఆయన సలహాపై రావుగారు ఆశాన్‌ను పై చదువులకు కలకత్తా పంపారు. ఇందుకు చేయబడ్డ ఏర్పాటేమిటంటే - డా. రావుగారు ఆశాన్‌కు ప్రతి నెలా రూ. 10 పంపాలి. ఆ మొత్తం డా. పల్పు ఖాతాలో వ్రాసివుంచబడుతుంది. రావుగారు ఆశాన్ తెలివితేటలను మెచ్చుకొని ఆ పదిరూపాయలకు తోడు మరి మూడు రూపాయలు సొంతంనుంచి చేర్చి పంపుతూ వుండేవారు. దీనివల్ల విద్యార్థియైన ఆశాన్‌కు ఖర్చు విషయంలో కొంత సౌలభ్యం, వెసులుబాటు కలిగాయి.

ఆశాన్ కలకత్తాలోని సంస్కృత కళాశాలలో చేరి న్యాయశాస్త్రమును అధ్యయన విషయంగా స్వీకరించాడు. అయితే అతను వ్యాకరణము, కవిత్వము

తరగతులకు కూడా హాజరవుతూవుండేవాడు. 'తర్కతీర్థ' బిరుదపు పరీక్షకు అతను రెండేండ్లు గడపవలసి వచ్చింది. ఆశాన్ రోజుకు 20 గంటలు పరిశ్రమ చేసి కష్టించి చదివాడు. తోడి విద్యార్థులు కొందరు అతన్ని పుస్తక కీటకమని పరిహసించారు. అతని గురువైన కామాఖ్యనాథ తర్కవాగీశన్ అతని కృషిని గమనించి పరమానంద భరితుడై కొన్ని ప్రత్యేక సందర్భములందు సంస్కృతంలో కవితా రచన చేయమని ఆదేశిస్తూ వుండేవారు. కలకత్తాలో వున్నంత కాలం ఆశాన్ మౌలికమైన రచనలు చేయలేకపోయాడు. అంటే అధ్యయనంలో అంతగా నిమగ్నుడై వుండేవాడన్నమాట. అయితే మళయాళ పత్రికలకు "ఒరువంగ దేశికన్" అనే మారుపేరుతో (అంటే ఒక బెంగాలీ దేశస్తుడు) రచనలు పంపుతూ వుండేవాడు.

కలకత్తాలో కూడా ఆశాన్ తుది పరీక్షకు కూర్చోలేక పోయాడు. కారణమేమంటే 1900లో కలకత్తా నగరంలో ప్లేగు వ్యాపించింది. పరీక్షలకుముందే కళాశాల మూసివేశారు. ఆశాన్ నగరం వదిలిపెట్టి పోవలసివచ్చింది. పాపం, అతనికి బిరుదం పొందే యోగం లేదేమో! ఆ సమయానికి డా. పల్పు బెంగుళూరు తిరిగివచ్చారు. అందుచేత చిన్నస్వామి (డా. పల్పు ఆశాన్‌ను సప్రేమముగా ఆ పేరుతో పిలిచేవారు) కలకత్తానుంచి బెంగుళూరు వెళ్ళాడు. ఆ తర్వాత డా. పల్పుతో కలిసి తిరువనంతపురం చేరుకున్నాడు.

కేరళ విడిచి ఇతర ప్రదేశాలలో ఆశాన్ గడిపిన అయిదేండ్ల కాలము నిష్ప్రయోజనమైనదనే చెప్పాలి. ఏమంటే—అతను ఒక పట్టముగాని, బిరుదముగాని పొందలేకపొయ్యాడు. పట్టము సాధించడమే విద్యయొక్క ముఖ్య లక్ష్యమైతే ఆశాన్ పడ్డ ప్రయాస, వెచ్చించిన కాలం వ్యర్థమయ్యాయనే చెప్పాలి. అట్లాకాక శాస్త్రాలలో, పాఠ్య విషయాలలో విజ్ఞానం సముపార్జించడం ప్రధాన ధ్యేయమనుకొంటే అది ఆశాన్ జీవితంలో ఫలప్రదమైన దశ అని చెప్పుకోవాలి. అనేక రకాల అనుభవాలు పొంది, జీవితాన్ని దాని వైవిధ్యంతో సహా అర్థంచేసుకొని, జీవితం కోరేవాటిని పరిపక్వరీతిలో సమకూర్చుకోగలగడం ప్రధాన గమ్యమని అనుకుంటే ఆశాన్ జీవితంలో ఇది మిక్కిలి ప్రయోజనకారియైన దశ అని అనాలి. బెంగుళూరులో, మద్రాసులో, కలకత్తాలో అతను గడపిన జీవితం కన్నడ, తమిళ, బెంగాలీ సాహిత్యాలతో పరిచయం కలిగించింది. అంతేగాక ప్రతిచోటా సంస్కృతాంగ్ల భాషలలో మరికొంత సాధనచేసే వీలు కలిగింది. వీటన్నిటివల్ల ఆశాన్‌కు మేలే కలిగింది.

తన స్వంత రాష్ట్రంలో తాను గ్రాహ్యంచేసుకున్న విద్యా సంస్కృతులకు చాలా భిన్నమైన సంస్కృతి సంప్రదాయాలను గమనించి వాటిని అర్థంచేసుకోవడంవల్ల అతని దృష్టి విశాలమైంది. మానసికంగా ఎంతో పెరిగాడు.

1895లో కేరళప్రాంతమును విడిచిపోకమునుపే అతను తమిళభాషలో మంచి ప్రవేశం సంపాదించాడు. సంస్కృతంలోకూడా మంచి పరిజ్ఞానం కలిగింది. బెంగుళూరు, కలకత్తా నగరాలలో వుండగా సంస్కృతం అతనికి విశేష విజ్ఞాన సముపార్జనా విషయంగా వుండేది. బెంగుళూరులో గడిపిన మూడేండ్లవల్ల ఆశాన్‌కు కన్నడ భాషా సాహిత్యాలతో పరిచయం కలిగివుండవచ్చు. అయితే ఆంగ్లభాషపై అతనికిగల మక్కువ దాదాపు ఒకవిధమైన వ్యామోహమని చెప్పాలి. బెంగుళూరులో వుండగా ఇంట్లో ఇంగ్లీషు చదివి అందులో చాలా మేరకు పరిజ్ఞానం సంపాదించాడు. ఈ విషయంలో డా. పల్పు కుటుంబంవారు అతనికెంతగానో సహాయపడ్డారు. బెంగుళూరు, మద్రాసులలో అతను ఇంగ్లీషులో మంచి ప్రవేశం లేకపోయినా నెట్టుకుపోగలిగాడు. కాని కలకత్తాలో ఇంగ్లీషు అత్యావశ్యకమైంది. అందుచేత ఆశాన్ పట్టుదలతో ఇంగ్లీషు చదివాడు. ఆంగ్లభాషాసాహిత్యాలను అధ్యయనం చేసినకొద్దీ అవి అతన్ని మరింతగా ఆకర్షించాయి. ఈ అభిమానంవల్లా, నిత్యం ఇంగ్లీషు భాషను ప్రయోగించే అలవాటువల్లా క్రమేణా ఆ భాషలో మంచి ప్రావీణ్యం సంపాదించాడు. ఆ తరువాత కొన్ని సంవత్సరాలకు అతను తన పద్యాలకు నోట్సు, తన డైరీలూ చాలావరకు ఇంగ్లీషులోనే వ్రాశాడు. దీనివల్ల ఆంగ్ల భాషలో అతనికేర్పడిన సాన్నిహిత్యం మనకు తెలియవస్తున్నది. తిరువాన్కూరు శాసనసభలో అతను ఇంగ్లీషులో ప్రసంగించేవాడు. ఇట్లా ఇంగ్లీషులో ప్రసంగించే అభ్యాసం అతను కేరళకు వెలుపల గడిపిన ఆయాదేండ్లలో కలిగింది. ఇంగ్లీషులో అతను ప్రసంగిస్తూవుంటే విన్నవారు ఆ భాషపై అతను సాధించిన ప్రావీణ్యాన్ని నేటికీ ప్రశంసిస్తారు. అయితే అతని ఉచ్చారణ పట్లమాత్రం అసంతృప్తి వ్యక్తంచేస్తారు.

ఆశాన్ కలకత్తాలో వుండగా రవీంద్రనాథ టాగూరు వయస్సు రమారమి 40 ఏండ్లు. టాగూరు రచించిన భావోద్వేగ పూరితమైన కాల్పనిక కవితా ఖండికలు అప్పటికే ప్రచురితమయ్యాయి. నిజానికి ఆ రోజుల్లో బెంగాలీ సాహిత్యంపై కాల్పనికోద్యమమనే గాలి ప్రచండంగా వీస్తోంది. సున్నిత హృదయుడైన యువకవి ఆశాన్ కాల్పనిక కవితా ప్రభావానికి లోనుగాకుండా

వుండలేకపోయాడు. టాగూరుపై ఆశాన్‌కు ఎంతటి గౌరవం వుండేదో తెలుసుకోవడానికి అతను రచించిన 'దివ్యకోకిలం' అనే కవిత చాలు. దీనిని అతను 1922లో టాగూరు కేరళ పర్యటనకు వచ్చిన సందర్భంలో రచించి చదివాడు. అంతేగాక సంస్కృతంలో 'స్వాగతపంచకము' రచించి, టాగూరు ఆలువా (అల్వే)లోని అద్వైతాశ్రమమును సందర్శించినప్పుడు సమర్పించాడు ఆశాన్ తన సాహిత్య విమర్శన వ్యాసాలలో టాగూరు ప్రస్తావన బహుధా తెచ్చాడు. బెంగాలీ సాహిత్యంపై ప్రసరించిన పాశ్చాత్య ప్రభావం ఆశాన్‌ను నిశ్చయంగా ఆకర్షించివుంటుంది. అతనికి బెంగాలీ అంతగా రాదు గనుక ఆశాన్ వాటికి మూలకందములైన షెల్లీ, కీట్సు, బ్రౌనింగ్‌వంటి మహాకవుల రచనల పరామర్శ చేసివుంటాడు. ఆశాన్ ఈ కవుల రచనలు చదివి తాదాత్మ్యం పొందేవాడని చెప్పడానికి కావలసినన్ని నిదర్శనాలున్నాయి. ఏమైనప్పటికీ కలకత్తా జీవితం కుమారన్ ఆశాన్‌కు ఆంగ్లసాహిత్య సౌధ ద్వారాలను తెరచి ఆ రమణీయ సౌధంలోని అందచందాలను అవలోకించే అవకాశం కలుగ జేసింది.

ఆశాన్ జీవితంలో వినూత్న వికాసం కలుగజేసిన మరొక అవస్థనుకూడా ఇచ్చట ప్రస్తావించవలసిన అగత్యమున్నది స్వామిగారితో ఆశాన్‌కుగల అనుబంధము భక్తి ప్రపత్తులతోకూడినది. అందులో గౌరవంకూడా మిళితమై వుంది. అతను తన తల్లిదండ్రులను ప్రేమించినప్పటికీ ఆ సంబంధములో చెప్పుకోదగిన ప్రత్యేకత ఏమీ లేదు. ఒకవేళ ఏమైనా వున్నదంటే అది మమకారంలేని నిర్లిప్తత అనాలి. అందుకు కారణాలేమిటో పూర్తిగా వివరించ లేము. ఇక డా. పల్పుతో అతనికిగల అనుబంధం ప్రేమ—కృతజ్ఞతా భావముల మిశ్రమము. ' శ్రీమతి పల్పు, ఆమె పిల్లలు అతన్ని ప్రేమతో శ్రద్ధగా ఆదరిం చారు. మానవునికి సంప్రాప్తమయ్యే అనుబంధాలలో ఇదొక ప్రత్యేక అనుభవాన్నిచ్చే రాగబంధము. రక్తసంబంధముగాని, న్యాయశాస్త్ర సమ్మతమైన మరొక బాంధవ్యముగాని లేనప్పటికీ డా. పల్పుగారి ఇల్లు ఆశాన్‌కు సొంత ఇల్లుగా అనిపించేది. వారింట్లో ఆ కుటుంబంవారిమధ్య వున్నప్పుడు ఆశాన్ అపరిమి తానందం పొందేవాడు.

'గరిసప్పనది'ని గూర్చి ఆశాన్ ఒక కావ్య ఖండిక రచించాడు. ముందే చేసుకున్న ఏర్పాటుప్రకారం అతను డా. పల్పునూ, ఆయన కుటుంబంవారినీ ఆ నదీతీరమున కలుసుకున్నాడు. ఇది బెంగుళూరులోని వారి గృహాన్ని విడిచి

వచ్చిన తరువాత పదకొండేండ్లకు జరిగింది. ఆ కుటుంబంవారితో అతనికిగల సన్నిహిత అనుబంధం ఈ కావ్యఖండికలో ఒక మధురస్మృతిగా ప్రతిబింబించింది.

ఆశాన్ కొన్ని నెలలు డాక్టర్ నంజుండరావుగారి ఇంట్లో వున్నాడని మన మిదివరకే తెలిసికొన్నాము. కలకత్తాలో అతను ఒక బ్రాహ్మణ కుటుంబంవారితో వున్నాడు. వారికి అతనంటే చాలా ఇష్టం. ఆశాన్ నగరం వదిలి వెళ్ళేటప్పుడు ఆ కుటుంబంవారంతా తెల్లవారకముందే రైలు స్టేషనుకు వచ్చి అతనికి సాదరంగా వీడ్కోలిచ్చారు. అతను కనుమరుగై పోయిన తర్వాత వారు కంట తడిపెట్టారు. ఆ కుటుంబంవారితో అతనికిగల స్నేహము ఎటువంటిదో హెచ్చుగా తెలియదు. అయితే ఒకానొక సందర్భంలో ఆశాన్ తానక్కడే మరికొంతకాలం వున్నట్లయితే బహుశా ఒక బెంగాలీ అమ్మాయిని పెళ్లాడి, అక్కడే స్థిరనివాస మేర్పరచుకొనే వాడినని అన్నాడు. కాని మళయాళ సాహిత్యానికి మంచి రోజులు రానున్నవి గనుకే అలా జరగలేదు.

కేరళ దేశానికి వెలుపల బెంగాలీ, కన్నడ, మళయాళ కుటుంబాలతో కలిసి వుండి అతను గడిపిన జీవితమూ, ఉపాధ్యాయులతో విద్యార్థులతో వివిధ పూర్వ రంగాలుగల సాహిత్యకులతో అతనికేర్పడిన పరిచయాలూ కుమారన్ ఆశాన్ జీవితాదర్శాన్ని సుసంపన్నం చేశాయి. కేరళలో చెప్పుకోదగ్గ మరి యేకవికీ మనస్సులో హత్తుకుపోయ్యే భావాలు, అనుభూతులు, అనుభవాలు కలిగే కౌమార యవ్వనదశలో ఇటువంటి సదవకాశం లభించలేదు. వల్లతోళ్ మహాకవి భారత దేశంలోనూ, ప్రపంచంలోనూ అనేక ప్రాంతాలు సందర్శించాడు. కాని అదంతా ఆయన జీవితంలో ఎప్పుడో ఆలస్యంగా జరిగింది. ఈ విషయంలో ఆశాన్ అదృష్టవంతుడు. జీవితారంభ దశలోనే వైవిధ్య సమన్వితమైన అనుభవాలను పొందబట్టే అంతటి మహాకవిగా అవిర్భవించాడు.

# 4. కులం పిలిచింది

కలకత్తానుంచి కేరళకు తిరిగి వచ్చిన తర్వాత ఆశాన్ తనకు గురువు,తనను మలిచిన మహనీయుడూ అయిన నారాయణగురువు వద్దకు వెళ్ళాడు. ఈ విధంగా అరువిప్పురం ఆశ్రమం తిరిగి అతనికి నివాస స్థానమైంది. స్వామిగారు

పెట్టుకున్న లక్ష్యానికి కార్యరూప మివ్వడంలో అతను మరింత సామర్థ్యంతో తోడ్పడ్డాడు. అతనికి కూడా ఆ ధ్యేయంపై మనస్సు లగ్నమైంది. అప్పు డతని వయస్సు 27. అనేక అభిరుచులతో, ఆదర్శాలతో అతని వ్యక్తిత్వం అప్పటికే యుక్తదశకు చేరుకుంది. స్వామిగారి నాయకత్వాన ఈజవకులం వారి అభ్యున్నతికై తలపెట్టబడ్డ మత, సాంఘిక కార్యకలాపాలు బాగా విస్తరించాయి. నాయకులుగా నిలిచినవారు తాము చేపట్టిన చిన్న వ్యవస్థను పెంపుచేసి, దానికి చైతన్యం కలిగించి, దాని కార్యకలాపాలను మరింత విస్తృతం చేయవలసిన అవసరమున్నదని గ్రహించారు. అది జరగాలంటే మొదట ఆ సంస్థను ఒక సొసైటీగా రిజిష్టరు చేయాలి. ఈ విధంగా 1902 లో 'శ్రీ నారాయణ ధర్మ పరిపాలనాయోగం' అనే పేరుతో ఒక సొసైటీ ఈజవకులం వారి మత, సాంఘిక, విద్యా విషయక శ్రేయస్సును సాధించుటకై రిజిష్టరు చేయ బడింది. ఈ సొసైటీకి నారాయణగురు శాశ్వత అధ్యక్షుడు, ముఖ్య ప్రేరకుడు. ఈ భావనకు ముఖ్య నిర్మాతయైన డా. పల్పును ఉపాధ్యక్షుడుగా ఎన్నుకున్నారు. ప్రధాన కార్యదర్శి పదవిని కుమారన్ ఆశాన్‌కు అప్పగించ వలెనని అంతా ఏకగ్రీవంగా తీర్మానించారు. సంస్థలో ముఖ్యమైన పదవులకు ఇంతకన్న మంచి జట్టు వేరే వుంటుందా? యోగం కార్యాలయాన్ని తిరువనంతపురంలో నెలకొల్పారు.

ఆశాన్ తన యావత్తు కాలమునూ, శక్తియుక్తులనూ యోగం నిర్మాణానికే వినియోగించాడు. అతను ఎంత దీక్షతో కృషి చేశాడంటే కొన్నేండ్ల లోపలే సొసైటీ అన్ని విధాలా పురోగతిని సాధించింది. యోగం నిర్మాణ దశలో వున్నప్పుడు ఆశాన్‌కు కవితా రచన చేయడం పడలేదు. అందుకు తీరుబాటేది? సమయ మెక్కడిది? యోగం శాఖలు దక్షిణాన కన్యాకుమారి మొదలు ఉత్తరాన మెంగుళూరు వరకు నెల కొల్పబడ్డవి. ఈజవలు సాంఘికంగా అనేక అనర్హతలకులోనై పైకి రాలేక పోయ్యారు. 19 వ శతాబ్ది ముగిసి ఇరవయ్యో శతాబ్ది ఆరంభమవుతున్న కాలంలో వారి స్థితి ఎలా వుండేదో ఇప్పుడు ఊహించడం సులభం కాదు. స్టేట్ మాన్యువల్సు, చరిత్ర పుస్తకాలు తిరగవేసినా ఆ కులంవారి స్థితి అంత చెడ్డగా వుండేదా అని ఇప్పుడు మనం ఆశ్చర్యపోతాము. ఎందు చేతనంటే గడచిన నాలుగైదు దశాబ్దాలలో పరిస్థితి పోల్చుకోలేనంతగా మారిపోయింది. తన కులం ఇంతటి హీనస్థితిలో అవమానాలపాలై వున్నందుకు ఆశాన్ చాలా బాధ పడ్డాడు. మనో వాక్కాయ కర్మలతో తన యావజ్జీవితాన్ని తన కులం వారి విమోచనకు అంకితం చేయడానికి కృత నిశ్చయుడయాడు.

అందరినీ కూడగట్టి వ్యవస్థా నిర్మాణం చేయగల సమర్థుడు గనుక దేశమంతా అతని కులం వారి కోర్కెలలో గల న్యాయాన్ని, ఔచిత్యాన్ని గుర్తించింది.

యోగం తన కృషి నంతటినీ మత సాంఘిక, విద్యా విషయక కార్యాలపై కేంద్రీకరించింది. ఆరంభ దశలో రాజకీయాలను అంతగా పట్టించుకో లేదు. పబ్లికు రోడ్లపై ఈఙవలు స్వేచ్ఛగా సంచరించడం, ప్రజాధనం వెచ్చింపబడే పాఠశాలల్లో కళాశాలల్లో వారికి ప్రవేశం పొందే హక్కు, ప్రజం డబ్బుతో నిర్వహింప బడే దేవాలయా లన్నింటిలో ఆరాధనా స్వాతంత్ర్యం—వీటిని మొదట సాధించడానికి యోగం పూనుకున్నది. అభ్యుదయంవేపు పురోగమించే ఆధునిక సమాజంలో అంటరాని తనం, ఒక చోటికి రాకూడదన్న ఆంక్షలు సహింప దగినవి కావు. నీచకులానికి చెందిన వ్యక్తి మహమ్మదీయ మతంగాని, క్రైస్తవ మతంగాని పుచ్చుకున్నప్పుడు పై రెండు అనర్హతలు అదృశ్యమవుతున్నాయికదా! అయితే తమ కులం వారంతా మూక ఉమ్మడిగా అన్యమతాలలో చేరి వారిని పీడిస్తూ వున్న అనర్హతలనుండి విముక్తి పొందండని ఉద్బోధించడం డా. పల్పుకూ, ఆశాన్‌కూ ఇష్టం లేదు. తీయాలు తీయాలుగానే వుండి తలెత్తుకు తిరగాలి. అదే వారికి గర్వకారణం. యోగం ఆరవ వార్షిక మహా సభలో డా. పల్పు అధ్యక్షోపన్యాసం, ఇరవయ్యో వార్షిక మహా సభలో ఆశాన్ అధ్యక్షోపన్యాసం ఈ విషయాన్ని ఎట్టి సందేహాలకు తావివ్వకుండా విస్పష్టం చేశాయి.

దిన దినాభివృద్ధి జెందుతూవున్న ఎస్. ఎన్. డి. పి. యోగం ప్రధాన కార్యదర్శిగా ఆశాన్ నిమిషం తీరిక లేకుండా బహు కార్య నిమగ్నుడై వుండేవాడు. కేరళ దేశమంతా తిరిగి తమ సొసైటీ శాఖలు నెలకొల్పి ఉపన్యాసాలిచ్చి, విభేదాలు తగాదాలు వస్తే వాటిని పరిష్కరించి, హెచ్చుగా మరొకరి సహాయం లేకుండానే కేంద్రకార్యాలయ ప్రతినిధిగా వ్యవహరించేవాడు. అజ్ఞానంలో అలమటిస్తూ, తమకు నిరాకరింపబడిన హక్కు లేవో ఎరుకలేని అమాయక ప్రజలను మేల్కొల్పేవాడు. అధిక సంఖ్యాకులు వున్న దానితోనే సంతృప్తి జెంది ప్రస్తుత వ్యవస్థను సవాలు చేయడమెందుకులే అన్న ధోరణిలో వుండేవారు. ఈ జడత్వాన్ని రూపుమాపి, కులం వారిలో అవలక్షణా లేవీలేని అసంతృప్తిని రేకెత్తించి, విద్యా విజ్ఞానాలపట్ల, సమానత్వంపట్ల కోర్కె పుట్టించి, మార్పుకోసం ఆతురత కలుగజేసి కులంలో పెద్ద సంచలనం కలిగించే మహా కార్యాన్ని యోగం తన ప్రధాన కార్యదర్శికి అప్పగించింది. ఆశాన్ తన కర్తవ్యాన్ని కడు సామర్థ్యంతో,

ప్రశంసనీయమైన ఓర్పుతో, లక్ష్యాన్ని సాధించి తీరాలన్న పట్టుదలతో నెర వేర్చాడు.

దీనికి తోడు 'వివేకోదయం' *పత్రిక సంపాదకత్వమును, దాని ప్రచురణ భారమును ఆశాన్‌కు అప్పగించారు. ఈ పత్రికను చాలా మంది "ఈజవ గెజెట్" అని వ్యవహరించేవారు. దీని మొదటి సంచిక 1904 ఏప్రిలులో ప్రచురితమైంది. ఈ పత్రికలో తమ సంఘం వారిని చైతన్యవంతులుగా, చేసే వ్యాసములు, శాఖలు వ్యవహరించ వలసిన తీరుపై సూచనలు, యోగం వార్తలు, సాహిత్యము, విజ్ఞాన మునకు సంబంధించిన రచనలు ప్రకటింపబడుతూ వుండేవి. యోగమునకు వాణిగా ఈ పత్రిక భాసించింది. దూరప్రాంతాలలో కొన్నేండ్లుండి ప్రయోజన కరమైన అనుభవాలుపొంది స్వదేశానికి తిరిగి వచ్చిన ఉదీయమానుడైన కవికి, ఈ పత్రిక మంచి వేదికగా ఉపకరించింది. పత్రికతో ఆశాన్‌కు సంబంధం వుండ టంవల్ల "వివేకోదయం" కేవలం సొసైటీకి వాణిగా వుండిపోవడమే గాక, కేరళ లోని సాహితీ ప్రియులందరూ ఆదరించదగిన సాహిత్య పత్రికగా కూడా పేరు తెచ్చుకుంది. "వివేకోదయం" ముఖ్యంగా మూడు రంగాలలో—అంటే సాహిత్య, సాంఘిక, రాజకీయ రంగాలలో కృషి చేసింది. సంపాదకుడైన కుమారన్ ఆశాన్ దానిని శక్తివంతమైన సాధనముగా, ప్రతిష్ఠ గల పత్రికగా రూపొందిం చాడు. ఆ పత్రికలో వెలువడిన సంపాదకీయాలను పరిశీలిస్తే అవి హేతువాద యుక్తంగా పాఠకులను ఒప్పించి వారిని ఉత్తేజపరచగల చక్కని వచన రచనకు ఉత్తమ తార్కాణములుగా కనిపిస్తాయి.

యోగం వార్షిక మహా సభలతోపాటు రెండు పారిశ్రామిక ప్రదర్శనములను కూడా ఆశాన్ ఏర్పాటు చేయగలిగాడంటే చాలా మందికి ఆశ్చర్యం వేస్తుంది. మొదటి ప్రదర్శనం రెండవ వార్షిక మహాసభతోపాటు 1904 లో కోయిల్‌న్‌లో (కొల్లం) ఏర్పాటు చేయబడింది. రెండవది 1906 లో కెన్ననూరులో (కణ్ణూరు) నాల్గవ వార్షిక మహాసభ సందర్భంగా ఏర్పాటైంది. ఇట్టి ప్రదర్శనలు ఏర్పాటు చేయవలెనన్న ఆలోచన తట్టింది డా. పల్పు గారికే. కాని దానికి కార్యరూపమిచ్చి పూర్తి విశ్వాసంతో, దూరదృష్టితో వ్యవస్థీకరించ గలిగాడు కుమారన్ ఆశాన్.

*ఆశాన్‌కూ, యోగం కార్యకర్తలకూ స్వామీ వివేకానందుని పై గల భక్తి తాత్పర్యాలను వెల్లడించడానికై ఈ పత్రికకు 'వివేకోదయం' అన్న పేరు పెట్టారు.

భారతదేశంలో ఏ ప్రాంతంలోనైనా అట్టి పారిశ్రామిక ప్రదర్శనలు అరుదైన ఆ కాలంలో వాటిని ఆచరణ సాధ్యం చేయగలిగాడంటే ఆశాన్ కవి మాత్రమేగాక కార్యదక్షత గల వ్యవహర్త అని కూడా చెప్పాలి.

# 5. సంప్రదాయ కవితలు

కవితా రచనలో సమర్థుడని చెప్పడానికి కుమారన్ ఆశాన్ ఇది వరకే కొంత కావ్య సృష్టిచేసి పఠితలకు పరిచయమైనప్పటికిని, ప్రథమ శ్రేణికి చెందిన కవిగా అతని వికాసము కొంత ఆలస్యంగానే జరిగిందని చెప్పాలి. ఇందుకు అనేక కారణా లున్నాయి. కలకత్తానుంచి కేరళకు తిరిగి వచ్చినప్పుడు అతని వయస్సు 27. వెంటనే నారాయణగురు ఆశ్రమంలోచేరి మత, సాంఘిక కార్యకలాపాలలో నిమగ్నుడయ్యాడు. రెండేండ్ల లోపలే ఎస్. ఎన్. డి పి. యోగం సంస్థకు ప్రధాన కార్యదర్శి అయ్యాడు. అది బరువు బాధ్యతలతో కూడుకున్న పదవి. యోగం కార్యకలాపాలను ఎప్పటికప్పుడు ఒక పథకం ప్రకారం నిర్ణయించడం, ఆ సంస్థ దైనందిన పరిపాలనను నిర్వహించడం వంటి పనులలో రమారమి ఐదేండ్లు కృషి చేశాడు. ఇందువల్ల సృజనాత్మక రచనకు అతనికి వ్యవధి లేకపోయింది. శక్తి చాలకపోయింది. 35 ఏండ్లవయస్సు వచ్చిన తరువాతే కావ్య నిర్మాణం విషయంలో ఆశాన్ దృక్పథం ఒక నిస్పష్ట రూపం దాల్చింది. ఇందుకు అతని రచన "ఒరు వీణ పూవు" (రాలిన పూవు-1908) నిదర్శనము. అయితే పద్యరచనలో అతని చిరుతప్రాయపు ప్రయత్నములకూ, సంపూర్ణ వికాసం చెందిన పరిణత దశకూ మధ్య కేవలం శూన్య స్థితేననీ, ఆ మధ్యకాలంలో అతను ఎట్టి రచన చేయలేదనీ అనుకోవడం సరి కాదు. ఇటు "కావ్య దేవతను" ఆరాధించడమా, లేక అటు "వ్యవస్థా సంబంధమైన పనులను" చూడటమా అని అతను విచికిత్సలోపడ్డ మాట నిజమే. ఒక్కొక్కప్పుడు ఈ రెండిటి మధ్య ఊగిసలాడి రెంటికీ అర్రులు సాచినమాటా యధార్థమే. చివరకు కులం పిలుపుదే పైచేయి అయింది. కావ్య రచన చేయమని అంతరంగము సదా అతన్ని ప్రేరేపిస్తూ వుండేది. కాని పరిస్థితులవల్ల విఖ్యాత కవిగా పరిగణన పొందలేక పోయ్యాడు. విశిష్ట కవిగా అవిర్భావము (దీనినే

మళయాళ వ్యావహారికంలో 'అరంగేట్టం' అంటారు) ఇంకను జరగవలసి వున్నది. యోగం పదవీ బాధ్యతలను మీద వేసుకోవడానికి రెండేండ్లు ముందు ఆశాన్ కొంత కావ్య రచన చేశాడు. అది విస్మరింపరానిది :

1. సౌందర్యలహరి (అనువాదము)—1901.
2. శివస్తోత్రమాల—1902.
3. మేఘసందేశము (అసంపూర్ణ అనువాదము) —1902.
4. విచిత్ర విజయము (నాటకము)—1902.
5. ప్రబోధ చంద్రోదయము (అనువాదము)—1902.

మొదటిది, మూడవది, అయిదవది సంస్కృత ప్రాచీన మహాకావ్యముల అనువాదములు. నాల్గవది —అంటే విచిత్రవిజయము సుప్రసిద్ధ సంస్కృత నాటకములు ఆధారంగా, స్తోత్రములు ఆధారంగా విరచితమైన నాటకం. ఈ రచనలలోని విషయమేమిటి? వీటి నిర్మాణరీతి యెట్టిది? అనే ప్రశ్నల జోలికి పోనక్కరనేకుండానే అవి సంప్రదాయకమైన రచనలన్న నిర్ణయానికి మనం రావచ్చు. అయితే ఇవి పద్యములను కూర్పుచేయడంలో నిస్సందేహంగా మంచి వ్యాయామాభ్యాసములు. కావ్యరచనా కౌశలానికీ, దాని పనితనాన్ని గ్రహించడానికీ ఇవి మన కవికి మంచి అనుభవమిచ్చాయి. 19వ శతాబ్ది ముగిసి ఇరవయ్యో శతాబ్ది ఆరంభమవుతూవున్న మలుపులో కేరళలో కావ్యరచన హెచ్చుగా ప్రాచీన సంస్కృత మహాకావ్యాల అనుకరణంగా, కేవలం అతి అలంకార ధోరణిలో, సంస్కృత ఛందోనియమబద్ధంగా అలంకార శాస్త్రాను గుణంగా సాగుతూ వుండేది. ఇక భాషావిషయకంగా చూస్తే కావ్యభాష సంస్కృత —మళయాళముల మిశ్రమంగా వుండేది. కావ్యరీతి, రచనావిధానం సంస్కృతం ఒరవడిలో వుండేవి.

పరుగుతీయడంలో ప్రపంచంలో మేటి అనిపించుకున్న వ్యక్తి సైతం మొదట తప్పటడుగులువేస్తూ పడుతూ లేస్తూ నడక నేర్చుకుంటాడు. అట్లే ప్రతి భావంతుడైన కవి కూడా మొదట అనుకరణములతో, అనుసరణలతో ఆరంభించి క్రమంగా వాటిని అధిగమించి, స్వీయ ప్రతిభను వ్యక్తం చేస్తాడు. ఇది సిద్ధి పొందే దశ. కొందరు కవులకిది కొద్దికాలం మాత్రమే వుంటుంది. మరి కొందరికి దీర్ఘకాలం పట్టడం సహజం. ఇదంతా కొంతవరకు పరిస్థితులపైన, కొంత వరకు కవియొక్క మన స్థితిపైన ఆధారపడి వుంటుంది. ఏమైనప్పటికీ ఒక కవి ఒకానొక విధంగా ఎందుకు ప్రవర్తిస్తాడో, ఒక తీరుగా ఎందుకు రూపొందుతాడో

వివరించి చెప్పడం సులభం కాదు. కారణమేమంటే అతన్ని అట్లా మలిచిన స్థితి గతులనూ, ప్రభావములనూ జాడతీసి కనుగొనడం మనకు సాధ్యంకాక పోవచ్చు. ఒక్కొక్కప్పుడు అసలు సాధ్యపడదు కూడా!

పైన పేర్కొనబడిన మూడు అనువాదములు పద్యముల కూర్పులో మంచి అభ్యాసములని తప్ప, వేరే ఏమీ ఇచ్చట చెప్పవలసిన పనిలేదు. శివస్తోత్రమాల 21 పేజీల చిన్న కృతి. దీనికి రచయిత వ్రాసిన మున్నుడి ఒకటి వున్నది. పుస్తకంలో శ్లోకము లెంత మనోరంజకముగా వున్నవో ఈ మున్నుడి కూడా అంతే కుతూహలముతో చదువ దగినదిగా వున్నది. మానవుని మనశ్శాంతికి, ఆనందానుభూతికి భక్తి ప్రధానములైన పద్యములు, గేయములంత మంచివి వేరే లేవు. ఆస్తికులకు, దైవముపై విశ్వాసముగల వారికి భక్తి గీతములు కలుగజేయు ఉపశమనము, ఆనందము గుళ్లు గోపురాలుగాని, మూల విరాట్టులుగాని, ఉత్సవ విగ్రహములుగాని లభింపజేయలేవని కవియే అన్నాడు. మంచి సహేతుకమైన వాదముతో, సముచితమైన కల్పనలతో భక్తిగీతముల విలువ, వాటి ప్రాముఖ్యం విషయంలో పాఠకులను సమాధాన పరుస్తాడు ఈ కవితలు భక్తుని ఇంద్రియ సుఖాసక్తినుండి మరలించి పరమాత్మతో లీనమై, అలౌకికానంద మనుభవించమని ప్రబోధిస్తాయి.

## విచిత్ర విజయము

ఈ నాటకం వ్రాతప్రతినిబట్టి చూడగా దీని రచన 1902 సెప్టెంబరు 19 తేదీన ఆరంభింప బడ్డదని తెలియ వస్తున్నది. అయితే ఎప్పుడు పూర్తి అయి నదో తెలుప బడలేదు. వాస్తవానికి ఇది అసమగ్ర రచన. కేరళ ప్రాంతంలో ఈ నాటకానికి జనాదరణము లభించి పేరు పొంది నప్పటికీ దీనిని ప్రచురించుటకు ఆశాన్ ఇష్టపడలేదు. ప్రచురణ యోగ్యముగా చేసే ముందు వ్రాతప్రతిని పూర్తిగా సంస్కరించి మార్పు చేర్పులు చేయవలెనని అతని అభిప్రాయము. కాని అది ఆయన మరణానంతర ప్రచురణగా వెలువడింది. నిష్కర్షగా చెప్పాలంటే ఇది అసంపూర్ణ రచన అయినప్పటికీ దాదాపు సమగ్రరచనే అని చెప్పాలి. భరత వాక్యం మొదలైన విశేషాలతో ఇది సాంప్రదాయికమైన ముగింపు లేని నాటకం. అయినా ఇప్పుడు దీనికి లభిస్తూ వున్న ఆదరణకన్న మరికొంత ప్రోత్సాహం పరిగణన అవసరం.

ఈ నాటకం అయిదు అంకములుగా విభజింపబడి వున్నది. ఒక ప్రాచీన గాథ ఆధారంగా దీని రచన జరిగింది. ఆ గాథకు మూలమేమిటో సరిగా తెలియదు. కాశీరాజైన బ్రహ్మదత్తుడు కోసల భూపతియైన దీర్ఘధీని యుద్ధంలో ఓడించాడు. చాలా ఏండ్లు గడచిన తరువాత, దీర్ఘధీ, అతని భార్యా పుత్రులు కాశీలోని కుమ్మరి వాడలో ప్రచ్ఛన్నంగా నివసిస్తున్నారన్న వార్త బ్రహ్మదత్తునికి తెలియ వస్తుంది. దీర్ఘధీనిపట్టి చంపండని బ్రహ్మదత్తుడు ఆజ్ఞాపిస్తాడు. ఈ సంగతి దీర్ఘధీకి తెలిసి కూడా అతను తప్పించుకు పారిపోడు. ఒక రాత్రి సైనికులువచ్చి దీర్ఘధీని అతని భార్య ఎదుటనే కొట్టి హింసిస్తారు. అతను చూస్తూ వుండగానే ఆమెను అవమానపరుస్తారు. దీర్ఘధీని నది ఆవలిపక్కకు తీసుకుపోయి అతని శిరచ్ఛేదనం చేయదానికని అతన్ని ఒక పడవలో తీసుకొని పోతూవుండగా తన భార్య మృత దేహం నది నీటిపై తేలుతూ వుండడం అతను చూస్తాడు. ఆమె నదిలో దూకి ఆత్మ హత్య చేసుకుంది. అప్పుడు కోసలరాజు కుమారుడైన దీర్ఘబాహు నగరంలో లేడు. ఎక్కడో తన ఉపాధ్యాయునివద్ద వున్నాడు. తన తండ్రిపై జరిగిన అత్యాచారము తెలుసుకొని హుటాహుటి నదీ తీరానికి చేరుకుంటాడు. కొడుకును చూచిన తండ్రి ద్వేషమును ద్వేషముతో గాక ప్రేమతో జయించ వలెనని మరణించేముందు ఉపదేశిస్తాడు. కాని కుమారునికి ఈ ఉద్బోధ అప్పుడు నచ్చదు.

కొన్ని సంవత్సరాలు గడచిన తరువాత దీర్ఘబాహు బ్రహ్మదత్తుడి కుమార్తె యైన ప్రేమలతకు సంగీతం నేర్పే గురువుగా కుదురుకుంటాడు. అతను ప్రేమ లతను ప్రేమిస్తాడు. కాని ఆమె తండ్రిపై పగ తీర్చుకో వలెనన్న పట్టుదల అతనిలో వుంది. అటు ప్రేమ, ఇటు ప్రతీకార వాంఛ—ఈ రెండింటి మధ్య వుండే సంఘర్షణను రచయిత ప్రశంసనీయంగా ఈ నాటకంలో విశిష్టశైలిలో చిత్రించాడు ఆ ప్రేయసీ ప్రియుల ప్రేమఘట్టాలను రచయిత మనోహరంగా ప్రదర్శింపజేసిన తీరును బట్టి చూస్తే 'చిన్నస్వామి' అని పేరుపడ్డ ఈ ఆధ్యాత్మిక వేత్త అటువంటి రమ్యదృశ్యాలను ఎలా రచించ గలిగాడా అని ఆశ్చర్యం వేస్తుంది.

తరువాత కాశీరాజు తనకు నమ్మినబంటు అయిన రథచోదకునితో అడవికి వేటకు వెడతాడు. కాని ఆ రథసారధి మరెవరో కాదు. స్వయంగా దీర్ఘబాహువే. అతను రథం తోలుతూ వెనక్కి తిరిగి చూసి రాజుగారి అనుచరులు, పరివారము చాలా దూరంగా వుండిపోయారని రూఢి చేసుకుంటాడు. రాజుగారు తన కరవాల మును విశ్వాస పాత్రుడైన దీర్ఘబాహుకిచ్చి, అలసిపోయి వుండడంచేత నిద్ర

పోతాడు తన తండ్రి మరణానికి కారకుడైన రాజుపై పగతీర్చుకోవడానికి ఇదే తగిన అదను. ఇటువంటి అరుదైన అవకాశం మళ్ళీ రాదు. కాని తన శత్రువును చంపాడా తన ప్రేయసి తండ్రిలేని అనాథ అవుతుంది. చంపకపోతే తండ్రికి తగిన తనయుడు కాలేడు. మానసికమైన ఈ సంఘర్షణ అతన్ని ఎంతో సంక్షుభితం చేస్తుంది. చివరకు ఒక నిశ్చయానికి వచ్చినవాడై కత్తి ఎత్తుతాడు. అప్పుడు ఏదో వాణి వినపడుతుంది. అది అసాధారణ వాణి. తన తండ్రి తుదిఘడియలలో చేసిన ఉపదేశము. కరవాలము క్రింద పడిపోతుంది. దాని పిడి రాజుకు తగులుతుంది. ఆయన నిద్రనుండిలేచి చూస్తే దీర్ఘబాహు ఆత్మహత్య చేసుకో బోతున్నాడు. రాజు అది జరగకుండా అడ్డు తగిలి అతని ప్రాణాన్ని కాపాడుతాడు. ఆ తరువాత వా రిద్దరి మధ్య జరిగిన సంభాషణము అసలు విషయాన్ని స్పష్టం చేస్తుంది.

చివరిదైన ఐదవ అంకములో దీర్ఘబాహు ప్రేమలతను పరిణయమాడి యౌవరాజ్యాభిషిక్తు డవుతాడు. కాశీరాజు వానప్రస్థాశ్రమం స్వీకరిస్తాడు. ఇదే విచిత్ర విజయం. ఈ నాటకంపై శాకుంతలం ప్రభావం స్పష్టంగా కన్పిస్తున్నది. రచయిత శ్లోకములను చెక్కి చెక్కి నగిషీ పెట్టాడు. సాంప్రదాయికములైన యమకములతో శ్లోకాలను వినసొంపుగా రచించాడు. ఈ నాటకం సంప్రదాయం అనే మూసలో పోసి సిద్ధపరచిన దైనప్పటికి, కొన్ని విశిష్ట లక్షణాలతో ఒప్పారుతూ ఒక ప్రత్యేకత నాపాదించుకున్నది. అరువిప్పురంలో వున్నప్పుడు ఆశాన్ "మార్కండేయ విజయం" అనే మరొక నాటకం రచించాడు. దీని వ్రాత ప్రతి అసంపూర్ణమై వుండటంచేత ఇంతవరకు ప్రచురితం కాలేదు.

ఇంతకు మునుపు మూడవ అధ్యాయంలో చెప్పినట్లు ఆశాన్ కలకత్తాలో వున్నప్పుడు ఆంగ్ల, బెంగాలీ సాహిత్యములలో వచ్చిన కాల్పనికోద్వేగమును బాగా జీర్ణింప జేసుకునే అవకాశం లభించడం అతని అదృష్టమనే చెప్పాలి. అప్పుడతని వయస్సు రమారమి 27 ఏండ్లు. కాని అతనికి 35 వ ఏడు వచ్చేటంతవరకూ నిజమైన ఆశాన్ ఆవిర్భవింపలేదనే చెప్పాలి. అంతవరకు అతను హెచ్చుగా రచనలు చేయలేదు. చేసిన కొద్ది రచనలు కూడా ఇంతకుముందే మనం గమనించినట్లు సాంప్రదాయిక రీతిలో వున్నాయి. ఈ ఆలస్యానికి కారణం అతను యస్. యన్. డి. పి. యోగం తాలూకు వ్యవస్థా సంబంధమైన కార్యకలాపాలలో నిమగ్నుడై వుండటమేనని చెప్పినంతమాత్రాన అది అంతటితో సరిపోదు. వేరే కారణాలు కూడా వున్నాయి.

ఆశాన్ మనస్సును రాజకీటకమువుండే ప్లాస్కు ఆకారపు పట్టుపురుగు కాయతో పోల్చవచ్చునేమో! దాని నిర్మాణమే విచిత్రమైనది. ప్లాస్కు మూతివద్ద ఇరుకైన రంధ్రము వుంటుంది. ఆ రంధ్రములోనుంచి అందమైన ఆ పురుగు లోపలికి చొచ్చుకు పోతుంది. బైటికి పోయేదారికీ, లోపల నిర్బంధితమై వున్న పురుగు పరిమాణానికీ ఎంతో వ్యత్యాసం వుంటుంది. అటువంటప్పుడు పురుగు బైటికి ఎలా దాటిచేసుకుపోయింది! అన్న ఆశ్చర్యం ఎవరికైనా కలుగుతుంది. ఇరుకైన రంధ్రముగుండా బైటికి నిష్క్రమించేటప్పుడు ఆ పురుగు శరీరం ఎంత శ్రమకు, ఎంత వత్తిడికి లోనవుతుందో! అది ప్రకృతి కల్పించిన ఏర్పాటు. అందు వల్ల రెక్కల నాళములలోకి రసములునెట్టి వేయబడుతాయి. దీనికి కొంతకాలం పట్టుతుంది. కాని నిగనిగలాడే అందమైన రంగులరెక్కలు పుట్టుకు రావడానికి అది అవసరం. ఒక వేళ పురుగు విడుదల కృత్రిమ యత్నంతో త్వరితము చేయ బడిందా పురుగు వాచిన శరీరంతో బైటికి వస్తుంది. ఆశాన్‌లోని కాల్పనిక కవి అతని మనస్సు అనబడే పట్టుపురుగు కాయలోనుంచి బైటపడటానికి తన కవసర మైన వ్యవధిని తీసుకున్నాడు. తరుణం రాకమునుపే అకాలంగా వాచిన శరీరంతో అతను బైటికినెట్టి వేయబడనందుకు మనం సంతోషించాలి! కాబట్టే ఒడ్డూ పొడుగూ తగు అవయవ సౌష్ఠవమూ గల అందమైన కవి ఆశాన్ రూపంలో ఆవిర్భవించాడు.

# 6. రాలిన పూవు

పట్టుపురుగు కాయలోనుంచి అందమైన రాజకీటకం 1908లో బహిర్గతమై కేరళదేశ గగన సీమలో ఎగసి శోభాయమానమైన దాని రెక్కలతో కావ్య ప్రియు లను మంత్రముగ్ధులను చేసింది. "ఒరు వీణపూవు" (రాలిన పూవు) అను కావ్య ప్రచురణతో కుమారన్ ఆశాన్ కావ్య జగత్తులోకి ప్రవేశించి కవిగా పయన మారంభించాడు. ఉత్తమ కవిత్వమును ఆదరించి ఆస్వాదించు రసజ్ఞుల హృద యాలను ఈ కావ్యము పులకరింపజేసి కవితా రచనలో ఒక కొత్త రీతికి బాట వేసింది. 41 శ్లోకములు గల ఈ కావ్య ఖండిక అవతరణ ఆధునిక మళయాళ కవిత్వ చరిత్రలో మహనీయమైన సంఘటన అని అనడం అతిశయోక్తి కాదు. ఈ కావ్యఖండిక మొదట విఖ్యాత విమర్శకుడని వాసికెక్కిన మూర్కోత్

కుమారన్ సంపాదకత్వాన వెలువడే 'మితవాది' పత్రికలో ప్రచురితమైంది. త్వరలోనే అది మరింత పేరు ప్రఖ్యాతులు గల సాహిత్య పత్రికయైన "భాషా పోషిణి"లో సుప్రసిద్ధ సాహిత్యవేత్తయగు పి. యస్. సుబ్రహ్మణ్యన్ పొట్టి పరిచయ వాక్యాలతో పునర్ముద్రింప బడింది. ఆ పరిచయ వాక్యాలు కూడా ఎంత పసందుగా వ్రాయబడ్డవి! కవిత్వ ధర్మాన్ని గూర్చి కావ్యప్రయోజనాన్ని గూర్చి ఆనాటి సాహిత్య లోకంలో ప్రచలితమైవున్న కొన్ని పొరపాటు భావాలవల్ల కవితారచన ఏ విధంగా చర్వితచర్వణంగా, ఒకే మూసలో పోసిన వస్తు సముదాయంగా, కృత్రిమంగా ఎట్లా తయారైనదీ శ్రీ పొట్టి ఆ పరిచయ వాక్యాలలో కుండ బద్దలు కొట్టినట్లు స్పష్టం చేశాడు. అనతికాలంలోనే ఈ కావ్యం మరొక గొప్ప పరిగణనకు కూడా పాత్రమైంది. మహా కవి, సాహిత్యకులకు రాజపోషకునివంటి వాడూ అయిన కేరళవర్మ వలియకోయిల్ తంపురాన్ తన అధ్యక్షతన ఒక కమిటీవారు సిద్ధపరుస్తూవున్న పాఠ్యగ్రంథంలో ఈ లఘు కావ్యమునుచేర్చి దీని ప్రాముఖ్యమును వెల్లడించాడు. 'వీణపూవు' కావ్యం ఆహ్వానించదగిన మార్పుగా మళయాళ కావ్యలోకంలోకి వచ్చి పడింది. దానిలోని స్వభావ సిద్ధమైన శక్తి, రాణువ సమకాలిక రచనా రీతిని ప్రభావితం చేశాయి. ఇంతటి ప్రాబల్యం గల కావ్యమునకు కర్తయైన వ్యక్తి నిజంగా సృజనాత్మక శక్తిగల కవి వరేణ్యుడని కవితాలోకం గుర్తించక తప్ప లేదు. ఆశాన్ రచన "రాలిన పూవు" మళయాళ కవిత్వంలో ఒక కొత్త రీతిని ప్రవేశపెట్టిన కవితగా నిలిచిపోయింది. ఆ కవితలో అలంకారాల ఆర్భాటిలేని నవ్యత్వం, మార్దవం, సున్నితమైన స్వభావం వున్నాయి.

ఒక పువ్వుపై—అందులోనూ రాలిన పూవుపై కావ్యమును రచించడానికి ప్రబలమైన హేతువేమిటి? అసలు దానికి కారణ మనేది ఒకటి వుందా? ఏమో, మనకు సరిగా తెలియదు ఒక్కొక్కప్పుడు ఒకా నొక కావ్యం ఆవిర్భవించడానికి పరిస్థితులు ముఖ్య కారణ మవుతాయి. లేదా పరిస్థితుల పాత్ర కూడా కొంత వుంటుంది. ఈ కావ్యం ఆశాన్ స్వస్థలంలో లేనప్పుడు, కొన్ని ప్రత్యేక పరిస్థితుల ఒత్తిడికిలోనై వున్నప్పుడు రచింప బడింది. మళయాళశకం 1083 లో (1908) వృశ్చికం నెలలో పాలఘాట్‌లో కొన్ని రోజులపాటు నిర్బంధింపబడినప్పుడు తాను ఈ కావ్యాన్ని రచించినట్లు ఆశానే స్వయంగా చెప్పుకున్నాడు. అతను అక్కడ ఎందుకు నిర్బంధింప బడిందీ కవి స్వయంగా "వివేకోదయం" అనే పత్రికలో విపులంగా వ్రాసిన వివరణమునుబట్టి మనం గ్రహింపవచ్చు.

నారాయణగురు కాలికట్ పర్యటనకు వెళ్ళినప్పుడు ఆయనవెంట ఆశాన్‌కూడా వెళ్ళాడు. ఆ పర్యటనలో నారాయణగురు ముఖ్య కార్యక్రమం ఒక శివాలయమునకు ప్రతిష్ఠాపన చేయడం. వారు ఎర్నాకుళంలో వున్నప్పుడు గురువుకు కలరా వ్యాధి సోకింది. పరిస్థితి త్వరలోనే విషమించి వారిని అనుసరించి వెళ్లిన ఒక శిష్యుడు ఆ వ్యాధితో మరణించాడు. స్వామి పరిస్థితికూడా క్షీణించి కొన్ని రోజులు వ్యాధిపీడితుడైనాడు. ఎట్టకేలకు వ్యాధిని కొంత అదుపులోకి తెచ్చి, ఆయనను పాలఘాట్‌లోని డాక్టర్ కృష్ణన్ ఆసుపత్రికి తీసుకువెళ్ళారు. డా. కృష్ణన్ కొన్నాళ్లు చికిత్సచేసి తగిన మందులు వాడి వైద్య సదుపాయం కలుగజేశాడు. ఆసుపత్రి ఆవరణలో చుట్టూ పుష్పవృక్షాలు చాలా వుండేవట. గురువు పరిస్థితిని, రాలిన పూలను చూచిన కవి అననుకరణీయమైన తన ధోరణిలో ఏకధ్యానంతో భావనాలోకంలో విహరించాడు. ఆశాన్ మనస్సులో ఎట్టి సంచలనం కలిగిందో మనం చెప్పలేము. కాని రెండు విషయాలు మాత్రం మనకు స్పష్టంగా తెలుసు. ఒకటి: ఆశాన్‌కు ఎవరిపట్లలేని భక్తి, భావం గురువు ఎడవుంది. ఇద్దరూ చాలా సన్నిహితులైనారు. అటువంటి తన గురువు చావు బ్రతుకులమధ్య వున్నాడు. రెండవదేమిటంటే — ఆశాన్ మానసికంగా అత్యంత విషాద స్థితిలో కొట్టుమిట్టాడుతూ వ్యాకులుడై వున్నప్పుడు ఈ కావ్యరచన చేశాడు.

ఈ కావ్య స్వభావమేమిటి? ఈ లౌకిక జీవితంతో ఆ తరువాత మానవులెదుర్కొనే దశతో ఈ కావ్యానికేమైనా సంబంధం వుందా? ప్రతి భాషలోనూ పూలపై అనేక కావ్యాలు వున్నాయి. యథార్థానికి పూల సొబగుకు ముగ్ధుడు కాకుండా, వాటి మనోహరత్వాన్ని గూర్చి పద్యాలు వ్రాయకుండా వున్న కవి లోకంలో ఎక్కడున్నాడు? అలాంటి కవిని వెదకి పట్టుకోవడం కష్టం. కవితా సామగ్రిలో విస్తారంగా ఉపయోగింపబడే వస్తువులు పూలే! కాని రాలిపడిపోయి, దుమ్ములో కలిసి అందరిచే విస్మరింపబడే పూవును పట్టించుకున్న వారెంతమంది? కవిత్వానికి తగిన వస్తువు రాలిన పూవు. రాలిన పూవునుగూర్చి భావనచేసి, ఆశాన్ ఒక జీవితం మొత్తాన్నే పాఠకుల దృష్టికి తేగలిగాడు. ఆంగ్ల కవిత్వంలో 'ఎలిజీ' (స్మృతికావ్యం) అనబడే ఒక కావ్యప్రక్రియ లక్షణాలు ఈ కావ్య ఖండికలో చాలా వున్నాయి. తన గురువుయొక్క పరిస్థితి కవిలో ఇట్టి భావాలు కలుగజేసిందనడం సబబుగా వుంటుందేమో. ప్రతిభావన ఒక అందమైన శ్లోకంగా రూపుదిద్దుకుంది. "వీణ

పూవు" ఎవరినిగూర్చిన స్మృతికావ్యమూ కాదు. కాని ప్రతిఒక్కరికి సంబంధించిన స్మృతి గీతము. ఇది సంకేతప్రాయమైన స్మృతికావ్యము.

సంప్రదాయబద్ధమైన కావ్యాలనుగూర్చి మనమిదివరకే కొంత పరిశీలన చేసివున్నాము కేరళ దేశంలో 19వ శతాబ్దిలో ముఖ్యుడైన ప్రతి కవి సంస్కృత సాహిత్య రీతిలో మహాకావ్యమును రచించడం అత్యావశ్యకమైన వైదుష్యంగా భావించాడు. అది ఆ కాలంలో ఒక ఫాషన్ అయిపోయింది. ఆ ధోరణి ఇరవయ్యో శతాబ్ది రెండవ దశకంవరకూ కొనసాగింది. అటువంటి కావ్యాలలో కాండములు, సర్గముల సంఖ్య, వర్ణనలు, అలంకారముల వైవిధ్యం, ఛందస్సులు మొదలగు బాహ్యమైన ఉపకరణములకు ప్రాముఖ్యం హెచ్చు. కవులు ఇటువంటి బాహ్య అలంకారముల విషయంలో. నగిషీలలో ఒకరితోఒకరు పోటీపడి కావ్యాత్మను విస్మరించేవారు. మళయాళ కవిత్వం నూతన ఇతిహాసిక యుగపు (neo-classical) ధోరణిలోపడి నిలువనీరువలె చలనం లేక మందస్థితిలోవున్న దశలో ఆశాన్ తన కాల్పనిక కవిత్వంతో ముందుకొచ్చి నిలిచాడు. ఈ కవిత్వంలో ఇతర అంశములకంటె అనుభూతికీ, మనో భావాలకూ, కాల్పనికావేశానికీ ప్రాబల్యం హెచ్చు. ఆశాన్ కావ్య హృదయ క్షేత్రంలో ఈ నూతనాంకురమునకు పాశ్చాత్యకవిత్వ ప్రభావం చాలావరకు ప్రేరకమైంది.

నేను ఇలా అంటున్నానంటే "వీణ పూవు" కావ్యం వెలువడటానికి ముందు ఆంగ్ల కవిత్వ ప్రభావాన్ని కనుపరచిన కవిత్వం మలయాళంలో రానే రాలేదని కాదు.

ఆంగ్ల కవిత్వ ప్రభావంగల కావ్యాలు అంతకుముందు బాగానే వచ్చాయి. ముఖ్యంగా స్మృతికావ్యముల వంటివి. వీటిని మళయాళ పాఠకులు చదివి వాటి గుణములను తెలుసుకొని మెచ్చుకున్నారు కూడా. కాని "రాలిన పూవు" కావ్య ప్రకటనతో భావగీతముల రచనకు నిజమైన ప్రోత్సాహము, ప్రేరణ కలిగాయి. ఇందుకు ప్రత్యక్ష ప్రమాణం మరొక సమకాలిక మహాకవి శ్రీ ఉళ్ళూరు పరమేశ్వర అయ్యర్* ఇచ్చిన యోగ్యతా పత్రమే. అంతకన్న పెద్ద రుజువు మరొకటి వుండదు

---

* ఉళ్ళూరు యస్. పరమేశ్వర అయ్యర్ (1877—1949) తాను రచించిన "కేరళభాషా సాహిత్య చరిత్రము" అనే సుప్రసిద్ధ మలయాళ సాహిత్య

"మలయాళసాహిత్య క్షేత్రంలో 'వీణపూవు' వేసిన బాట ఒక ప్రత్యేకత గలది. అంతకుమునుపు పాశ్చాత్య సాహిత్యంతో క్షుణ్ణమైన పరిచయంగల కవులెందరో వుండిరి. కాని పాశ్చాత్యుల ఫక్కీలో విషయమును, వర్ణనలను మొదట ప్రవేశపెట్టినవాడు ఆశాన్. సాహిత్యాకాశంలో, 'వీణపూవు' అసాధారణమైన కాంతిగల నక్షత్రాన్ని ఉదయింపజేసింది.''

మలయాళ కవిత్వంలో కొత్త యుగాన్ని తేవడంలో ఈ చిన్న కావ్యం వహించిన పాత్రను ప్రత్యేకంగా చూపెట్టిన విమర్శక గ్రంథాలు రెండు వున్నాయి. దీనివిగూర్చి అనేక వ్యాసాలుకూడా వ్రాయబడ్డాయి. ఇక కావ్యంలోని కొన్ని పద్యాల పరిశీలనం చేద్దాము.

కవి రాలిన పూవును చూచి దాని జీవితంలోని ముఖ్య దశలను స్మరిస్తాడు. ప్రతి శ్లోకం, ప్రతి పదము మానవ జీవితాన్నే స్పృశిస్తుంది. కాని, చెట్టు జీవితంలోని విపర్యయములను, మంచిచెడ్డలను కాదు. కావ్యారంభం ఇట్లా వున్నది:

ఓహో! సుందరపుష్పమా,
ఒకప్పుడు నీవు రాణివలె
మహోజ్జ్వలంగా ప్రకాశించావు,
అటువంటి నీవు
కాంతి విహీనవై
ధూళిలో పడివుండటం
ఎంత విచారకరం!
ఈ లోకంలో
భాగ్యం చపలమైనది.
సౌందర్యం అశాశ్వతమైనది. **

---

చరిత్రలో కుమారన్ ఆశాన్‌నుగూర్చి, ఆయన కృతులనుగూర్చి విశదంగా వ్రాశాడు.

** 'వీణపూవు' కావ్యమును శ్రీ మంజేరి యస్. ఈశ్వరన్ ఆంగ్లములోకి అనువదించారు.

కవి పూవు బాల్యాన్నిగూర్చి చెబుతూ—

లత ప్రేమతో విన్ను కన్నది
మృదువైన తన ఆకుల గుండెలో హత్తుకొని
విన్ను ప్రియమార పెంచి పెద్దదాన్ని చేసినది.
మంద సమీరంతో కదలిన ఆకులు
వచ్చీరాని మాటలతో
మెల్లగా మెలమెల్లగా
జోలపాట పాడాయి.

అందమైన ఆ బాల పెరిగి పెద్దదైంది :

ఆలా ఆలా పెరుగుతూ
నీరూపు రేఖలు
మనోజ్ఞమైన అందాలను ఆగపరిచాయి
నీ ముఖాకృతి మెల్లగా మారింది
నీ చెంపలపై వెలుగు వచ్చింది
ఓ పుష్పమా, నవోదితకాంతితో
కొత్తగా పుట్టుకొచ్చిన చిరునవ్వు
ఆ బుగ్గలమీదుగా తుర్రుమన్నది.

మొదటి పద్యంలో రాణి ఉపమానంతో ఆరంభింపబడిన పూవు పోను పోను తరుణీలలామగా భావన చేయబడింది. పాలవంటి తెల్లని చంద్రకిరణాలలో స్నానమాడి, ఉదయభానుని లేత కిరణాలు ప్రసరించిన వెచ్చదనంలో నృత్యం చేస్తూ మొగ్గ బాల్యావస్థను దాటింది. అప్పుడు దాని ముఖాకృతి యవ్వనంతో జాజ్వల్యమానమైంది. దాని అందం ఆకర్షణ ఎట్లావుంది! కవి చెప్పినదాన్ని బట్టి అలక్ష్యం చేయడానికి శక్యంగాకుండా వుంది :

సర్వమూ త్యజించిన మౌని గాని,
తరుము కొనివచ్చు శత్రువును చూచి
వెర్రిగా పరుగెత్తు పిరికి పందగాని,
ఎవరైనా సరే, వాళ్ళకు కళ్ళనేవి వుంచే
క్షణం నిలిచి నీ పరిపక్వప్రాయమును
తేరిపార చూస్తారు.

చూపరులను ఆశ్చర్యచకితులను చేసే ఈ లావణ్యవతి ప్రియులను ఆకర్షించకుండా వుండలేదు. ఎందరో ప్రియులున్నారు — కాని ఆమె ముదురు నీలపు రంగులో వుండే కీటకమును ఎంపిక చేసుకొని, తక్కినవారిని నిరాకరించి ఔనన్నది. ప్రేయసీప్రియు లిద్దరూ ఆనందాబ్ధిలో ఓలలాడారు. కాని పాపం ఆ ఆనందం కొద్దికాలం కూడా వుండలేదు. పూవు రాలిపోయింది. ప్రియుడు తన ప్రేయసి మృత దేహం చుట్టూ పరిభ్రమిస్తూ రోదిస్తూ శోకిస్తాడు:

"నా శరీరాన్ని శాశ్వతంగా
ఒకరి కర్పించాను" అని చెబుతూ
తక్కిన ప్రియులను నిరాకరించావు
"ప్రేయసీ! నన్ను వీడిపోకు"
అని కీటకం మొర పెట్టుకుంది!

పెదవులవద్దకు తేబడి ఒకగుక్క తీసుకొనబోయే ముందు మధు పాత్ర తొలగించి వేయబడింది. ప్రణయము ఒకవంక అపరిమితానందమునకు, మరొకవంక అవధిలేని దుఃఖమునకు మూలకారణమవుతుంది. ప్రేమకు ఫలితముగా తత్సమానమైన అనురాగము, బద్ధత లభ్యముకాకపోయినట్లయితే అది నిరాశా నిస్పృహలకు దారితీస్తుంది. అయితే ఇచ్చి పుచ్చుకోవడంలో జీవితమును జాజ్వల్యమానం చేయగల ప్రణయము వంటిది ఈ లోకంలో వేరొకటి లేదు. అసలు జీవితమే విధి చేతులలో కేవలము ఆటబొమ్మ వంటిది. జీవితానికి అన్నిటి కన్న పెద్ద శత్రువు మృత్యువు.

హా! నా ప్రియతమ పుష్పమా
మృత్యువు నీపై
నిర్దయాత్మకమైన హస్తములు సాచి
నీ పరిమళ భరితమైన శ్వాసను
ఘనీభవింప జేసినది.
అరణ్యంలో గ్రద్దనో
లేక పావురమునో చంపు
వేటగాడు వాటి జీవములపై
దయ దలచునా?

పూవు ప్రకృతి సంతతి. మృత్యువు తన హస్తాలను దానిపై సాచి నప్పుడు ప్రకృతి సర్వము దాని క్లేశములో పాలుపంచుకుంటుంది:

నీవు రాలిపోవడం చూచి
చిన్న చిన్న సాలీడులు
నీకు మృదువైన పట్టుతో
శవ వస్త్రమును అల్లినవి.
ఉషస్సు తన మృదుహస్తాలతో
మంచు బొట్టులతో కూర్చిన
అసమాన ముత్యాల సరముతో
సొగసుగా నిన్ను అలంకరించింది.
నీవు రాలిపోయినావన్న
దుఃఖాతిరేకంతో
ఆకాశంలోని చుక్కలు
మంచు బొట్టులవంటి
అశ్రువులను రాల్చాయి
దట్టమైన ఆకులుగల చెట్లపై
కూర్చున్న పిచ్చుకలు
నీవు మరణించావన్న వేదనతో
నేలమీదికి దిగివచ్చి
నీ చుట్టూ గుమికూడి
కిచకిచ లాడుతూ
కీచుమని అరుస్తూ
ఎడతెగకుండా
రోదించాయి.

ఈ అనర్థం ఎందుకు కలిగిందో కవి కారణాలను పరిశీలిస్తాడు:

ఇంత సద్గుణ సంపన్నురాలిగా
నిన్ను సృష్టించడ మెందుకు?
దుష్ట విధి నిన్ని రీతిగా
హతమార్చడ మెందుకు?
సృష్టి రహస్యాన్ని
శోధించగల వారెవరు?

మంచివాళ్ళకే మృత్యువు
త్వరగా ఆసన్న మవుతుందేమో।

కవి మానస వీధిలో ఇటువంటి ప్రశ్నలెన్నో ఉదయిస్తాయి. కాని వాటికి సంతృప్తికరమైన సమాధానాలు దొరకవు. కవికూడా తన్ను తాను ఊరడించుకొని యథాస్థితికి వస్తాడు :

దుఃఖించడం వ్యర్థం
ఈ లోకంలో ఒక్కొక్కప్పుడు
దురదృష్టం ఆనందాన్నంతటినీ
వధిస్తుంది :
మరణమనేది లేని ఆత్మ
శరీరాన్ని ఆశ్రయిస్తుంది
అది ఏ ఆకారం దాల్చినా
అనంతమైన దైవశక్తి వల్లనే.

## ఆశాన్ నిరాశావాదియా ?

ఈ కావ్యం ముగింపు ఏవిధంగా జరిగింది ? నిరాశతో అంతమైందా ?

ఓ కను రెప్పలారా
చెమర్చిన కన్నులను
మూయండి
వికసించిన ఈ పూవు
ఇకక్షణంలో ముడుచుకుపోతుంది
క్రుళ్ళి మట్టిలో కలిసిపోతుంది
అందరికీ ఇదేగతి.
కన్నీటివలన ప్రయోజనమేమిటి ?
మన జీవితమే ఒక కల సుమా।

కావ్యం మొత్తం విషాదంతో తడిపిన 'భావనగా, అనుభూతిగా' వున్న మాట నిజమే. కావ్యం 'హా' తో మొదలై 'కష్టం'తో సమాప్తమవుతుంది. ఇవి రెండూ కావ్యంలోని విషాద వస్తువును నొక్కి వక్కాణిస్తున్నవి. విలాప గీతం వ్రాస్తూ ఆశాన్ జీవితాన్ని ఒక కలగా ఎంచిన మాటకూడా నిజమే. కాని దాన్ని అతడు శుష్కస్వప్నంగా భావించలేదు. అది ఒక అర్థంగల స్వప్నం

ఈ జీవితం ముగిసిన తరువాత ఏమి జరుగుతుంది? దీని తరువాత ఏమవు తుంది? దాన్ని పోల్చి చూపే కల? ఈ ప్రపంచంనుంచి అదృశ్యమై పోయినంత మాత్రాన పూవు జీవితం పూర్తిగా ముగిసిపోదు :

పశ్చిమ సముద్రంలో క్రమేపీ అస్తమించి
తూర్పు కొండపై ఉదయించే నక్షత్రంలా
పుష్పమా, నీవుకూడా
మేరు పర్వతంపై
కల్పకవృక్ష శాఖపై
తిరిగి పూవై వికసిస్తావు.

అంటే కవి రాలిన పూవుకు మహోజ్జ్వలమైన భవిష్యత్తు వుందని ముందుగానే ఊహించగలుగుతున్నాడు. కాబట్టి ఆశాన్ నిరాశావాదియైన కవి అని ఆరోపణ చేయడం సబబుకాదు. అలాంటి అభిప్రాయానికి తగు ఆధారాలు లేవు.

ఒక విషాద భావన వెలిబుచ్చినంత మాత్రాన అది నిరాశావాద ధోరణి అని అనుకోరాదు. మనం జీవయాత్ర వెళ్ళబుచ్చుతూవున్న ఈ లోకంలో ఆనందమూ వుంది, దుఃఖమూ వుంది. ఆనంద విషాదాలను రెండిటినీ మనం స్వీకరించి అనుభవించవలసి వుంటుంది. ఆనందముకన్న దుఃఖమే, విషాదమే వర్తమానంలో జీవితాన్ని మరింత గాఢంగా అర్థంచేసుకోవడానికీ, పరలోకానికీ ఈ జీవితానికీగల సంబంధాన్ని ఊహించడానికీ మనకు ఉపయోగపడుతాయి. ఈ సత్యాన్ని ఆశాన్ బాగా గ్రహించినట్లు "వీణపూవు" కావ్యాన్నిబట్టి, ఆ తరువాతి కవితలనుబట్టి మనకు తెలియవస్తున్నది.

ఆశాన్ రచించిన కావ్యాలలో "వీణపూవు" కావ్యం సర్వోత్కృష్టమైన స్థానాన్ని ఆక్రమించినది. ఈ రచన కవియొక్క విశిష్ట వ్యక్తిత్వాన్ని బహిర్గతం చేస్తున్నది. ఆ తరువాత ఆయన చేసిన రచనలు చాలావరకు ఈ రీతిలోనే వున్నవి. 'రాలినపూవు' కేవలం పూవుమాత్రమే కాదనీ, జీవితం మొత్తాన్నే తలపోసి రూపొందించిన ప్రతీక అనీ మనం గమనించి వున్నాము. ఈ కావ్యంలో ముఖ్యంగా రెండు అంశములు స్పందించినవి. ఒకటి విలాప గుణము. రెండవది బలహీనమూ, బాధాతప్తమూ అయిన వస్తువుపై పాఠకుని దృష్టిని మళ్ళించే ధోరణి. పూవు అబల. అంటే బలహీనమైన

పక్షమునకు చెందినది. తక్కిన అన్ని ముఖ్య కావ్యాలలో ఈ రెండు అంశాలు ప్రధానంగా భాసిస్తున్నవి. 'నళిని'లో, 'లీల'లో, 'సీత'లో, 'కరుణ'లో (వీటినిగూర్చి తరువాత సవివరంగా ప్రస్తావిస్తాను) విలాప చిత్తవృత్తిని మనం గమనిస్తాము. వీటిలో కరుణరసం ముఖ్యమైనది. ఈ కావ్యములలో మనకు ప్రస్ఫుటముగా కనపడువారు నాయికలు. వారందరినీ కవి మనకు పతనస్థితిలో ప్రదర్శించి చూపుతాడు. ఆశాన్ వారిని మనకు పరిచయం చేసినప్పుడు వారి భౌతిక ప్రపంచాన్ని వీడిపోవ సిద్ధమైవున్న వారుగానో, లేదా ఇంద్రియసుఖముల నిచ్చే ఈ లౌకిక జీవితాన్ని పరిత్యజింప బూనుకొన్నవారిగానో కనిపిస్తారు. విషయమును ప్రస్తావించే పద్ధతికూడా అదే. ముఖ్యపాత్ర జీవితంలో అత్యంత నాటకీయమైన ఘట్టంతో కావ్యారంభం జరుగుతుంది. అంటే ఆ పాత్రను ఏ ఆవస్థలో మొదట ప్రవేశపెట్టితే పాఠకుని సానుభూతి అంతా వ్యక్తం కాగలదో ఆ స్థితినుంచి కావ్యం మొదలవుతుంసి. ఉదాహరణకు—

ప్రకాశ విహీనవై నీవీదుమ్ములో
పడివుండడం ఎంత విషాదకరం!

ఈవిధంగా మొదలైన కావ్యం గతంలోని సంఘటనలను ఒక్కొక్కదాన్ని మెరుపువలె తళుక్కుమని మనముందు మెరపింపజేస్తుంది. ఇట్లా గతంలోకి కొన్ని తళుక్కులు; మళ్ళీ కలత కలిగించే వర్తమానంలోకి వస్తాడు. కణ్కాడే ఆగిపోక భవిష్యత్తులోకి కొద్దిగా తొంగిచూస్తాడు. ఆ భవిష్యత్తు ఎటువంటిది? ఆ శా జ న క మై న ది. ఊరట కలిగించేది. మొత్తంపై కావ్యలక్షణం ఈ మోస్తరుగా వుంటుంది. అంటే ఆశాన్ వ్రాసిన ప్రతి ముఖ్య కావ్యం "రాలినపూవు"కు ఉత్తరభాగంగానో, లేదా దానిని పునఃపరిశీలన చేసి వ్రాసిన రచనగానో కన్పిస్తుంది. అంటే ప్రతీక వాదమును సంఘటనలకూ, పేర్లకూ విడిచివేసినట్లు మనం గ్రహించగలుగుతాము. పూవుకు బదులు నళిని, లీల, సీత, వాసవదత్త పాత్రలు కావ్య వస్తువులైనవి. "ప్రరోదనము" అనే కావ్యం మీను మిగిలిన కవీ. పండితుడూ అయిన ఎ. ఆర్. రాజరాజవర్మను గూర్చిన స్మృతి గీతము అని చెప్పవచ్చు.

ఈవిధంగా "రాలినపూవు"లో కుమారన్ ఆశాన్ ప్రత్యేక ముద్ర చదువరికి గోచరిస్తుంది. జీవితమునుగూర్చి ఆయన పెంపొందించుకున్న తాత్త్విక చింతనకు ఈ కావ్యం మహోత్కృష్ట వ్యక్తీకరణగా భాసించింది

దుఃఖము, విషాదము నిండివున్న సంఘటనలు, సన్నివేశములు అన్నీ దాటి ఆయన ఆశావాదప్రాంగణంలో విల్చొని నమ్మిక, విశ్వాసం, ప్రేమవంటి సుగుణాలతో మహోన్నతుడై మనకు సాక్షాత్కరిస్తాడు. రాలి క్రిందపడిన పూవు శాశ్వతంగా అంతరించిపోదనీ, దానికన్న మరింత వైభవంతో, ఘనతతో నాలుగు కాలాలపాటు నిలిచే నూతన ప్రాణిగా పరిణామం చెందుతుందనీ ఆశాన్ వాదము.

## 7. ప్రణయ కావ్యములు

### నళిని

గడచిన అధ్యాయంలో "వీణపూవు" కావ్యంలోని ప్రత్యేక వాదమునూ, దాని సమగ్ర స్వభావమునూ చర్చించి వున్నాము. ఆ తరువాత రచింపబడ్డ కావ్యాలలో ప్రతీకవాదమనే ఉడుపును కవి ఎట్లా విసర్జించింది కూడా ప్రస్తావించి వున్నాము. ప్రతీకవాదమనే కట్టడమును వదిలి కవి ఈవలకు రావడంలో కూడా ఒక మధ్యావస్థ వున్నట్లు కనిపిస్తుంది. ఆశాన్ రచనలలో రెండవ ముఖ్య కావ్యం "నళిని'', ఇది 1911లో వెలువడింది. ఈ కావ్యాన్ని విశ్లేషణచేసి పరిశీలించే సంద ర్భంలో ఆ మధ్యావస్థ మనకు స్పష్టమవుతుంది. ఈ విషయంలో రాలినపూవు, నళిని. ఆమె ఈ కావ్యంలో నాయిక. నళిని అనే పేరు ఇప్పుడు బాలికలకు సుపరి చితము బాగా వ్యాప్తిచెందిన పేరు. కాని ఆశాన్ ఈ కావ్యమును వ్రాసినప్పుడు కేరళలో ఈ పేరు అంతగా వ్యాప్తమై లేదు. 'నళిని' అంటే తామరపువ్వుల సమూహము. (కమలముల కొలను అని కూడా అర్థం.) నళినలనుంచి నళిని అనే పదము వచ్చింది. ఈ కావ్యంలోని నాయికకు మరేదైనా పేరు పెట్టినా సరిపోయేదే అని మొదట మనకు అనిపించవచ్చు. కాని సూక్ష్మంగా పరిశీలిస్తే అది సరికాదని మనకు తెలియ వస్తుంది. ఆశాన్ బుద్ధి పూర్వకంగానే నాయికకు ఈ పేరు పెట్టాడు, మరి ఏ పేరు పెట్టినా ఇంత సముచితంగా వుండదు. 'వీణపూవు'లోని పువ్వు ఒక జాతి యొక్క పరిమిత స్థానమును—అంటే కమలమును వహిం చింది. కవి సమీక్షణ మంతటితో ఆగలేదు, ఎందువల్లనంటే కావ్యనాయకుడికి కూడా ఒక పేరుంది. ఆపేరును మార్చడానికి వీలులేదు. నాయకుని పేరు దివాకరుడు. 'దివాకరుడు,' అంటే సూర్యుడు.

భారతీయ కవితా సంప్రదాయ మెరిగిన వారికి కమలమునకూ, సూర్యునికీ గల సంబంధమేమిటో బాగా తెలుసు. లోకరూఢియైన ఈ సంప్రదాయాన్ని ఆలంబనంగా చేసుకొని కుమారన్ ఆశాన్ "నళిని" కావ్యంయొక్క ప్రతీక వాద స్వభావమును నిలిపి పోషించడమే గాక, సాధారణమైనవిగా తోచే దివాకరుడు, నళినివంటి పేర్లను పాత్రలకు పెట్టి వాటికి మానవ స్వరూపమిచ్చి, శృంగార రసం స్థాయిని మరింత ఉన్నత స్థితికి తీసుకుపో గలిగాడు. దివాకరుడు ప్రేమికుడు, కమలము ప్రేయసి. ప్రాచీన ప్రామాణిక సాహిత్య రీతికి చెందిన ఈ మూసలో ఆశాన్ ఏ విధమైన ప్రణయమును కరగించి పోశాడు?

మళయాళ సాహిత్యవేత్తలు ఆశాన్‌ను తరచు "స్నేహగాయకన్" అని ప్రస్తావిస్తూ వుంటారు. అంటే ప్రణయగాయకు డన్నమాట. అతని కావ్యాలన్నీ ప్రీతి వెలుగులో వుంచి ప్రణయంయొక్క పలుదశలను పరిశీలన చేస్తాయి. అమలిన శృంగారం (Platonic love) పట్ల అతను అభిరుచిని పెంపొందించు కున్నాడు. కథ ముందుకు సాగే కొద్దీ శృంగార భావన పరిశుద్ధమైన ఉదాత్త స్థితికి చేరుకుంటుంది. అలనాటి కేరళ కవితా వ్యాసంగములో ఇది గొప్ప మార్పే అని చెప్పాలి ఆ రోజుల్లో కవిత్వం సంప్రదాయ బద్ధమైన మహా కావ్య రీతికీ ప్రాపంచికమైన శృంగార రీతికీ మధ్య ఊగిసలాడుతూ వుండేది. సగటు కవికి శృంగారం విషయ సుఖ సంబంధమైనదిగా కామంగా తోచేది, కవితా రచనలో అతి లౌకిక ప్రకృత్యతీత అద్భుత రంజక శక్తి, మహాకావ్యముల లక్షణమైన లాక్షణిక పరిపూర్ణత నిర్దుష్టత ప్రధాన విశేషములుగా ఎంచబడేవి. కాల్పనిక కవిత్వ లక్షణాలైన సాహసప్రియత్వము, ఎట్టి కట్టుబాట్లు లేకుండా ఊహలు ఆనంద పక్షాలు తొడుగుకొని స్వేచ్ఛావిహారం చేయడం, విశృంఖలత అప్పటి కింకా మళయాళ కవిత్వంలో రాలేదు. అట్టి తరుణంలో ఆంగ్లకాల్పనిక కవిత్వ ప్రభావాన్ని చవిచూచిన కుమారన్ ఆశాన్ కవిగా సాహిత్యరంగం మీదికి వచ్చి నిలిచాడు. "వీణపూవు" కావ్యం అతనికి మళయాళ కవిత్వ మందిరద్వారాలను తెరచింది. ఆ ఆవరణంలోకి ప్రవేశించి పెద్దకులాలకు చెందిన కవులు, కులీనులు వారి వారి శృంగార కావ్యాలతో సంప్రదాయపు సంకెళ్ళతో బంధించిన కవితలతో అచ్చటి నడవలలో, ప్రాకారాలలో సంచరించడం ఆశాన్ చూచాడు. కాని వాళ్ళతో కలిసిపోక తన రెండవ కావ్యమైన 'నళిని"తో నేరుగా గర్భగుడిలోకి వెళ్ళి పరమేశ్వరుని సన్నిధిలో నిల్చున్నాడు. కొందరు నివ్వెరపోయారు. మరి కొందరు ఓరచూపులతో ఎగా దిగా చూచారు. కాని కొందరు మాత్రం అసలు

జరిగిందేమిటో గ్రహించారు. తిరుగుబాటువలె పై కెగసిన కాల్పనికావేశం కవి వాక్కు ద్వారా వ్యక్తమైంది.

ఆశాన్ మానవ జీవితంలోని భావావేశస్వభావమును యధార్థమైన కాల్పనిక రీతిలో నొక్కి వక్కాణించి నప్పటికీ ఆయన కవిత్వం సాంప్రదాయికతకు (Classicism) పూర్తిగా దూరమైపోలేదు. నిజానికి అది ప్రాచీన మహా కావ్యముల సంప్రదాయ మార్గము, ఆధునిక భావకవుల కాల్పనికావేశము — రెండూ చక్కగా మేళవించిన కవిత. కాబట్టే అతనిని నేరుగా బయటికి పంపి వేయడం జరగలేదు. "నళిని" కావ్యమునకు ఉపశీర్షిక ఒకటి వుండటం గమనించదగ్గ విశేషం. అదే "ఒరు స్నేహం". అంటే "ఒక ప్రణయము." కవి వ్రాసిన మున్నుడిని బట్టి ఈ కావ్యమంటే ఆయన కదొక రకమైన ప్రత్యేక అభిమానమని తెలియ వస్తున్నది. దీని రచనను ఆయన 1909 లోనే ఆరంభించి నప్పటికీ అది వ్రాతప్రతిస్థితి లో అతని నోటుబుక్కులో వుండి పోయింది. ఎంతో మక్కువతో అతను దానిని 1911 లో విడుదల చేశాడు. ఆ రచనంటే అతని కేదో ఆపేక్ష. కొందరు విమర్శకులు ఈ కావ్యంలో ఆశాన్ ఆత్మకథ చిన్నెలున్నాయనీ, ఆ కారణం వల్లనే దీనిని ఒక ప్రత్యేక కాదరంతో చూచుకునే వాడనీ వాదిస్తారు. దివాకరన్ పాత్ర పై ఖరిలో 36 ఏండ్ల వయస్సు వచ్చినా అస్ఖలిత బ్రహ్మచారిగా వుండిపోయిన చిన్నస్వామి లక్షణాలు ద్యోతకమవుతాయి. 36 వ ఏటనే ఆశాన్ "నళిని" కావ్యాన్ని రచించాడు.

## నళిని కథ

దివాకరుడు, నళిని ఇరుగు పొరుగువారు, బాల్యంనుంచీ స్నేహితులు. ఇద్దరూ కలిసి బాల్యంలో ఆడుకున్నారు. కలిసి చదువుకున్నారు. ఒకే వాతావరణంలో పెరిగారు, ఇద్దరూ యౌవనారంభదశలో అడుగుపెడుతూ వుండగా దివాకరుడు ఇల్లు విడిచిపోయి సన్యాసి అయ్యాడు. ఈ సంగతి నళినికి తెలిసి ఆమె చాలా విచారవిడింది. కాలం గడిచేకొద్దీ ఆమె దుఃఖం అతిశయించింది. నళిని తల్లి దండ్రులు ఆమెను ఓదార్చాలని ప్రయత్నించారు, కాని ప్రయోజనం లేక పోయింది. ఆమె యుక్తవయస్సుకు రాగానే తల్లి దండ్రులామె పెండ్లికి ఏర్పాట్లు చేశారు.

ఇది తెలిసి ఆమె దుఃఖం మరింత ఉధృతమైంది. మార్గాంతరంలేక నళిని ఆత్మహత్యకు పాల్పడింది. అర్ధరాత్రి ఇంటినుంచి పారిపోయి అడవిలోని

ఒక కొలనులో దూకింది. అట్లా దూకడాన్ని చూచిన ఒక సన్యాసిని ఆమెను రక్షించి తన ఆశ్రమానికి తీసుకు పోయింది. అక్కడ నళిని తనను కాపాడిన పుణ్యవతివద్ద యోగ విద్యాభ్యాసం చేసింది.

ఇట్లా అయిదేండ్లు గడిచాయి. అనుకోకుండా దివాకరుడు ఆ అడవిలో ప్రత్యక్షమయ్యాడు. ఒక రోజు దివాకరుడు నళిని కలుసుకున్నారు. నాటకీయమైన ఈ సంఘటనతో కావ్యారంభం జరిగింది. కావ్యాన్ని ఇట్లా ఆరంభించడంవల్ల ఆధ్యాత్మిక సంఘర్షణను—అంటే మానవీయమైన ప్రణయానికీ, సర్వసంగ పరిత్యాగానికీ మధ్య ఘర్షణను చిత్రించడానికి కవికి అవకాశం కలిగింది. దీనికి రంగస్థలం హిమాలయ పర్వత ప్రాంతము. ఆ విషయం కావ్యంలో స్పష్టం చేయబడింది. పాత్రలను కవి ప్రవేశ పెట్టాడు.

కవి రచనను బట్టి నళిని ఉషస్సువంటి స్వచ్ఛ నిసర్గ సౌందర్యము కలది. కొలనులో స్నానంచేసి ధ్యాననిమగ్నయై వుంది. ఆమె బట్టలింకా తడిసే వున్నవి. దివాకరుడు సమీపంలోనే వున్నాడు. కాని వారి చూపులు కలుసుకోలేదు. ఇద్దరి మధ్య ఒక చెట్టు వుంది. కాని ఇద్దరిలో ఏదో ఆదుర్దా, ఏదో కలత. సహజ జ్ఞానంవల్ల ఏర్పడిన ఈ అనుభూతికణమును కవి చూడగలిగాడు. కొంత సేపటికి ఇద్దరూ ఒకరి నొకరు చూచుకున్నారు. దివాకరునికి ఆమె వృక్షములమధ్య ఏకైక చంద్రకిరణంవలె కన్పించింది. కాని ఆమె సంగతి పట్టించుకోడు. ఆమెను అసలు గుర్తించడు. కాని నళిని స్థితి వేరు. ఆమె క్షణంలో అతన్ని గుర్తించింది.

తాము ప్రేమించిన వారిని గుర్తించడంలో స్త్రీలకు ప్రత్యేక దృష్టివుంది. ఆమె కొంత తడవు ఓపిక పట్టింది. ఇక నిగ్రహించుకోలేక పోయింది.

అదిరిపడి క్షణంపాటు
ఆయోమయమై నిల్చింది
అప్పుడు ఆనకట్ట బ్రద్దలుకాగా
సాగరంతో సంగమించే నదిలా
ఆమె యోగివైపు పరుగెత్తింది.

ఇక మరెట్టి ఆలోచన లేకుండా ఆమె యోగి కాళ్ళపై పడింది. పోషణలేని తన శిరోజాలు అతని పాదాలను తాకినందుకు ఆమె కెంతో సంతృప్తి కలిగింది.

కాని యోగి పూర్తిగా ఆశ్చర్య చకితుడైనాడు. అత నామెను గుర్తించ జాలక పోవడంవల్ల ఆమె చేష్ట అతన్ని దిగ్భ్రాంతుణ్ణి చేస్తుంది. అయినప్పటికీ నిజమైన యోగివలె అతను ఎట్టి వికారానికీ లోనుకాడు.

నళిని అతనికి తమ బాల్యమైత్రిని జ్ఞప్తికి తేవడానికి ప్రయత్నిస్తూ తా నెంతగా అతన్ని ఆరాధిస్తున్నదీ ఏకరువు పెడుతుంది :

సన్యాసినిగా వున్నా
నా తపస్సంతా నీ కొరకే
నిన్ను చూచేసరికి నా ఆశలన్నీ ఫలించాయి
నీకు నేను జ్ఞాపకమున్నా లేకపోయినా సరే.

ఆమె అవస్థను చూచి దివాకరుడు విచారపడతాడు. కాని తాను అనుసరించిన మార్గం వదిలి మళ్ళీ పూర్వ స్థితికి రాలేడు. నిశ్చలుడై నిలిచి ప్రాపంచికమైన ప్రేమ పట్ల మిథ్య అనీ ఆమెకు నచ్చ జెప్పడానికి ప్రయత్నిస్తాడు:

యోగిని సహవాసములో వున్న నీవు
నిజంగా అదృష్టవంతురాలివి
ఇక నన్ను వెళ్ళనీ
నీకు మనశ్శాంతి కలుగుగాక
విధి వ్రాసిపెట్టివుంటే
మనం మళ్ళీ కలుసుకుంటాము.

నళినిలో ప్రచ్ఛన్నంగా వున్న ప్రేమ పెద్ద జ్వాలవలె ఉవ్వెత్తున లేస్తుంది.

నీవు నాకు ఏకైక పెన్నిధివి
నాకు జీవితానివి, ఆనందానివి, ముక్తి ప్రదాతవు,
ప్రభూ, కమలములవంటి ఈ పాదాలు
నా గమ్యానికి పరిమితి :
ఇది కాస్తా పోయిందంటే
నేను అంతరించి పోతాను.

దివాకరుడు రంగమునుంచి నిష్క్రమించలేక పోయ్యాడు. గుండెలను బ్రద్దలుచేసే సంఘర్షణ కొనసాగుతుంది. తన సర్వశక్తులను కూడ గట్టుకొని ఆమెను మందలిస్తాడు :

సాధ్వీ, అపేక్షణీయా
నీ మహోదాత్త స్నేహమును
అశాశ్వతమైన ఇంద్రియ సుఖాలకు

బలిచేయకు.
శవముపై చల్లినపూలు
మరిదేనికైనా పనికి వస్తాయా?
ఈ భూలోకంలో
ప్రతిదాని సారాంశము ప్రణయము,
ప్రేమసార మొక్కటే సత్యము.
దానికోసమే నేను
మరుల కొలిపే ఈ ప్రపంచ బంధనాలను
పరిత్య జించాను.

చివరకు నళిని జీవితంలో పెద్ద పరివర్తనం కలుగుతుంది. భౌతిక భార మును వహించడం ఆమె కిక ఏమాత్రం ఇష్టం లేదు. తుదకు కమలము కమ లా ప్తునికే అర్పిత మవుతుంది. జీవితంలో సాధించలేని దానిని ఆమె మృత్యు వులో సాధిస్తుంది. తన భౌతిక అవశేషాలను ఆమె దివాకరుని శరీరం చుట్టూ వుంచుతుంది. అసాధారణమైన ఈ సంయోగమును కవి ఈ విధంగా వర్ణించాడు :

ఒక అల మరొక నిశ్చలమైన అలతో ఏకమైనట్లు
ఒక మధురనాదం మరొక నాదంతో మేళనం చెందినట్లు
మహోజ్జ్వలమైన కిరణం మరొక కిరణంతో
సంలీనమైనట్లు
ఇరువురి కాయము లొకటైనాయి.

బ్రహ్మానందము లభ్యమైన ఆక్షణంలో ఆ సుకన్య ఐహిక స్థితికి అతీతమై తన ప్రియునే అధిగమించి మహోజ్జ్వలంగా ప్రకాశించింది.

కొందరికి "నళిని" విషాదాంతము. నాయిక ప్రణయం వ్యర్థమైందని వారి వాదము. ప్రణయంయొక్క స్వభావం, దాని గమ్యంపీటిని—పరిశీలకుడు అర్థం చేసుకునే వైనంపై పర్యవసానం ఆధారపడి వుంటుంది. ప్రణయం లక్ష్యం భౌతిక సంయోగమూ విషయ సుఖములే అయినట్లయితే నళినిది విషాదాంతమని చెప్పాలి. అట్లా కాక ప్రణయం భౌతిక సుఖానికి అతీతమైన ఆనందమైనట్లయితే ఈ కావ్యం గొప్ప ఫలసిద్ధిని సాధించిందని చెప్పాలి. పాశ్చాత్యుల భావనయైన అమలిన శృంగారాన్ని (Platonic love). సంస్కృత లాక్షణికుల శృంగారాన్ని కవి చక్కగా మేళవింప జేశాడు. సంభోగ శృంగారమని, విప్రలంభ శృంగారమని

శృంగారము రెండు విధాలు. విప్రలంభ శృంగారం పది దశలుగా క్రమ పరిణామం చెందుతుంది. ఆ దశలు ఇవి:

1. చక్షు ప్రీతి
2. మనస్సంగము
3. సంకల్పము
4. జాగరము
5. కార్శ్యము
6. విషయ వైముఖ్యము
7. లజ్జా నాశము
8. ఉన్మాదము
9. మూర్ఛ
10. మరణము.

విప్రలంభమును యే దశలోనైనా సంభోగముగా మార్చవచ్చు నళిని విషయం చెప్పాలంటే ఆమె అన్ని దశలను అనుభవించినట్లు అవగతమవుతుంది. కావ్యంలో కవి ఆమెను ప్రవేశపెట్టినప్పుడు ఆమె తన ప్రియుని కలుసుకోబొయ్యేదశలో వున్నది. అంటే ఆమె 7 వ దశలో అప్పటికే వున్నదన్నమాట. తన ప్రేమను బాహాటంగా అంగీకరించడానికి ఆమె సిగ్గు పడలేదు. అంతకు పూర్వపు దశలను కవి ప్రేయసీ ప్రియులమధ్య జరిగిన సంభాషణము ద్వారా మన ముందు తళుక్కుమనిపించాడు. చివరి మూడు దశలు మనం చూస్తూ వుండగానే ఇట్టే జరిగిపోతాయి. కాని అవి కూడా వున్నాయి. ఇక ఆఖరి ముగింపు —అంటే మరణం రెండు విధాలుగా జరగవచ్చు: ఒకటి తీవ్రమైన ఆశాభంగము వలన, రెండవది సంభోగమువలన— అంటే ఆత్మల సంయోగమువల్ల. నళిని విషయంలో మొదటిదే జరిగింది. సామాన్యులైన మర్త్యులకు ఇది మేధకు సంబంధించిన వ్యాయామంగా మాత్రమే స్ఫురించవచ్చు. కాని మనం అందుకోలేని ఆ ఎత్తు పైననే ఆశాన్ "నళిని"లో 'ఒక ప్రణయము'ను నాటినాడు.

'నళిని' ఆశాన్ అనుభవించిన మనోవేదనకు ఒక రకమైన వ్యక్తీకరణ అని కూడా చెప్ప వచ్చు. దృఢగాత్రుడూ, ఆరోగ్యవంతుడూ అయిన ఒక యువకునిలో స్వాభావికంగా వుండే ప్రేరణలన్నీ అతనిలోనూ వున్నాయని మనం అనుకొనవచ్చు. అతను ఒక సమాజంలో క్రియాశీలియైన సభ్యుడు. అనేక రకాల

వ్యక్తులతో—స్త్రీలు, పురుషులు—అతను మెలగి పని చేశాడు. కనుక అనేక విధములైన ప్రేమలను పరికించి వుంటాడు. ఆయితే తన గురువునుంచి గ్రహించిన ఆధ్యాత్మికత, పరలోకచింతనము సుదృఢమైన వగుటచేత వాటిని విసర్జించ లేకపోయాడు. ఈ రెండు రకాల మనస్థితుల సంఘర్షణ ''నళిని'' కావ్యంలో బహిర్గతమైంది.

## లీల

అయితే తాను రూపొందింప దలచుకున్న ప్రణయము "నళిని" కావ్యంలో సమగ్రంగా రాలేదనీ, అందులో వచ్చినది అసంపూర్ణ ప్రణయ చిత్రమనీ ఆశాన్ భావించి, ''లీల'' అనే మరొక కావ్యం రచించాడు. ఇది 1914 లోనే వెలువడినప్పటికీ (అంటే 'నళిని' ప్రచురింపబడిన తర్వాత మూడు సంవత్సరాలకు) ఆశాన్‌కు ఈ కావ్యాన్ని ఇట్లా రచించాలన్న తలంపు 'నళిని'ని పూర్తిచేయకమునుపే కలిగినట్లు మనకు తెలియవస్తున్నది. ఎలాగంటే "లీల"కు ఆయన వ్రాసిన ఉపోద్ఘాతంలో ఇట్లా చెప్పాడు :

"'నళిని' రచనను పూర్తిచేయకముందే అదే ధోరణిలో మరొక లఘు కావ్యమును రచించవలసిన అవసరం వుందని నాకు అనిపించింది. కారణం ఇది: 'నళిని' లోని నాయికా నాయకులు రాజసగుణ విహీనులైన వ్యక్తులు. దాదాపు సాత్వికులు. సాత్వికమునకుముందు ప్రాపంచిక జీవితము హెచ్చుగా దశల వారీగా ప్రతిబింబిత మవుతుంది. కాబట్టి అది జీవితంలోని విషాదాలను, రహస్యములను బాగా చిత్రించ గలుగుతుంది."

దీనిని బట్టి ప్రబలమైన ఆ ప్రణయానుభవమును గూర్చి తాను చెప్పదలచుకున్నదంతా "నళిని"లో చెప్పలేక పోయినట్లు కవి అంగీకరించా డన్నమాట. ఐహికమైన కామోద్రేకములను మరింతగా వ్యక్తంచేసి నళినియొక్క సాత్విక స్వభావమును కళంకితం చేయడం ఆశాన్‌కు ఇష్టం లేదు. ఈ రెండు కావ్యముల నిర్మితిలో గల తారతమ్యమును, పోలికను స్వయముగా కవియే సముచితమైన ఒక ఉపమానంతో ఈ విధంగా చెప్పాడు :

''నళిని'' ఒక కమలము. దాని సువాసన సూక్ష్మంగా సుకుమారంగా సున్నితంగా వుంటుంది. దాని రంగుకూడా గాఢంగా వుండక మితంగా వుంటుంది. లీల చంపకపుష్పము. దాని పరిమళము గాఢమైనది. రంగు కూడా మిక్కిలి

ప్రకాశముగా చిక్కగా వుంటుంది. ఒకటి హృదయాన్ని ఆర్ద్రం చేస్తే రెండవది మనస్సును ఉద్రేకపరచి కలత పెడుతుంది. నళిని సామాన్యగాధ. ఆశాన్ స్వయముగా చేసిన సృష్టి. కాని లీల కథ నిజామీ రచించిన సుప్రసిద్ధ పారసీ మహా కావ్యమైన "లైలా మజ్నూ" ఆధారంగా అల్లబడింది. సెంట్రల్ హిందూ కాలేజీ పత్రికలో డా. ఆనందకుమారస్వామి ఒక వ్యాసం వ్రాశాడు. ఆ వ్యాసంలో ఈ పారసీకగాధను ఆశాన్ చదివాడు. పారసీ మూలమును చదవడం ఆశాన్‌కు సాధ్యం కాలేదు. కాని వ్యాసంలో చదివిన కథా సారాంశమే ఆశాన్ మనస్సును తొలిచింది. రాజసగుణాంకల ప్రణయం విషయంలో తన భావాలను, అనుభూతులను వ్యక్తం చేయడానికి ఆ కథ తగిన మూసగా ఆశాన్‌కు తోచింది.

ఆశాన్ చెప్పిన ప్రకారం ఈ కావ్యంలో కథ ఉత్తర భారత దేశంలోని ఉదయపూరులో జరిగింది. అర్థపాలకుడనే సంపన్న వణిక్ప్రముఖుని కుమార్తె లీల. ఆయన వ్యాపారం రీత్యా దేశాటనం చేస్తూవున్న ఒక సందర్భంలో లీల వివాహమును మరొక సంపన్న వర్తకుని కుమారునితో నిశ్చయం చేశాడు. కాని లీల అప్పటికే తన బాల్యమిత్రుడైన మదనునికి మనసిచ్చింది. అయినప్పటికీ తండ్రి ఆమెను పంజరంలోని పక్షిని ఇచ్చినట్లు తాను నిర్ణయించిన వరునికిచ్చి పెళ్ళి చేశాడు. ఆమె భర్తతో కాపురం చేస్తోంది. కాని ఆమె మనస్సు మదనుని పైనే లగ్నమై వుంది. అతనిపై ఆమెకు గల ప్రేమ అంత దృఢమైనది. ఆమె భర్త అనతికాలంలోనే మరణించాడు. బహుశా కేవలమొక పని ముట్టువంటి భర్తగా జీవించడం అతనికి మనస్కరించలేదేమో! ఇట్లా బంధ విముక్తురాలైన లీల తన స్వగృహానికి వెళ్ళింది. వెళ్ళగానే మదనుడు భగ్న ప్రేమికుడై వింధ్యపర్వత ప్రాంతాలకు వెళ్ళిపోయినట్లు ఆమెకు తెలుస్తుంది. అప్పటికే ఆమె తల్లి దండ్రులు పరలోకగతులైనారు. లీల తన చెలికత్తెతో అడవికి పోతుంది. వారు అడవిలో తిరిగి తిరిగి మదనుని కలుసుకున్నారు. ఆ సమయానికి అతను ఉన్మాదస్థితికి చేరుకున్నాడు. అనుకోని విధంగా తన ప్రేయసితో జరిగిన ఆ సమాగమమునకు అతను ఆవేగానుభవంలో శిఖరాగ్ర స్థితికి వెళ్ళాడు. తటాలున రేవానదిలో దూకాడు. లీల కిక మరొక తావేది? ఆమె కూడా ఆ నదీగర్భంలోనే విలీనమైంది.

"నళిని" వలెనే "లీల" కూడా వర్ణనాత్మకమైన కావ్యం కాదు. ఇది మూడు దృశ్యాల ఏకాంకిక వంటిది. ఈ కావ్యంలో మూడు సర్గలున్నవి. మొదటి

సర్గలోని మొదటి పద్యం స్పృహలేని స్థితిలో పడివున్న నాయికను ఆమె చెలికత్తె యైన మాధవి లేప ప్రయత్నించే సంభాషణ రూపంలో వుంది :

ప్రేమోపహతురాలా
నీకు శుభమగుగాక, నిద్రలే :
నీ ప్రియుడు కనిపించాడు
శీలవతీ,
దీర్ఘ మూర్ఛనుంచి లెమ్ము
నేను నీ సఖిని, మాధవిని.

ఈ విధంగా కావ్యం నాటకీయమైన ఘట్టంతో ఆరంభమవుతుంది. అంత వరకూ కథ సంభాషణ ద్వారా కథనం ద్వారా, బహిర్గతం చేయబడింది.

రెండవ సర్గలో మదనునిపై లీలకు గల ప్రేమ ఎంత గాఢమైనదో తెలియ వస్తుంది. మూడవ సర్గలో లీల, మాధవి అడవిలో మరి కొంత దవ్వు తిరగ డమూ మదనుని కలిసికోవడమూ వుంది. మదనుని కలుసుకోకముందే ఆతను తనకు దాపులోనే వున్న ట్లనిపిస్తుం దామెకు. అందుకు చంపక పుష్పముల సువా సన ఒక చిహ్నము. ఆశాన్ సృష్టించిన పాత్రలు మెల్లగా వాటి ఆంతరంగిక ప్రపంచంలోకి జారిపోయి, వ్యక్తా వ్యక్త మన స్థితికిచేరి కన్నులు చూడలేనిదానిని మానసికంగా కల్పన చేసుకొని దర్శించగల శక్తి గలవి. మదనుడు ఇప్పుడు నవయవ్వనం తొణికిసలాడే సుందరాంగుడు కాడు. కేవలము అస్థిపంజరము వంటివాడు. లీల అతనిని కౌగలించుకుంటుంది. అతను కూడా ఆ బ్రహ్మానందాన్ని అనుభవిస్తాడు. ఈ జంట నళిని దివాకరుల వంటివారు కారు తద్భిన్నులు :

అలసి సొలసి దాదాపు స్పృహతప్పివున్నా
కృశించి ఎముకల పోగై పోయినా
అతను ఆమెకేసి తదేకదృష్టితో చూచాడు
ప్రేమ కండబలాన్నిబట్టి ఏర్పడదు :
మ్రానుపైకి లతప్రాకినట్లుగా
ఆమె అతని కంటుకుపోయింది
అలసిన అతని అవయవములనుతట్టి
కనుగవనుండి కన్నీరు స్రవించగా
రుద్ధ కంఠంతో "ప్రియా" అన్నది.

"లీల" ఫలించని ప్రేమ వస్తువుగా వున్న కావ్యం. ఆశాన్ కావ్యాలు చాలా వరకు భగ్నప్రేమకు చెందినవే. ఏ తలుపు చూచినా మూసేవుంటుంది. ఎటూ దారి కానరాదు. 'లీల'లో మానసిక సంఘర్షణను ఒక చక్కని పద్యంలో ఇట్లా వర్ణించాడు:

ఏమిచేయాలని అనుకున్నామో
అది చేయలేము.
నియమిత విషయాలకు
మనస్సు బద్ధమై వుండదు
దైవేచ్ఛ ఎవరికీ తెలియదు
ఈ జీవితం బుద్బుద ప్రాయమైనది
మానవుని అవస్థ అథమమైనది.

లీల అనుభవంలోకి వచ్చిన ఈ నిరాశా నిస్పృహలు కవి కష్ట జీవితంగడు పుతూవున్న రోజులలో పలుమార్లు అతనిని కలచివేసి వుంటాయి. ప్రేమ అణచి వేయ డానికి వీలులేని మనోవికారమని అతను గ్రహించాడు. ఎంత అణచివేయ ప్రయత్నిస్తామో, అంతగా పైకి పొంగుకొస్తుంది. కామవాంఛ పరాకాష్ఠ చెందద మనేది ఏమిటో ఎరుగని పరిసరాలలో ఆశాన్ నివసిస్తున్నాడు. ప్రబలమైన కామ వాంఛను ఏ విధంగా ఉత్కృష్ట స్థితికి గానిపోయి కామప్రసక్తిలేని నిజమైన ప్రేమగా ఎట్లా దానిని సంస్కరించి అమలినం చేయవచ్చో సమాజానికి నొక్కి చెప్పవలసిన అవసరం లేదు. నళిని చాలా క్లిష్టమైన మహిమాన్వితమైన దశను చూపెట్టింది. లీల అంతకు కొంచెం దిగువన వాస్తవానికి దగ్గిరగావున్న జీవితాన్ని స్పృశించింది. అయితే భావవ్యక్తీకరణలో కవికి గల శక్తియుక్తులు లీలలో మరింత బాగా ప్రకాశమానమైనవి. ఆశాన్ ఈ రెండు కావ్యాలతో "ప్రణయ గాయకుడు" అనే బిరుదంతో మళయాళ సాహిత్య విమర్శకులు తనకు ఆపాదిం చిన గౌరవానికి తాను తగిన వాడనని సార్థకంచేసుకున్నాడు.

నళిని వలెనే లీలకూడా రాలినపూవు. అయితే ఆమె ఇహ లోకజీవితాన్ని సమాప్తం చేశాడంటే అంతకన్న దివ్యమైన మరొక జీవితానికి కవి నాందీ ప్రస్తావన చేశాడన్నమాట. ఆత్మ అమరమైనదని కుమారన్ ఆశాన్ విశ్వాసం. ఆయన తత్త్వజిజ్ఞాస హారీ ఎమర్సన్ ఫాస్‌డిక్ తత్త్వాన్ని పోలివున్నది "ప్రాథమికంగా నాకు అమరత్వముపై విశ్వాసమున్నది. వ్యక్తిగా నాకు అటువంటి అమరత్వము కావాలని నేను అశ్రులు సాచుతూవున్నందువల్ల కలిగిన

విశ్వాసం కాదిది. మరి ఎందుకంటారా? ఎందుకంటే అమరత్వమనేది లేదని అంటే మానవ జాతి యావత్తు నిరాశ అనే అంధకారకూపంలో పడిపోతుంది. తత్త్వజ్ఞానమనేది నిరాశను బోధించే పాఠంగా తయారవుతుంది.''

తానుఆశించనట్టి, హృదయవిదారకమైనట్టి ఈ వియోగాన్ని చెలికత్తె మాధవి భరించజాలక ఏడ్చి ఏడ్చి పసిపాపవలె నిద్రపోతుంది. సుందరాంగులైన దివ్య దంపతులు వచ్చి ఆమెను ఓదార్చుతారు.

# 8. గృహస్థు కావడం

కుమారన్ ఆశాన్ యస్. యన్. డి. పి. యోగం అనే సంస్థ వ్యవస్థీకరణ, పరిపాలనా బాధ్యతలను స్వీకరించినప్పటినుంచి (1902) ఆయన తన కులంవారిలో సాంఘిక ఆధ్యాత్మిక ఆశయాలను లక్ష్యాలను నాటి వారికి మార్గదర్శకత్వం వహించుటతోనే ఆయనకు సరిపోయింది. ఇతర విషయాలను ఆలోచించే వ్యవధే లేదు. ఆయన ఎల్లప్పుడూ గురువుగారి హితోపదేశముల వల్ల ఉత్తేజితుడయ్యేవాడు. అవి ఆయనకెప్పుడూ లభ్యమవుతూ వుండేవి. ఆయన ఆధ్యాత్మిక జీవనమునకు గురువుగారే ఒక రూపమిచ్చారు. అయితే ఆశాన్‌కు బలీయమైన స్వంత వ్యక్తిత్వమంటూ ఒకటి వుండేది. మరొకరెవ్వరూ ఆ వ్యక్తిత్వమును మరొక మూసలోపోసి వేరే ఆకారమివ్వడానికి (అదెంత గొప్పదైనాసరే) సాధ్యంకాదు. ఆశాన్ తన గృహజీవితాన్ని అలక్ష్యం చేసి దాని సంగతి పట్టించుకోకుండావున్న మాట నిజమే. 45 ఏండ్ల వయస్సు వచ్చేవరకూ తన పెండ్లినిగూర్చి గట్టిగా ఆలోచించకపోవడానికి అదొక కారణం. అతనిక బ్రహ్మచారిగానే వుండిపోతాడని అంతా అనుకున్నారు. చిన్నస్వామి అనే పేరుకూడా జనంలో ఈ నమ్మకానికి కొంత దోహదం చేసింది. కాని ఆశాన్ మనస్సు ఏ త్రోవలో పయనిస్తూవుందో ఎవరికీ తెలియదు. తన వ్యక్తిగత అభిమానాలనుగూర్చి ఇష్టాయిష్టాలనుగూర్చి ఆయన ఎవరితోనూ ఏమీ చెప్పేవాడుకాదు. వాటి ప్రస్తావన తేవడం అతని నైజంలోనే లేదు. తన ప్రైవేటు డైరీ వ్రాసేటప్పుడుకూడా సొంత విషయాల ప్రసక్తి తెచ్చేవాడు కాదు.

లౌకిక జీవితంపట్ల ఆయనకెందుకో ఒకవిధమైన విర్లిప్తత, అనాసక్తి ఏర్పడినమాట నిజం. 1911లో తల్లి చనిపోయినప్పుడుకూడా తల్లిపట్ల ప్రేమ అనే మానసిక బంధాన్ని వ్యక్తం చేసేవిధంగానైనా ఆయన ఆ గ్రామానికి హుటాహుటి ప్రయాణమై పోలేదు. ఆ తరువాత తల్లి మరణంపట్ల తన సంతాపాన్ని ప్రకటిస్తూ కొన్ని స్మృతిగీతములు వ్రాశాడు. తనకు కావలసిన వారిపట్ల ఆశాన్ ప్రవర్తన దాదాపు ఉదాసీనతగా, ఒకరకమైన నిర్లక్ష్యంగా కన్పించేది. అతనూ ఒక స్వామి గనుక బంధములను తెంచుకొనే ధోరణికి అది ఒకవిధమైన వ్యక్తీకరణ అని అనుకుందామనుకున్నా స్వజనం అనే భావన లేకపోవడం అలక్ష్యమేకదా!

ఆశాన్ అనే వ్యక్తిలో బ్రహ్మచారికీ, గృహస్థాశ్రమికీ మధ్య సంఘర్షణ జరిగివుంటుంది. చివరకు గృహస్థాశ్రమిదే పైచేయి అయింది. అతని మనస్సులో జరిగిన ఈ మార్పు "వీణపూవు", "నళిని", "లీల" అనే కావ్యాలలో ప్రతిబింబించింది. తిరువనంతపురంలో అతను గడిపిన జీవితం కొన్ని కుటుంబాలతో అతనికేర్పడిన సన్నిహిత పరిచయం అతని చిత్తవృత్తిలో మరికొంత ఉల్లాసమునూ, ఉత్సాహమునూ కలిగించివుంటుంది. ముఖ్యంగా డా. పల్పుగారి కుటుంబంతో ఆయనకు ప్రత్యేక స్నేహము, ప్రేమభావము ఏర్పడిన సంగతి మనమిదివరకే తెలుసుకొని వున్నాము. యోగం వ్యవస్థా సంబంధమైన కార్యకలాపాల రీత్యా ఆశాన్ తరచు పర్యటనలు చేయవలసి వుండేది. తిరువనంతపురం యోగమునకు ప్రధాన కార్యస్థానం గనుక ఎక్కువ రోజులు అక్కడవుండి పనిచేస్తూ వుండేవాడు. డా. పల్పుగారి సోదరుడు పి. మాధవన్ వైద్యన్ గొప్ప ఆయుర్వేద వైద్యుడుగా పేరుపడ్డవాడు. ఆశాన్ వైద్యన్‌గారి కుటుంబంతో సన్నిహితంగా వుండేవాడు. దాదాపు 14 ఏండ్ల పాటు ఆ కుటుంబంలో ఒక వ్యక్తిగా పరిగణింపబడ్డాడు. డా. పల్పుగారి మేనమామగారైన కుమారు రైటర్ కుటుంబంకూడా ఆశాన్‌ను ఆకర్షించి సన్నిహితం చేసుకుంది. పైగా కుమారు రైటర్ యోగమునకు ఆడిటర్‌గావుండి దాని లెక్కాడొక్కలు చూస్తూవుండేవాడు. కొంతకాలంపాటు ఆయన యోగమునకు ఉపాధ్యక్షుడుగాకూడా వున్నాడు.

ఇట్లా ఆశాన్ కవికి కుమారు రైటర్ కుటుంబంతో ప్రత్యేక సంబంధమేర్పడింది. కుమారు రైటర్ గారి భార్య సంగీత సాహిత్యాలలో వైదుష్యం కలది. మనిషికూడా అందంగా ఆకర్షవంతంగా వుండేది. ఆశాన్ కావ్యాలంటే

ఆమెకు చాలా అభిమానం. ఆ కుటుంబంవారికి ఇష్టుడైన ఈ అతిధి ఒక రోజున వారికి అల్లుడవుతాడని ఎవరూ ఊహించలేదు. కాని అటువంటిది జరిగింది. ఆ జరగడంకూడా విచిత్రంగా జరిగింది. 45 ఏండ్ల వయస్సులో వున్న కవి 17 ఏండ్ల ప్రాయపు బాలికను పెండ్లాడాడు! ఒకప్పుడా అమ్మాయి ఆయన శిష్యురాలు! పైగా ఆశాన్ కలకత్తాలో నివసించి తిరిగివచ్చి ఈ కుటుంబంవారిని దర్శించిన రోజునే ఆ బాలిక జన్మించింది.

కామదేవుని లీలలు వింతైనవి. కాషాయ వస్త్రములు ధరించే స్వాములను కూడా ఆయన వదలడు. అటువంటప్పుడు ప్రణయాన్ని గూర్చి గానంచేసే కవులను ఎలా విడిచిపెడతాడు? కుమారు రైటర్ కుమార్తె అయిన భానుమతి అమ్మ సంగతి పట్టించుకున్న వారొక్కరూలేరు. ఆ పిల్ల పదకొండో యేటనే చదువు చాలించి, ఇంటి బాధ్యతలను స్వీకరించవలసివచ్చింది. ఇందుకు కారణం వారింటిలో సంభవించిన ఒక సంఘటనవల్ల కొంతకాలంవరకు తల్లి మానసిక స్థితి తారుమారైంది. ఆ సంఘటన ఏమిటంటే—భానుమతి అక్కయైన 19 ఏండ్ల బాలిక వివాహం జరిగిన కొద్దిరోజులకే విషాదకర పరిస్థితుల్లో మరణించింది. అందువల్ల భానుమతి స్కూలు చదువుకు స్వస్తి జరిగింది. అయితే ఇంటివద్ద ఒక ప్రైవేటు మాస్టారును పెట్టి ఇంగ్లీషు చెప్పించ మొదలుపెట్టారు. కాని ఈ ఏర్పాటుకూడా ఎక్కువకాలం సాగలేదు. ఆ తరువాత ఆమె తల్లిదండ్రులు తమ కుమార్తెకు సంస్కృతంలో ప్రవేశం కలిగించడం మంచిదనుకొని కుమారన్ ఆశాన్‌నుకూడా సంప్రదించారు. చివరకి ఆశాన్ ఆ బాలికకు తన వ్యవధినిబట్టి సంస్కృతం కొంత బోధించడానికి అంగీకరించాడు. ఈ ఏర్పాటు అందరికీ సంతోషం కలిగించింది. ముఖ్యంగా 15 ఏండ్ల ప్రాయపు విద్యార్థిని అయిన ఆ బాలిక విఖ్యాత మళయాళ కవి తనకు ప్రత్యేకంగా ట్యూటర్ కావడం గర్వకారణంగా భావించింది. భానుమతి జీవితంలోకి వెలుగు ప్రవేశించింది. ఉత్సాహంతో సంస్కృతం నేర్చుకుంది. చురుకుదనం, దీక్షకల శిష్యురాలు తనకు లభించినందుకు గురువుగారు సంతసించాడు. అప్పుడప్పుడు తాను రచించిన పద్యాలు చదివి వినిపించి ఆ బాలికకు వాటి భావం ఏమిటో చెప్పేవాడు.

గురువుగారిపట్ల షోడశవర్ష ప్రాయంలోవున్న భానుమతికిగల ఆకర్షణ ఆమెకు తెలియకుండా కొద్దికాలానికే రంగు మారింది. శరీరం యవ్వనంతో వికసి

పించడంతోపాటు, మనస్సులో కూడా మధురమైన తేనె పుట్టుకొచ్చింది. అది ప్రకృతి ధర్మం కదా? మన కవిగారే అన్నాడు,

తరుణం వచ్చినప్పుడు
పాదులోనో, చెట్టుపైననో
వున్న లతలుకూడా
ఒకరికోసం ఆగవు
వాటంతట అవే వికా సం పొందుతాయి.

శిష్యురాలు గురువుగారికి రోజూ పూలు సమర్పిస్తూ వుండేది. ఆమె గురువు గారిని ఆరాధించేది. ఆయన ఏ కారణం వల్లనైనా ఒక్క రోజు రాకపోతే మనో వ్యాకులంతో గడిపేది. కాని ఈ అనుబంధంలో శృంగార సంబంధమైన కామన ఏమీ లేదని భానుమతియే తన జ్ఞాపకాలలో వ్రాసుకుని మనకా వృత్తాంత స్వభావం ఏమిటో తెలియపరచింది. ప్రేమ ఆరాధనగా మారిన సందర్భ మిది. ఒక వేళసరిగ్గా అటు వంటిదే జరగకపోయినా ఆ ప్రాయంలోవున్న కన్య మనః ప్రవృత్తిని మనం అర్థం చేసుకోవచ్చు. మరి 45 ఏండ్ల వయస్సులోవున్న కవిగారి సంగతి ఏమిటి? యుక్తవయస్సు దాటినవాడు కదా! పైగా ఒక పెద్ద సంస్థను నడుపుతున్నవాడు. సంఘంలో నిలదొక్కుకున్నవాడు. అంతే గాక ఆధ్యాత్మికంగా నారాయణగురువుకు వారసుడుగా ఎంచబడినవాడు. తాను వేసే ప్రతి అడుగూ బాగా చూచి ముందుకు సాగిపోవలసినవాడు కదా. అలా వ్యవహరించాడా?

వ్యవస్థా సంబంధమైన కార్యములతో తీరిక ఎక్కువగా లేకుండా వుండేవాడు గనుక ఆశాన్ సాయంకాలాలు మాత్రమే తీరిక కల్పించుకొనివచ్చిభానుమతికి పాఠాలు చెబుతూ వుండేవాడు. ఒక రోజు వర్షం బాగా పడుతూ వుంది. పాఠాలు చెప్పడం అయిన తరువాత ఆశాన్‌ను రాత్రికి అక్కడే వుండపొమ్మని అన్నారు. మరికొన్ని రోజులకు ఆశాన్ ఎక్కడోవుండి రోజూ వస్తూ పోతూ ప్రయాసచెందే బదులు, ఆ ఇంట్లోనే వుండిపోతే ఆయనకు అసౌకర్యం లేకుండా పోతుందన్న సూచన వచ్చింది. ఆశాన్ తాను ట్యూషన్ ఫీజు తీసుకోవడం లేదు కాబట్టి ఆ సూచనకు తన సమ్మతి తెలుపడం సమంజసమేనని భావించి అంగీకరించాడు. ఆ రోజుల లోనే ఆశాన్ ఇద్దరు జర్మన్ పండితులకు సంస్కృతం ట్యూషన్ చెబుతూ వుండే వాడు. వారు నెలకు రూ 40 చొప్పున పారితోషికమిచ్చేవారు. భానుమతి ఇంటిలో ఆశాన్ రాత్రి భోజనంచేసి అక్కడే ఒక గదిలోవున్న పడకపై నిద్రపోయేవాడు.

సహజంగానే గురువుగారికి అన్నీ అమరుతున్నాయా, అసౌకర్య మేమీ లేదు కదా అన్న విషయాలను శిష్యురాలు స్వయంగా గమనిస్తూ పురమాయిస్తూ వుండేది.

అయితే ఈ పరిస్థితు లన్నింటిలో, మారిన ఈ అవస్థాంతరములో గురువు గురువుగానే వుండిపోయాడు. శిష్యురాలు శిష్యురాలుగానే వుంది. ఆశాన్ అసాధారణమైన క్రమశిక్షణ, ఆత్మవిగ్రహము కలవాడు మోహములోపడి తనను తాను మరచిపోవడం ఎన్నడూ లేదు. ప్రతి అడుగూ ఆచితూచివేసి నడిచేవాడు. బుద్ధి పూర్వకంగానే ఏ పని అయినా చేసేవాడు. ఒక మారు ఒక నిర్ణయం చేసుకున్నాడా ఇక దానినుండి ఆయనను మరల్చడం ఎవరికీ శక్యంగాని పని.

ఆ కన్యను ఆశాన్ ప్రేమించాడు. అందులో సందేహం లేదు. ఆమె ఆపేక్షలో కూడా ఏదో ప్రత్యేక ధోరణి, ఉత్సుకత, తీక్షత, స్వచ్ఛందనము పెంపొందుతున్నట్లు అతను గ్రహించాడు. సాధారణంగా ఉత్తమ శిష్యురాలిలో అటు వంటి లక్షణాలను మనం ఆశించము. ప్రశాంత సమయాలలో ఇక జరగవలసింది ఏమిటి అన్న విషయంలో మంచి చెడ్డల బేరీజు వేసుకునేవాడు. ఉభయులూ జరగ వలసిన దానికి ఉత్సుకత, అభిలాష చూపుతున్నారు. ఆయన స్నేహితులలో స్త్రీ పురుష లెందరో వున్నారు. కాని తన్ను తాను పూర్తిగా ఎట్టి అరమరలు లేకుండా సమర్పించుకోవడానికి ఎవరూ లేరు. తనది, తన సర్వస్వము అని చెప్పుకోదగ్గ వ్యక్తి లేదు. అటు వంటి సహధర్మచారిణివల్ల జీవిత ధర్మం పరి పూర్ణత చెందుతుంది. అది సార్థకమైన జీవితం. భానుమతి కూడా తన లాగే భావన చేస్తూ వుందనీ, సమ్మతిస్తుందనీ గ్రహించాడు. ఈ గ్రహింపు, మనో భావము క్రమేపీ కలిగినవే కాని ఆవేశంతో ఆవేగంతో తుపానులా వచ్చిపడ్డవి కావు.

గాలి బాగా ఊది పూర్తిగా నింపిన బెలూను ఎక్కడో టప్‌మని పగులు తుంది. ఆ గాలి గుమ్మటం ఒకానొక రీతిలోనే ఎందుకు పగలాలి అన్న ప్రశ్నకు జవాబు తెలుసుకోవడం అంత సులభం కాదు. 1917 లో నారాయణగురు జన్మ దినోత్సవం మహా వైభవంగా జరుపబడుతూ వుండగా ఆ ఉత్సవంలో పాల్గొన డానికి ఆశాన్ ఆ రోజు కొంచెం ముందుగా అక్కడికి వెళ్ళవలసిన అవసరం కలి గింది. ఆ రోజు ఆయన తెల్లవారు జామున 3-30 గం. లకే నిద్రలేచి, ఇంటి ఆవరణంలో నిల్చొని దంతధావనం చేస్తున్నాడు. భానుమతి నీళ్లు తెచ్చి ఇచ్చింది. అప్పుడాయన ఏ కారణమూ లేకుండానే తన చేతిని ఆమె నుదుటిపై వుంచి ఆశీర్వ దించాడు. అస్పర్శలో గురువుగారి ఆశీర్వచనానికి మించిన అనుభూతి ఏదో

భానుమతికి కలిగింది. ఆ తర్వాత కొద్దిరోజులకే వా రిద్దరూ ఒకరి నొకరు ప్రేమించుకుంటున్నట్లూ, ఒకరికోసం మరొకరిని విధాత సృష్టించినట్లూ తేలి పోయింది.

ప్రేమ అనేది మనుష్యుల్ని అల్పులుగా చేస్తుంది. అదే ప్రేమ కొందరిని అధికులను చేస్తుంది. జీవితంలో మిట్టపల్లాలను సమానం చేసేది ప్రేమ. 45 ఏండ్ల వయస్సు గల విఖ్యాత కవి, 17 ఏండ్లప్రాయంలో నిరాడంబరంగా పెరుగుతూ నాగరీకమంటే ఏమిటో తెలియని ఒక సాధారణ కన్య ఒకే స్థాయికి చేరుకున్నారు.

భానుమతి వ్రాసిన జ్ఞాపకాలనుబట్టి ఆశాన్ ఒక రోజు ఆమెకు మామూలు పాఠాలు చెప్పిన తరువాత "కపోతపుష్పము" అనే తన కావ్యఖండికను చదివి వినిపించాడు. ఆ పిమ్మట తన కోటుజేబులోనుంచి ఎండిపోయిన పూవును తీసి భానుమతికి కానుకగా ఇచ్చాడు. దాని పరిమళమును ఆమె కొన్నేండ్లవరకూ జ్ఞాపకం పెట్టుకుంది. "రాలిన పూవు"ను వ్రాసిన కవి వరేణ్యుడు తన ప్రియురాలికి కొత్తగా వికసించిన పూవును ఇవ్వక వాడి ఎండిపోయిన పూవును ఇవ్వడం గమనించదగ్గ విశేషం. ఈ చిన్న సంఘటనలో బహుశా సంకేత మాత్రమైన ప్రాముఖ్యం వుందేమో.

గురు—శిష్యుల సంబంధంలో కలిగిన మార్పును మొదట భానుమతి తల్లి గమనించింది. శిష్యురాలు తన హద్దులను దాటిపోయిందని తెలుసుకున్న ఆమె అది మంచిది కాదని కుమార్తెను హెచ్చరించింది. కాని ప్రయోజనం లేక పోయింది. మరి కొన్నిరోజులకు ఈ సంగతి కుమారు డైరెటర్‌కూ, వారి కుటుంబంలో ఇతరులకూ తెలిసిపోయింది. ఈ విశేషం ఎవరినీ సంతోష పరచలేదు. గుసగుసలూ, పుకార్లూ వ్యాపించాయి.

కుమారన్ ఆశాన్ తిరువనంతపురంలో చిన్న ఇల్లు కొన్నాడు. ఆయన, ఆయన మిత్రుడు అయ్యప్పన్ అందులో నివసిస్తున్నారు. వధువు తండ్రి అనుమతిని పొందడం వంటి వివాహ మర్యాదలు జరిగాయి. ఎన్నో విమర్శలు, ఇబ్బందులు ఎదుర్కొనవలసి వచ్చినప్పటికీ వివాహం జాప్యం లేకుండా జరగవలసి వచ్చింది. ఆశాన్‌వంటి మహావ్యక్తి తన అంతస్తునుండి క్రిందికి దిగి వ్యక్తిత్వంలాని 17 ఏండ్ల సాధారణ కన్యను వివాహమాడబోతున్నందుకు కొందరు విస్మయము చెందారు.

ఆశాన్ ఈ నిర్ణయం గైకొన్నప్పటికీ వివాహానికి తన గురువైన నారాయణ గురుగారి అనుమతిని, ఆశీస్సులను పొందవలెననుకున్నాడు. అయితే స్వయంగా వెళ్ళి ముఖం చూపడానికి వెనుకాడి, తన విన్నపమును నాలుగు సంస్కృత శ్లోకాలుగా వ్రాసి గురువుగారికి పంపుకున్నాడు. మానసికంగా ఎంతో ఆలజడిని కలిగించే ఈ సంఘటననుగూర్చి ఆశాన్ తాను ఇంగ్లీషులో వ్రాసిన డైరీలో ఒకే ఒక వాక్యం వ్రాశాడు :

'నా వివాహానికి అనుమతి నివ్వవలసిందిగా ప్రార్థిస్తూ సంస్కృత శ్లోకాలు రచించి స్వామిగారికి పంపుకున్నాను'—14-2-1917.

అల్లే భానుమతి తండ్రితో తాను వివాహాన్నిగూర్చి మాట్లాడిన విషయాన్ని కూడా కేవలం ఒక్క వాక్యంలోనే వెల్లడించాడు :

'నా వివాహాన్నిగూర్చి శ్రీ యం. కుమారుగారితో మాట్లాడాను'—7-2-1917.

స్వామిగారికి వ్రాసుకున్న విన్నపంలో ముందుగా వారి అనుమతి పొంద కుండానే తాను ఒక నిర్ణయానికి వచ్చినందుకు క్షమాపణ వేడుకున్నాడు. ఈ ఉత్తరంస్వామిగారికి రెండు మార్లు చదివి వినిపించడం జరిగింది. ఆయన ఏమం టారో వినడానికి జనం అత్యంత ఆసక్తితో వేచివున్నారు. కాని నారాయణగురు పల్లెత్తు మాటకూడా అనలేదు. వారం గడిచిన తర్వాత వారి ఆశీస్సులకోరుతూ ఒక తంతి వచ్చింది. ఒక శిష్యుడు అడిగాడు.

'స్వామీ. అనుమతి నొసగుతూ మనం సమాధానం వ్రాయవద్దా?'

'ఎందుకు? వివాహం నిశ్చయమైపోయింది. ఇక అనుమతి అసంగతము, అప్రస్తుతము.'

'ఆశీస్సులు పంపమని వేడుకున్నాడు కదా'

'ఆశీస్సులు వుండనే వున్నవి. పంపవలెనా?'

నారాయణగురు వద్దనుండి ఎట్టి సమాధానమూ లేదు. ఎందుకో స్వామిగారు సంతసించలేదు. అయితే జోక్యం చేసుకోవడం వారి కిష్టంలేదు.'

ఆశాన్ వివాహం 1917 లో శుభకార్యపుతంతులు ఆట్టే లేకుండా నిరా డంబరంగా జరిగిపోయింది. వధూవరులు దండలు మార్చుకోవడం ముఖ్య కార్య క్రమం. ప్రభుత్వ సచివాలయంలో ఉద్యోగిగావున్న కృష్ణఅయ్యర్ అనే ఆయన పురోహితుడు. అరవిందానన ఎప్పుడు అడుగుపెడుతుందా అని ఎదురు చూస్తూ

వున్న కొత్త ఇంట్లో ఆశాన్, భానుమతి కాపురం పెట్టారు. నవదంపతులు ఎట్టి ప్రతిబంధకము లేక ఒకరినుండి మరొకరు కొత్తపాఠాలు నేర్చుకునేందుకు వీలు కలుగజేయడానికై అయ్యప్పన్ ఆ ఇల్లు విడిచి మరొకతావు చూచుకున్నాడు. పంతులుగారు పాఠాలు చెబుతూనే వున్నారు. అయితే అవి సంస్కృత కావ్యాల వరకే పరిమితమై లేవు. పాక కళ, గృహ నిర్వహణ, ఇంకా అనేక విషయాలను గూర్చి కూడా నవవధువుకు చెప్పుతున్నాడు. భానుమతి అమ్మ వ్రాసుకున్న జ్ఞాపకాలలో తాను భర్తనుండి అనేక కొత్త విషయాలను నేర్చుకున్నాననీ, తనను ఆయన ప్రయోజకురాలిగా మలిచాడనీ చెప్పుకుంది.

ఆశాన్ జీవితంలో అనేక రకాల విమర్శలకు గురి అయ్యాడు. వ్యక్తిగతంగా సాంఘికంగా, సాహిత్యపరంగా పుంఖాను పుంఖంగా ఆయనపై దాడులు జరిగాయి. చిత్రమేమిటంటే ఆయన కులానికిచెందిన వారినుంచే ఎక్కువగా ఈ విమర్శలు, ఖండనలు వచ్చాయి. యోగం మహా సంస్థగా అభివృద్ధి చెందింది. మరి సహజంగానే యోగం కార్యదర్శి అంటే పెద్ద గౌరవ ప్రతిష్ఠలు గల పదవిగా ఎంచబడుతూ వుంది ఆ పదవికి రాకీజయంగా కూడా కొన్ని ప్రయోజనాలు, సులువులువున్నాయి ప్రజా సభ (తిరువాన్కూరు శాసనసభ)లో సభ్యత్వం వుంటుంది. ఆశాన్ దివాన్‌గారిని ఎప్పుడు పడితే అప్పుడు అవలీలగా కలుసుకొని మాట్లాడవచ్చు. ఆయన చేసే సిఫారసులకు విలువ వుంటుంది. ఈ పలుకుబడిని ఆయన తన కులంవారికి మేలుచేయడానికీ, అర్హులైనవారికి సహాయ పడేందుకూ వినియోగించాడు. అయితే కొందరు సమకాలికులు అసూయాద్వేషాలతో ఆశాన్ పేరు ప్రతిష్ఠలకు కళంకం తేవాలని ప్రయత్నించారు. ఆశాన్ తన పదవిని స్వప్రయోజనాలకు దుర్వినియోగ పరుస్తున్నాడని ఆరోపణలు చేశారు. మరి కొందరు ఆయన వ్యక్తిగత జీవితంపై లేనిపోని అభాండాలు వేశారు. శిష్యురాలినే పెళ్ళిచేసుకోవడంవల్ల ఆశాన్‌పై నిందలు వేయడానికి ప్రత్యర్థులకు మంచి అవకాశం చిక్కింది.

ఆయనకు సన్నిహితులైన అనుచరులనబడేవారే కొందరు అటువంటి నిందలు వేసేసరికి ఆశాన్ చాలా నొచ్చుకున్నాడు. మౌనవేదన అనుభవించాడు. అట్టి వేదన ఫలితంగానే 'గ్రామవృక్షత్తిలె కుయిల్' (గ్రామవృక్షంపైని కోకిల— 1919) అనే ఖండకావ్యం ఆయన కలంనుంచి వెలువడింది. ఈ కావ్యంలోని కోకిల కవియే., ఇక వృక్షం ఎవరంటే - ఎస్. ఎన్. డి పి. యోగం. ఆ వృక్షం యజమాని యోగియైన నారాయణగురు. ఈ సంకేతాలతో ఆశాన్ తన

విరాశా విచారముల భారాన్ని దించివేసుకో గలిగాడు. నిజంగా ఇది చాలా చక్కని కావ్యం. ఆశాన్ మనస్సు ఏ స్థితిలో వుందీ ఈ కావ్యం అద్దంపట్టి చూపించింది:

ప్రేమతో అమృతంలా ప్రవహించిన
నీ పాటలను అనుదినం వింటూ
వృక్షం ఆకులువిండిన శాఖలతో
అన్నివైపులా విస్తరించింది.
ఆకాశంవలె గాఢమైన వన్నెలతో
అల్లంత ఎత్తుకెగసింది.

కోకిల తమ కులానికి 15 ఏండ్లపాటు చేసిన సేవను సవిస్తరంగా ఈ కావ్యం వివరించింది. పగటివేళ దాడిచేసిన కాకులు రాత్రులు దండయాత్ర సల్పిన గబ్బిలాలు కోకిలను దాని కర్తవ్యనుండి మరల్పలేక పొయ్యాయి ఆత్మకథా సంబంధమైన విశేషం వుండడంవల్ల ఈ ఖండకావ్యం మరింత మెరుగులు దిద్దుకుని అందచందాలతో అలరారుతూ వుంది.

లోగడ చెప్పినట్లు ఎస్. ఎన్. డి. పి. యోగం 1902 లో స్థాపించ బడింది. ఆశాన్ 1919 వరకు దానికి ప్రధాన కార్యదర్శిగా వున్నాడు. యోగం నియమావళినిబట్టి ప్రధాన కార్యదర్శి ప్రతి సంవత్సరం ఎన్నుకోబడాలి. ఈ సంస్థ తొలిదశల్లో ఆ పదవిపై ఎవరికీ ఆసక్తిలేకపోయింది. తరువాత కొంతమందికి ఆ పదవిపై కాంక్ష కలిగింది. కాని కుమారన్ ఆశాన్‌కు దీటైన వారెవరూ లేక పోయారు. కాబట్టి ప్రతి సంవత్సరం ఆశాన్ ఎన్నుకో బడ్డాడు. దీని వల్ల కొందరు ఓర్వలేని వారు ఆ పదవిలోవుండే వ్యక్తి మారాలని కోరారు. ఆ పదవిని నిర్వహించడంలో ఆయనకు ఇబ్బందులు ప్రతిబంధకాలు సృష్టించారు. అలాంటి మార్పు అవసరమని ఆశాన్ 1915 నుంచే అంటున్నాడు. ఆయన కీర్తి స్వరాష్ట్రాన్ని దాటి ఇతర ప్రాంతాలకు కూడా వ్యాప్తి చెందింది. యోగం పదహారవ వార్షికోత్సవ సందర్భంలో తాను పదవినుండి తప్పుకోదలిచానని ఆశాన్ బహిరంగంగా ప్రకటించాడు. కొంత కష్టంమీద తనను పదవి బాధ్యతలనుండి విముక్తుని చేయడానికి పెద్దలు అంగీకరించేట్టు చేశాడు.

ఇది జరగడానికిముందే నారాయణగురు యోగం కార్యకలాపాలలో ఆసక్తితో పాల్గొనడం మానుకున్నాడు. ఈ విషయం దిగువ పేర్కొనబడిన పద్యంవల్ల విశదమవుతున్నది :

ఈ తావును మీరిప్పుడు వదిలిపోవద్దు.
ఈ మహావృక్షం ఒక్క
కపీనిటి బొట్టుకైనా అర్హురాలుకాదు.
తపస్సు పూర్తిచేసిన మహర్షి
వివాహస్థలం విడిచి వెళ్ళాడు.
మహాపురుషులు దేవికి
బహుకాలం అంటిపెట్టుకొని వుండరు.

ఆశాన్ యోగంనుండి పదవిరీత్యా సంక్రమించే అధికార యుతమైన సంబంధాలను తెంచివేసుకున్నప్పటికీ, కులంవారు మాత్రం ఆయనను అవతలికి నెట్టివేయలేదు. ఇందుకు నిదర్శనం 17 వ వార్షిక మహాసభకు అధ్యక్షుడుగా ఆశాన్‌ను వారు ఎన్నుకోవడమే.

పదహారు సంవత్సరాలపాటు ఆశాన్ స్వంతలాభం మానుకొని, స్వసుఖం త్యాగంచేసి యోగమునకు కష్టించి సేవ చేశాడు. 1917 లో కూడా ఆయనకు నెలకు 30 రూ.లు అలవెన్సు మాత్రమే ఇచ్చేవారు. దానిని 50 రూ.లు చేసేసరికి సందడి మొదలైంది. దీనిని బట్టి ఆశాన్ ఎటువంటి పరిస్థితులలో సంస్థకు సేవచేసిందీ విదిత మవుతుంది. కనుకనే ఆయన ప్రశాంతమైన గృహంకోసం వేకారాడు. వైరిజనం ప్రశంసలకూ, ఖండనమండనలకూ దూరంగావుండి, తన సృజనాత్మక ప్రతిభను సాధకం చేసుకోవడానికి అనువైన ప్రశాంత కుటీరం వుంటే అంతే చాలు ననుకున్నాడు.

# 9. ప్రరోదనము—సీత

వివాహం కుమారన్ ఆశాన్ జీవిత పథంలో నిశ్చయంగా ఒక పెద్ద మలుపు అని చెప్పవచ్చు. ఆ తరువాత తనపై వచ్చిన ఆరోపణలకు కవిత్వ రూపంలో సమాధానమిస్తూ 'కుయిల్' కావ్యం (1918లో) వ్రాయడం, 1919లో యోగం కార్యదర్శి పదవినుండి విరమించుకోవడం వెంటవెంటనే జరిగాయి. ఆశాన్ సాహిత్య యాత్రలో 1919 మిగుల ఫలవంతమైన సంవత్సరమని చెప్పాలి. ఆ ఒక్క సంవత్సరంలో ఆయన రెండు పెద్దకావ్యాలు రచించాడు. ఒకటి 'ప్రరోదనము', రెండవది 'సీత.' వీటిని కొంత పరిశీలిద్దాము.

## ప్రరోదనము

ఆశాన్ రచించిన పెద్ద కావ్యాలలో విలాపమును ప్రకటించే స్మృతి గీత వైలక్షణ్యం వుంటుందని ఆరవ అధ్యాయంలో తెలుసుకొని వున్నాము. ఆయన రచించిన కావ్యాలలో 'ప్రరోదనము' సమగ్రమైన స్మృతి గీతము. 'ప్రరోదనము' అంటే అతి సంతాపము. పండితుడూ వైయాకరణుడూ, కవీ అయిన ఎ. ఆర్. రాజరాజవర్మ (1863-1918) మరణ సందర్భంగా రచించిన స్మృతి కావ్యమిది. వర్మకు అటు ప్రాచీన మహా కావ్యాలపై అభిరుచీ, ఇటు ఆధునిక దృక్పథమూ వుండేది. ఈ రెండు గుణాలు ఒకే వ్యక్తిలో ఆ కాలంలో వుండడం అరుదు, పైగా వర్మ ఆశాన్‌ను బాగా అర్థం చేసుకున్న మిత్రుడు, ఉత్సాహమూ, అభిమానమూ చూపిన కవి పోషకుడు. ఆశాన్ కవిగా ప్రఖ్యాతి జెందక మునుపే ఆతని బృహత్కావ్యమైన 'నళిని'కి చాలా చక్కని పరిచయ వాక్యాలు వ్రాశాడు. 'నళిని'లో కవి తొక్కిన కొత్తబాటను, ఆ కావ్యంలోని నవ్యతనూ దాని ప్రాశస్త్యమునూ రాజరాజవర్మ ప్రముఖంగా చూపెట్టాడు.

ఇది ఆశాన్‌కు మామూలు ప్రోత్సాహం కాదు. పైగా అంతటి ఉద్దండ పండితుడూ, కావ్యాత్మ ఎరిగిన ప్రామాణికుడూ ఇచ్చిన యోగ్యతాపత్రమది. ఉత్తమ సాహిత్యమనేది అగ్రవర్ణముల వారినుంచే వెలువడుతుందని ఒక విశ్వాస మేర్పడిపోయిన సమాజంలో క్షత్రియకులానికి చెందిన రాజరాజవర్మ ఒక అపవాదముగా నిలిచిపోయాడు. ఇట్టి వాతావరణంలో ఈ మేధావు లిద్దరూ సన్నిహిత మిత్రులైనారు తన వైఖరినీ, తన ఆశయాలనూ సంపూర్తిగా అర్థం చేసుకున్న సాహిత్యవేత్త కేరళలో మరొకరు ఆశాన్‌కు తటస్థ పడలేదు. అసలు అట్టి వారు మరెవ్వరైనా వున్నారా? కనుక 1918 లో రాజరాజవర్మ కాలధర్మం చెందగా ఆశాన్ తనకు కలిగిన నష్టాన్ని, సంతాపాన్ని భరించ లేకపోయాడు.

'ప్రరోదనము' కావ్యానికి వ్రాసిన పెద్ద పీఠికలో ఆశాన్ తన ఈ కావ్య వస్తువుపట్ల తనకు గల ప్రత్యేక అనుబంధమును మనకు కొంత వరకు తెలియజేశాడు. 'నేను ఉత్తర తిరువాన్కూరులో పర్యటన చేస్తూవుండగా గుండెలను బ్రద్దలుచేసే ఆయన మరణవార్త విన్నాను. ఎదురు చూడని, భరింపరాని ఆ దుర్వార్త అశనిపాతంవలె వచ్చింది. నా హృదయం కొయ్య బారిపోయింది. ఆచారం ప్రకారం అనేక వార్తాపత్రికలు, వార మాస పత్రికలు కొన్ని పద్యాలు వ్రాసి ఇవ్వవలసిందిగా నన్ను కోరాయి. అది మరీ బాధాకరమైన పరిస్థితిగా

తోచింది. ఒక్కమాట వ్రాయలేక పోయాను. కాలక్రమేణా గుండెలపై పడ్డ భారం కొంత తగ్గి ఉపశమనం కలిగింది. ఆ మహాత్ముని గూర్చిన స్మృతులు, ఆలోచనలు నా మనస్సు చుట్టూ ముసిరి నన్ను ఉక్కిరి బిక్కిరి చేశాయి. చివరకు ఒక స్మృతికావ్యం వ్రాసి నా గుండెలపైని బరువును దించివేసుకోవాలని నిర్ణయించాను.

రాజరాజవర్మ మృతదేహం శ్మశానంలో చితిపై కాలిపోతూ వుండగా తిరువాన్కూరు, కొచ్చిన్, మలబారు ప్రాంతాలు* దేవతలై దిగివస్తున్నట్లుగా కవి చిత్రించాడు. ఆయన ఆత్మ స్వర్గం చేరుకోగా భాస, కాళిదాసాది మహా కవులు స్వాగతం చెబుతారు. కైరళి (అనగా కేరళభాష)ని ఊరడించుటకు సరస్వతి కూడా ప్రత్యక్ష మవుతుంది.

అప్పుడు ఇదంతా కేవలం తన ఊహాగానమని కవి తెలుసుకుంటాడు. ఆ మీదట జీవన్మరణములను గూర్చి తలపోసి, తాను ఆధారపడదగిన ఒకే ఒక తీర్మానానికి వస్తాడు. అది మరేమీ కాదు. ప్రేమ. ఆశాన్ ఇతర కావ్యములవలె కాక, ఈ కావ్యంలో అనేక ప్రాఙ్నవ్య కవితా పద్ధతికి చెందిన (neo-classic) శబ్దాలంకారాలున్నాయి. అయితే నిజమైన ఆత్మపరవిభాగాల రచనకు వచ్చేసరికి ఆశాన్ మనోభావము, ఆవేగము అద్భుతమైన సమ్మేళనం చెంది మహోన్నతమైన ఆత్మాశ్రయ కవిత్వం ఆవిర్భవించింది. మలయాళ సాహిత్యంలో వున్న స్మృతిగీతములలో భావము, ఆవేశము ఇంత చక్కగా మేళవింపు చెందిన కావ్యం మరొకటి లేదు.

ఈ దిగువ కొన్ని ముఖ్య పద్యపంక్తులు ఉదహరిస్తాను :

వాగ్దేవికి అంకితమైపోయాడు మహానుభావుడు
అలసట యన్నదే ఎరుగని మేధావి
ఆయన బంగారుపాళీ ఎండిపోలేదు.
ఎన్నో కావ్యాలు భూషణములు అమర్చాడు
సిద్ధాంతంలో, ఆచరణలో
ఎన్నో అద్భుతాలు సాధించాడు.

---

* మలయాళభాష మాట్లాడబడే కేరళ అనే ప్రాంతం దేశీయ సంస్థానాలైన తిరువాన్కూరు, కొచ్చిన్‌లు, మదరాసు ప్రెసిడెన్సీలోని మలబారుజిల్లా విలీనం కాగా ఏర్పడిన కొత్తరాష్ట్రం. రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణకు పూర్వం ఈ మూడు ప్రాంతాలు వేర్వేరు పరిపాలనల క్రింద వుండేవి.

నీ ప్రతికక్షులు సిగ్గుతో తలలు వంచుకున్నారు
కైరళి మాత సంతసించి మందహాసం చేసింది
తన విమోచనానికి పొంగిపోయింది.

2. ఓ సూర్యకిరణములారా చెప్పండి
సృష్టి ఆరంభమైనదాదిగా
మరణాన్ని తలచుకొని భయపడుతూన్న
మనస్సునుండి వెలువడిన
తీక్ష్ణమైన జ్వాలలుకారా మీరు?
ఓ వాయువు లారా
ప్రకృతి రాలిపోసిన నిట్టూర్పులుకారా మీరు
ఓ వర్షధారలారా
గతించిన కాలంలో ఎన్నడో బంధితులై
లోపలే వుండిపోయిన అశ్రువులుకారా మీరు?

మరణమంటే ఏమిటి? అది కేవలం జీవితం తాత్కాలికంగా స్తబ్ధం కావడమా? లేక ఒక జీవితంనుండి మరొక జీవితానికి పరిణామమా? లేదా సర్వం పూర్తిగా అంతం కావడమా? స్వర్గం, నరకం, పునర్జన్మ, ఆత్మ—వీటిలో అసలు యధార్థం ఏమైనా వుందా? జీవితానికి అర్థం ఏమిటి? కంటితో చూడని గూఢ రహస్యాన్ని మనం ఎంత దూరం శోధించ గలం? కవి మనలను ఈ దృశ్యమైన విచారణ పరంపరకు గొనిపోతాడు.

మృత్యువు జీవితంలోని ఆకర్షణను
ఇనుమడింప జేస్తుంది
రాత్రి లేకపోతే పగలు చిత్రహింసగా
తయారవుతుంది.
కమలముల సువాసనతో పగలు
ఆనందనృత్యం చేయాలి.
రాత్రి తన కురులను
మల్లెలవంటి తెల్లని కలువలతో
అలంకరించుకొని
సుఖ నిద్ర చెందాలి.

ఆశాన్ చాలా వరకు ఆంగ్లభాషలోని ఎలిజీలను (స్మృతికావ్యములను) ఆధారం చేసుకొని ఆ రీతిలోనే రచన చేశాడు. ముఖ్యంగా విఖ్యాతాంగ్ల కవి షెల్లీ రచించిన 'అడోనె' కావ్యాన్ని ఆయన ఒరవడిగా పెట్టుకున్నాడు. అయితే 'ప్రరోదనం' యే ఆంగ్లకావ్యానికీ అనుకరణ కాదు. ఉత్తమమైన స్మృతికావ్యమునకు ఎంతో ఆవశ్యకమైన ఆవేశగుణమును త్యజించకుండానే ఈ కావ్యంలో గాంభీర్యమునూ, తాత్త్వికమైన గాఢత్వమునూ కవి సాధించ గలిగాడు.

## సీత

ఆశాన్ కావ్యములు మలయాళ సాహిత్య విమర్శకులకు చేతినిండా పని కల్పించాయి. ఆయన రచించిన కావ్యాలన్నింటిలో 'సీత' విస్తృతమైన తీవ్ర విమర్శలకు గురి అయింది. ఈ కావ్యం పూర్తి పేరు 'చింతావిష్టయాయ సీత.' ఇందులో సీతయొక్క సుదీర్ఘ మనఃపరిభ్రమణంద్వారా రామాయణంలో పట్టు గల కరుణ రసప్రపూరితమైన ఘట్టాలను కవి పాఠకుల ముందుంచాడు. ఇది 1919 లో ప్రచురితమైనప్పటికీ దీని రచన 'లీల' పూర్తి అయిన వెంటనే ఆరంభింప బడింది. అయితే ఐదేండ్ల కాలంలో ఆశాన్ వ్రాయగలిగింది 80 పద్యాలు మాత్రమే: తక్కిన 112 పద్యాలను కొద్ది రోజులలోనే వ్రాయగలిగాడు. ఆ మధ్యకాలంలో జరిగిన సంఘటన లేమిటంటే — ఒకటి ఆశాన్ వివాహం, రెండవది యోగం పదవీ బాధ్యతలను వదులుకోవడం. దీనిని బట్టి యోగం ప్రధాన కార్యదర్శిగా ఆశాన్ ఎంతగా నెమ్మదిలేక చింతాభరితమైన అసౌఖ్యకరజీవితం గడిపాడో మనకు బోధపడుతుంది.

ఈ కావ్య రచనకు ఆశాన్‌కు ప్రేరణ కలిగించినది రవి వర్మ చిత్రించిన సీత వర్ణ చిత్రమని చెబుతారు. ఆశాన్ ఆ వర్ణ చిత్రం పటము ముందు కూర్చొని తదేక దీక్షతో అవలోకిస్తూ ఆలోచనానిమగ్నుడై వుండే వాడట. అనేక భాషలలో అనేక కవులకు రామాయణం కావ్య వస్తువులను, కవితా సామగ్రిని సంతరించి పెట్టింది. భారతీయ భాషలన్నింటిలో సీతనుగూర్చి ఎన్నో కావ్యాలు, విమర్శక వ్యాసములు వ్రాయబడినవి. కాని ఆశాన్ సృష్టించిన సీత ఆతని 'రాలినపూవు' వలెనే అద్వితీయమైనది. చాలా మంది ఈ కావ్యమును ఆతని "మహోత్తమ రచన"గా భావిస్తారు. ప్రాచీనమైన ఈ మహా కావ్యగాథను ఆశాన్ ఏమి చేశాడు? ఇది పరిశీలించవలసిన ముఖ్యాంశం.

వాల్మీకి రామాయణము మానవ దృక్పథంతో వ్రాయబడింది. ఆశాన్ త సృజనాత్మక ప్రతిభను నారియైన సీత చుట్టూ ప్రసరింప జేశాడు పైగా ఆమె తన జీవితంలో సున్నితమూ, వ్యాకుల పూరితము అయిన ఘట్టాలను ఎదుర్కొనే సందర్భంలో ఆమెను మన ముందు వుంచాడు. ఆమె భౌతిక ప్రపంచమునుండి అంతిమంగా విష్క్రమించడానికి క్రితం రోజు జరిగిన విశేషమది. రాముడు విడిచి పెట్టిన సీత వాల్మీకి మహర్షి ఆశ్రమంలో 12 ఏండ్లు వుంది. వాల్మీకి మహర్షి సీతకు కవలపిల్లలైన లవ కుశులతో రాముని ఆస్థానానికి వెళ్ళాడు. అక్కడ ఆ బాలకు లిద్దరూ రాజైన రాముని ముందు క్రొత్తగా రచింపబడ్డ రామాయణ కావ్యమును గానం చేస్తారు. దీని వల్ల రాముని మనస్సు కకావికలమై, పశ్చాత్తాప భావంతో తాను చేసిన పొరపాటును సవరించుకొన ప్రయత్నిస్తాడు. మళ్ళీ నూత్న మానసిక సమస్యలు తన నెదుర్కొన బోతున్నాయని సీత గ్రహిస్తుంది. ఆ సాయంకాలం ఆశ్రమానికి సమీపంలో అడవిలోవున్న ఒక ఉద్యానానికి పోయి, ఆ ఏకాం తంలో తన పూర్వ జీవితమునూ, ఆ జీవితంలోని అనుభవాలనూ ఒక్కమారు నెమరు వేసుకుంటుంది. సున్నితమూ, శాంతగంభీరమూ అయిన స్వగతమునకు ఇంతకన్న అనువైన ఘట్టమేమి వుంటుంది? ఆశాన్ ఈ ఘట్టమును తీసుకొని మహోదాత్తమైన రచన గావించాడు :

కథా విషయమును ప్రవేశపెట్టుతూ కవి పద్యారంభ పంక్తులలో అద్భుత మైన క్లుప్తతను ప్రదర్శించాడు :

ఒక అపరాహ్ణం
ఆమె కుమారు లిద్దరూ
మహర్షివెంట అయోధ్యకు వెళ్ళారు
చింతా విష్టయై వున్న సీత
ఆశ్రమ సమీపాన
ఉద్యానవనంలో కూర్చుంది.

ఇక్కడ ఒక విషయం ముఖ్యంగా గమనింప దగింది. కవి ఆమె ఆశ్ర మంలో వున్నట్టు చెప్పలేదు. ఉద్యానవనంలో వున్నదని చెప్పాడు. ఎవరూ తన ఏకాగ్రతకు భంగం కలిగించలేని తావులో వున్నది. సమయం సాయంకాలము. కాని సూర్యుడు ఎప్పుడు అస్తమిస్తాడో, చంద్రోదయం ఎప్పుడవుతుందో ఆమె గ్రహించే స్థితిలో లేదు. పెద్దపెద్ద మిట్టపల్లాలతో కూడిన తన గత జీవితాన్ని గూర్చి తలపోస్తూ అదే ధ్యానలో వుంది.

తరువాత కొన్ని పద్యాలలో కవి ఆ ప్రదేశ రామణీయకతను వర్ణించాడు. మఖమలు పట్టువంటి మృదువైన పచ్చికబయలు; ఆమె కూర్చున్నది పుష్పభరితమైన శిరీష వృక్షము క్రింద. కలువల మధ్యగా ప్రవహించే తమసానది, ఇంకా ఏమేమో ఆ పరిసరాలలో వున్నాయి.

16 వ పద్యంలో సీత తన దుఃఖ కారణమును వెళ్ళబోసుకుంటుంది :

మృగములు కూడా బాధననుభవిస్తాయి
కాని వాటిబాధ బహుకాలం వుండదు
దెబ్బతిన్న గర్వంతో ఉత్పన్నమైన
తీరని బాధకు గురిఅయ్యేది
మానవులు మాత్రమే!

అసలు స్వగతం 12వ పద్యంతో మొదలవుతుంది. 'సీత' కావ్యాన్ని గూర్చి సుకుమార్ అజికోడ్* గ్రహణ పారీణతతో విశ్లేషణతో వ్రాసిన విమర్శక వ్యాసంలో ఆ కావ్యాన్ని నాలుగుదశలుగా విభజించాడు. 1. పర్యాలోకన దశ, 2. సందిగ్ధ దశ, 3. దూషణ దశ, 4. కల్పన దశ. 12 నుండి 44 వరకు గల పద్యములు పర్యాలోకన దశకు చెందినవి. ఈ దశ సహజంగానే సందిగ్ధ దశకు దారితీస్తుంది. 45 నుంచి 54 వరకు గల పద్యములు సందిగ్ధ దశకు సంబంధించినవి. దాని తీవ్రత హెచ్చి దూషణ దశ రూపం గైకొంటుంది. దూషణ దశ పద్యములు 80 నుండి 183 వరకు. అయితే చివరకు ఆమె శాంతించి పరిస్థితిని అర్థం చేసుకునే స్థితికి వస్తుంది.

ఆశాన్ 'సీత' కావ్యమును కొందరు అతి నిశితంగా విమర్శించారు. సీత నోటివెంట అనుచితమైన మాటలను రానిచ్చి, సీత మనస్సులో అనౌచిత్య భరితమైన ఆలోచనలను రేకెత్తించి ఆశాన్ రాముని పాత్రకు మచ్చతెచ్చాడని వారి అభిప్రాయం. ఆశాన్ రాముడిని సాక్షి నిల్చునే బోనులో నిలబెట్టిన మాట నిజమే. ఆయనను కఠినమైన క్రాస్ పరీక్షకు గురిచేసిన మాట కూడా నిజమే అయితే వాల్మీకి మహా కావ్యంలో రూపొందింప బడిన రాముని పాత్రతో పోల్చి చూచినప్పుడు ఆశాన్ చిత్రించిన రాముడు అవాంఛనీయమైన కవి చిత్రణవల్ల హీనస్థితికి దిగజారాడని అనడం గ్రహణశక్తితో చేసిన విమర్శ కాదు. రాముడు అసలు లోపములే లేని దేవుడు కాడు. ఆయన అనేక సుగుణములు, కొన్ని దౌర్బ

---

* అజికోడ్ సుకుమార్—ఆశాన్ తే సీతా కావ్యం.

ల్యములు కూడా కలసహజ మానవుడు. అలా చూస్తే పై విమర్శ వాల్మీకికి కూడా వర్తిస్తుంది. నిజం చెప్పాలంటే పాత్ర చిత్రణలో ఈ సహజ స్వభావమే ఆశాన్ కావ్యమును మహా కావ్యంగా చేసింది.

ఆశాన్ సృష్టించిన సీత పతివ్రత, గుణవతి, నీతిమంతురాలు, దొడ్డబుద్ధి గల ఉత్తమజాతి స్త్రీ. వివేచనా శక్తి గలది. అయితే ఆమె కూడా చీము, నెత్తురు గల మనిషి. వాల్మీకి ఆమెను పదేండ్లపాటు తెర వెనుక వుంచాడు. కాని ఆశాన్ ఆమెను రంగస్థలం మధ్యకు తీసుకు రావడమేగాక, ఆమె మనస్సులో వున్న మాటను పైకి అనిపిస్తాడు. అయితే ఆమె మరొక వ్యక్తి ఎవరితోనూ మాట్లాడడం లేదు గనుక ఎట్టి అరమరలు లేకుండా తన మనస్సులోని ఆలోచనలను వ్యక్తీకరించ గలుగుతున్నది. తనలో తానే అనుకుంటున్నది. ఇంతకు ముందెన్నడూ మనం వినడానికి వీలు కాని సీత అభిప్రాయాలను మనోభావములను ఈ కావ్యంలో మనం వినగలుగుతున్నాము. మరి సీత అభిప్రాయమంటే ఒక స్త్రీ తనదైన దృష్టితో చెప్పినమాటలు కదా।

ఈ కావ్యమును గూర్చి చేయబడిన మరొక విమర్శ ఏమిటంటే—సీత పాత్ర కొంత అసంగతంగా, పరస్పర విరుద్ధంగా వున్నదని. సీత మనస్థితి ఎల్లప్పుడూ ఒకే మాదిరిగా ఎలా వుంటుంది? మనః ప్రవృత్తి సందర్భాన్నిబట్టి మారడం సహజం. అటువంటప్పుడు పర్యాలోకనము ఒక దశలో ఖండనవరకూ రావచ్చు. అలా రావడం సహజం. సూక్ష్మంగా పరిశీలిస్తే బాహ్యంగా కన్పించే అసంబద్ధత అనేది ఆలోచనా క్రమములో వచ్చే అస్థిరత, హెచ్చు తగ్గులు మాత్రమే. అటువంటి చాంచల్యము ఆ సందర్భానికి పూర్తిగా వాస్తవిక మైనది. మరొక గమనార్హమైన విశేష మేమిటంటే—ఇటువంటి సందేహా లన్నిటికీ కావ్యంలోనే సమాధానాలు వెదజల్లినట్లుగా అచ్చటచ్చటా పొందు పరుపబడి వున్నవి. సీత వాల్మీకి ఆశ్రమంలో పదేండ్లు సన్యాసినిగా గడపినది. కాని—

తన శారీరక రూపమును
విడుచునంతవరకూ
ఆ ప్రాణి తన సహజ ప్రవృత్తిని
నిలబెట్టుకున్నది.

రాముడు మానవుడు. పురుషుడు. భర్త. దేశాన్ని పాలించేరాజు. అలాగే సీతస్త్రీ. భార్య. దేశంలోని పౌరులలో ఆమె కూడా ఒక వ్యక్తి. ఆశాన్ సృష్టించిన

సీత ఈ పాత్ర లన్నింటిలో తన పాత్రను నిర్వహించే సామర్థ్యం కలది. అంతే కాదు, రాముణ్ణి ఆతని వివిధ పాత్రలలో చూచి అర్థం చేసుకోగల వివేకం ఆమె కున్నది. కాబట్టి ఆమె మనః ప్రవృత్తిలో మార్పు రావడానికి తగు కారణాలు, అవకాశమూ వున్నాయి. సీత మనస్సుపై మారుతూ పోయే వివిధ ప్రవృత్తులూ, ఆవేశాలూ ఆడే ఆట, చేసే లీలా విలాసాలు గమనిస్తూవుంటే అదొక చోద్యంగా వుంటుంది ఈ మనః ప్రవృత్తుల చిత్రవర్ణపు పనితనాన్ని ఒకింత వీక్షిద్దాము.

రామునిపై ఆమెకు గల అనురాగము, మమత కోమలభావాలు పూర్తిగా అదృశ్యమై పోలేదు. అయితే అవి ఆమె జీవితంలో ప్రతిధ్వనిగా మాత్రమే మిగిలి వున్నాయి.

ఆమె ప్రేమానురాగాలు దొడ్డవి.
క్షణం ఎడబాసినా
ఆమె హృదయం గాయపడుతుంది.
అటువంటి ప్రేమ సూత్రం
కొండచిలువలూ పడుకొని వుంది.
తల అయినా ఎత్తలేని
నిద్రలో వుంది.

తాను ఉన్మాదినియైపోవాలని ఎంతగానో కోరుకున్నప్పటి క్షణాలు సీతకు జ్ఞాపకమున్నాయి. అవి తనను అగ్నిపరీక్షకు గురిచేసిన ఘడియలు. ఆమె లక్ష్మణునికి కృతజ్ఞురాలు. అతడు ఒక వంక తనపట్ల ప్రీతితోను, మరొక వంక దేశానికి రాజూ తనకు అన్నగారూ అయిన రామునిపట్ల రాజభక్తి విధేయ తల తోను నలిగిపోయాడు.

రావణుడు తనను అపహరించిన సందర్భంలో తాను అతనిపై ప్రయోగించిన పరుషవాక్కులకు, వేసిన నిందలకు క్షమించవలసిందిగా వేడుకున్నది :

సోదరునివంటి మరదీ,
దయజూపి నన్ను క్షమించు
అనాలోచితంగా మతిలేక
నిన్ను పరుషోక్తులతో
బాధించాను.
ఒక్కొక్కప్పుడు

కళ్ళెములేని మనస్సు
క్రమంతప్పి సంచరించని
దుర్మార్గాలు లేకుండునా ?

అప్పుడు సీత తనకు ఆశ్రయమిచ్చి తండ్రివలె చూచిన వాల్మీకి మహర్షి ఆశ్రమంలోని జీవితమునూ జ్ఞప్తికి తెచ్చుకుంటుంది. ఈ జీవితమును కవి నగర జీవితంతో పోల్చి చూస్తాడు. పవిత్రమైన వివాహబంధం పతనావస్థకు దిగజారి పోవడాన్ని కొంత తలపోసి, వివిధ దృక్కోణాలనుంచి రాముని మనస్సును సీత పరీక్షిస్తుంది.

అపకీర్తి వస్తుందన్న భయంతో
తనపేరుకు వచ్చిన కళంకాన్ని
కడిగివేయాలన్న ఆతురతతో
ఈ అవమానకరమైన కృత్యముచేసి
వచ్చిన అపవాదును
రాజా రూఢి పరచలేదా ?

గతంలో తాము ఇరువురు కలసివుండి గడపిన ఆనందకరమైన జీవితం సీతకు గుర్తున్నది. దానిని మరువలేదామె. అయినా నిష్కపటముగా ఖండితంగా రాముని ఈ ప్రశ్న అడుగుట కామె వెనుకాడలేదు :

రాజ్యమును పాలించడానికి
ఆయనకు వీరులు శూరులు ఆయన తమ్ములులేరా ?
పెళ్ళాడిన భార్యతో కాపురం చేయడానికి
అడవిలో ఆయనకు తగినచోటే లేదా ?

అయితే క్రమేణా ఆమె రాముని పరిస్థితిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తుంది. యజ్ఞశాలలో రాముడు స్వర్ణ సీతను (బంగారముతో చేయబడిన సీత విగ్రహమును) ప్రతిష్ఠించాడన్న సంగతి ఆమెకు తెలుసు.

ధర్మమార్గం, న్యాయరీతీ
క్రూరమైనవి, బాధాకరమైనవి.
రాజులు ధర్మానికి బద్ధులు కదా !
నా భర్త నన్ను బహిష్కరించవలసి వచ్చింది

నా విగ్రహమునకు
ఆరాధకుడు కావలసి వచ్చింది.

ఆశాన్ సీత కేవలం దుఃఖపెట్టబడిన స్త్రీమాత్రమే కాదు. భర్తను కోపంతో విమర్శించు ఉద్రిక్తురాలు మాత్రమే కాదు. భర్తపట్ల గాఢమైన సానుభూతి, ఆయనను అర్థం చేసుకో గల సామర్థ్యము కూడా కలది. ఆత్మాభిరుచితో కాక, వాస్తవిక దృష్టితో ఒక విషయాన్నిగూర్చి గుణదోష వివేచన చేయగల అసాధారణ ప్రతిభగల ప్రమద. హెచ్చు తగ్గులకు తావివ్వక సమదర్శనంతో న్యాయ నిర్ణయం చేయగల విదుషీమణి ఆశాన్ చిత్రించిన సీత.

ప్రభూ, నీ అర్ధాంగిని మన్నించు,
ఆత్మగౌరవమనే ప్రలోభంతో
కోపోద్రిక్త స్వభావాన
నీకు లోపాలు, దోషాలు ఆపాదించాను.

తుద కామె ప్రకృతికీ, ప్రకృతిలోని సర్వప్రాణులకూ కడపటి వీడ్కోలు చెబుతూ—

మనోహరములైన వనములారా
ఝుంకారము చేస్తూవున్న తుమ్మెదలను
చుట్టూ తిప్పుకునే పుష్పములారా.
సంకోచమనేదిలేక
మీవల్ల ఆనందానుభవం పొందిన
ఈ అదృష్టవతి
ఇక మీకు వీడ్కోలు చెబుతున్నది.

అంతిమంగా తన భర్తకు——తన ప్రభువుకు కడపటి వీడ్కోలు చెబుతూ ఆమె వెల్లడించిన భావాలు రాతివంటి హృదయాలను పైతము కరగిస్తాయి:

ప్రియా. రాఘవా, నీకిదే వీడ్కోలు
నీ బాహువుల ఆలంబనాన్ని వీడి
తుదకు భయరహితనై
స్వేచ్ఛా జీవినై
ఉత్తుంగ స్వర్గలోకాలకు
ఎగసిపోతున్నాను.

ఒకప్పు డామెలో రేకెత్తిన విరోధ భావము, ద్వేషము, కోపము పూర్తిగా అదృశ్యమై పొయ్యాయి. పరిస్థితి సమస్తమును ఔదార్యంతో, విశాల దృష్టితో పునర్విచారణ చేయగల సమర్థురా లవుతుంది సీత.

ఈ కావ్యంలో ప్రతి పద్యం ఉదాహరణంగా పేర్కొనదగిన విశిష్టత కలది. కవి ప్రతి పదమును బాగా ఆలోచించి జాగ్రత్తగా వాడినాడు. హృదయాలను కదలించి వేసే ఈ కావ్యంలో ఆశాన్ ఒక జీవితమును కరగించి మూసలో పోశాడు. "ప్రరోదనము" కన్న సులభమూ సామాన్యమూ అయిన కావ్యమిది పదాడంబరము లేనిదైనా, గాఢత్వము లేనిది కాదు. మానవుని మనస్సు కన్న సంక్లిష్టమైనది ఈ లోకంలో మరొకటి లేదు అజాగృత స్థితి, వ్యక్తావ్యక్త స్థితి, చైతన్య స్థితివంటి మానవుని మనస్సులోని వేర్వేరు పొరలను ఆశాన్ అసాధారణమైన నేర్పుతో, నైపుణ్యంతో స్పృశించి పరితలకొత్త దివ్యానుభూతిని కలుగ జేశాడు. మలయాళ సాహిత్యంలో ఇటువంటి సృజన అపురూపము, అనన్యము. "చింతావిష్టయాయ సీత" ఆదిలో, అంతములో కొన్ని పద్యపంక్తులు మినహా తక్కిన కావ్యం ఒక సుదీర్ఘమైన స్వగతము. వైయక్తికభావ తీక్ష్ణత, ఆత్మాశ్రయ చిత్తప్రవృత్తినిబట్టి పరిశీలిస్తే ఈ కావ్యమును మహోత్కృష్ట వైశిష్ట్యం కల భావగీతముగా పరిగణించవచ్చు. ఇతివృత్తము అమరమైన ఒక మహా కావ్యం నుండి గ్రహింపబడి నప్పటికీ, దానికి కొత్త వన్నె చిన్నెలను సమకూర్చి, అంతర్ముఖత్వమును ఆపాదింప జేయబడిన విశేషమైన భావగీతము "సీత".

# 10. సాంఘిక కావ్యములు

సంస్కృత కావ్యలక్షణ శాస్త్రము ననుసరించి, కావ్యాలంకార సూత్రముల ననుసరించి మహాకావ్యమును వ్రాసిన కవికే సాధారణంగా మహాకవి అనే బిరుదు ఇస్తారు. మలయాళ భాషలో చాలా మంది చిల్లరకవులు మహాకవి అనే పరిగణన పొందడంకోసం దీర్ఘములైన మహా కావ్యములను రచించడంలో నిమగ్నులై వుండగా, కుమారన్ ఆశాన్ ఆ గొడవ అసలు పట్టించుకోనే లేదు. ఆయనకు బిరుదములయందు ఆసక్తి లేదు. బహూమతులు, యోగ్యతా పత్రములు పొందాలన్న ఉబలాటం లేదు. అలాంటివి కొన్ని నిర్ణీత నియమములు, షరతుల ననుసరించి ఇవ్వబడతాయి ఆధునిక యుగమునకు మహా కావ్యనదృశ

మైన క్లిష్టకవితారచన అనువైనదని ఆశాన్ భావించలేదు. కనుక ఆయన బుద్ధి పూర్వకంగానే మహాకావ్యరచనను చేపట్టలేదు. అసలు అవసరమంచి కావాలనే తప్పుకున్నాడు. అయినప్పటికీ 'మహాకవి' అనే బిరుదు ఆయనకు సహజంగానే అప్రయత్నంగానే వచ్చింది. అంతే గాక 1922 జనవరిలో వేల్స్ యువరాజు మద్రాసు సందర్శించినప్పుడు ఆశాన్‌కు మరొక పరిగణన లభించింది. ఆశాన్ 'విశిష్టుడైన భారతీయ కవి' అని శ్లాఘించి ఆ రాకుమారుడు ఆయనకు పట్టుశాలువాకప్పి, బంగారు కంకణము తొడిగి గౌరవించాడు. ఖరీదైన ఆ శాలువా కప్పుకొని వున్నప్పుడు తీయబడిన ఆశాన్ ఛాయా చిత్రానికి విస్తృత ప్రచారం, మంచిపేరూ వచ్చాయి. మలయాళ కావ్యప్రియుల ఇండ్లలో ఈ పటమును మనం చూడగలం.

ఇక మనం కవిగా ఆశాన్ జీవితంలో చివరిదశకు వస్తున్నాము. ఈ అధ్యాయంలో 'దురవస్థ' 'చండాలభిక్షుకి' అనే మరి రెండు గ్రంథముల పరిశీలనం చేద్దాము. ఇవి రెండూ సాంఘిక కావ్యములు. అనగా సంఘ జీవితమును పట్టించుకున్న కావ్యములు. వేరొక కవి ఎవ్వరూ ఆ కావ్యాలను అంత శక్తిమంతంగా అంత ఆత్మవిశ్వాసంతో వ్రాయ లేదు. హైందవ సమాజంలోని వర్ణవ్యవస్థ, ఆ వ్యవస్థ మూలంగా కొన్ని కులాలవారు అవమానాలకు గురికావడం—ఇవన్నీ చూస్తూ వున్న కవి మనస్సులో చాలాకాలంగా అలజడి రేకెత్తి ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు. ఎస్. ఎన్. డి పి. యోగం ప్రధాన కార్యదర్శిగా దళితప్రజల తరపున నిలబడి, వారి అభ్యున్నతికై పాటుపడేందుకు ఆశాన్‌కు చాలా అవకాశాలు లభించాయి. కాని సంఘంలోవున్న వర్ణవ్యవస్థ అనే కళంకమును వెలుగులోకి తెచ్చి దాని పైకి ప్రజల దృష్టిని ప్రసరింప జేసేందుకు ఆశాన్ అంతవరకూ తన కవిత్వాన్ని ఉపయోగించ లేదు. 1923లో ఈ రెండు కావ్యాలను రచించడంతో ఆ కొరత తీరినట్లయింది.

## 'దురవస్థ'

ఆశాన్ కావ్యాలలో 'దురవస్థ' అనేకావ్యం పెద్ద రస విశేషమేమీ లేనిది అతి సామాన్యమైనది. కాని ఇది ప్రచురింప బడగానే మలయాళ విమర్శకుల పావురాల గూటిలో పెద్ద కలకలం బయలు దేరింది. వారిని క్రిందుమీదు చేసింది. కారణ మేమంటే—ఆ విమర్శకులలో అధిక సంఖ్యాకులు పెద్ద కులాలకు చెందినవారు. వారు ఈ కావ్య ఇతివృత్త ఔచిత్యమును ప్రశ్నించారు. ఆ కథ కావ్యానికి తగిన వస్తువేనా? అని ఆక్షేపించారు. కవిపై విరుచుకుపడ్డారు. సంక్షిప్తంగా కథ ఇది:—

కథా ప్రదేశం మలబారు ప్రాంతం. మోప్లా తిరుగుబాటు (1921) తర్వాత జరిగిన వృత్తాంతము. హిందూ ముస్లిం కలహములవల్ల అనేక కుటుంబాలు కూకటి వేళ్ళతో సహా పెళ్ళగించ బడ్డాయి. అయిన వారి నందరినీ పోగొట్టుకున్న ఒక నంబూతిరి స్త్రీ-సావిత్రి ప్రాణాలను కాపాడుకోవడానికి పారిపోవలసి వచ్చింది. ఆమె పులయ కులం వాడైన చాతన్ గుడిసెలో ఆశ్రయం పొందింది ఆ పులయ యువకుడు ఆమెకు రక్షణ ఇస్తాడు. ఆమె అక్కడినుంచి వెళ్ళిపోలేని స్థితిలో వుండడంవల్ల వా రిద్దరూ అదే గుడిసెలో నివసిస్తారు. కాలం గడిచే కొద్దీ పరస్పర సానుభూతి ఆసక్తిగా మారి, ఆ పిమ్మట పరస్పర ఆరాధనగా, చనువుగా పరిణమించి చివరకు ఇద్దరూ భార్యా భర్తలు కావడానికి నిర్ణయించుకుంటారు. అగ్రవర్ణమునకు చెందిన నంబూతిరి స్త్రీని, అందరికన్న తక్కువ కులానికి చెందిన పులయ యువకుని వివాహబంధంతో ఏకం చేయడమే కవి చేసిన పని. కులాచారాలు కల్పించిన కృత్రిమత్వాలనుండీ విముక్తులై సావిత్రి, చాతన్ భార్యా భర్త లవుతారు.

'దురవస్థ' వ్రాయడానికి పూర్వం ఆశాన్ తన కావ్యాలను సంస్కృత ఛందస్సులో రచించాడు, కాని ఈ కావ్యాన్ని కొంచెం తక్కువ కఠినత, సౌలభ్య మూకల మలయాళ ఛందస్సులో రచించాడు.

వ్యాకులముతోవున్న సావిత్రి పావురాళ్ళకేసి చూచి కొంత ఆత్మసంతృప్తిని పొందుతుంది. ఊరడిల్లుతుంది:

నేను శోకించడం దేనికి?
ఏ చీకూ చింతా లేకుండా
పావురాళ్ళు ఎగిరిపోతున్నవి
అవి ఆలోచించి బుర్ర పగులగొట్టుకోవు.
హృదయాలను గాయపరచుకోవు
ఏడ్చి ఏడ్చి కనురెప్పలను కందజేసుకోవు
కులం కారణంగా వ్యసనం చెందవు
కులాల తారతమ్యాలను
అవి చూడలేదు, వాటికి తెలియదు.

ఈ కావ్యంలో ఉపదేశ ప్రాముఖ్య మివ్వబడ్డ పద్యపంక్తు లెన్నో వున్నాయి. హిందూ శాస్త్రముల అనుయాయులను సంబోధిస్తూ కవి వారిని ఇలా హెచ్చరించాడు :

మీకై మీరే మీ శాస్త్రాలను మార్చండి
లేదా, శాస్త్రాలు మిమ్మల్నే మారుస్తాయి.

ఆశాన్‌గారి ఇతర కావ్యాలవలె కాక ఈ కావ్యం ఆదరాబాదరాగా వ్రాసినట్టు కనిపిస్తుంది. దీని సాహిత్యగుణం విషయంలో ఆయనకే సందేహమున్నట్లు కావ్యానికి ఆయన వ్రాసిన మున్నుడివల్ల తెలుస్తుంది. వర్ణవ్యవస్థలో కల అన్యాయ మును, అమానుషత్వమును గూర్చి సాహితీపరులను రెచ్చగొట్టడమే ఈ కావ్యం వల్ల కవి ఉద్దేశించిన ముఖ్య ప్రయోజనం. అది చక్కగా నెరవేరింది. కవి అంటాడు :"నా ఇతర కావ్యాలతో పోల్చి చూచినప్పుడు'దురవస్థ'లో పరిపాటియైన కావ్యలక్షణములు లేవు. పైగా ఇది సాంఘిక పునర్నిర్మాణమనే అతి వివాదాస్పద మైన విషయం కావ్యవస్తువుగా కలది." దీనిని గూర్చి ఉగ్రమైన తర్జన భర్జనలు చెలరేగ వచ్చునని కూడా ఆయన ఆశించాడు. తన ఈ కృషి ఫలిస్తుంచా అన్న సందేహం కూడా వెలిబుచ్చాడు, ఆ మున్నుడిలోనే. ఏమైనప్పటికీ కావ్యాదర్శం శ్లాఘ్యమైనది కాబట్టీ, ఉన్నత లక్ష్యాల ప్రేరణతో వ్రాసినది కాబట్టీ తన కృషి వ్యర్థంకాదని సంతృప్తి చెందాడు.

కథ ఎత్తుగడ కొంత బలహీనమైనదిగా తోస్తుంది. ఇందులోని నాయిక సావిత్రి తనకు అలవికాని పరిస్థితులవల్ల తక్కువకులం వాడైన పురుషునితో పరి చయం కలిగి చివరకు అది వారి వివాహబంధంగా పరిణమిస్తుంది. కావ్యరచనలో సాధారణంగా ఆశాన్ చూపే ప్రజ్ఞ, భాషపై అధికారము, ప్రభుత ఇందులో కాన రావు. అచ్చటచ్చటా కొన్ని మంచివర్ణన లున్నప్పటికీ కవి వాగ్బాహుళ్యం వైపు మొగ్గిన వాడిలా కనిపిస్తాడు, కావ్యంలో ఉపన్యాస ధోరణి స్పష్టంగా గోచరిస్తుంది. ప్రేమికు లిద్దరిమధ్య సహవర్తనం పొసగుతుందా అన్న ప్రశ్నను కవి ఉపేక్షించా డని కొందరు విమర్శకులన్నారు. ఈ లోపాలన్నీ వున్నప్పటికీ 'దురవస్థ' కావ్యం ధరించిన పాత్ర ముఖ్యమైనది. ఇది సాంఘిక విప్లవానికి బీజములు వేసింది, కులాల తరతమ భేదాలు అమానుష మైనవి, కృత్రిమ మైనవి అన్న భావనను ఇది వ్యాప్తిలోకి తెచ్చింది.

'చండాల భిక్షుకి'

ఈ కావ్యం వాస్తవానికి 'దురవస్థ'కు ఉత్తర భాగమని చెప్పాలి. లక్ష్యము కూడా అదే—కులభేదాలను నిర్మూలించడం. కాని ఇక్కడ త్రాసు మారింది. ఇందులో స్త్రీ హీనకులానికి చెందినది. ఈ కావ్య నిర్మాణంలో కూడా కొన్ని తేడా లున్నవి. మనం కథను పరిచయం చేసుకున్న తరువాతే కావ్యరచనలో కవి వ్యూహం పన్నడంలో అవలంబించిన మార్పును పరిశీలించ గలము.

కథ చట్రం బౌద్ధవాఙ్మయంనుంచి స్వీకరింప బడింది. బుద్ధుని శిష్యుడైన ఆనందుడు ఎండలో కొంతసేపు నడచి మిట్ట మధ్యాహ్న వేళకు పెద్ద మర్రిచెట్టుకింద క్రిందికి వస్తాడు. సరిగ్గా అదే సమయానికి ఒక చండాల కన్య (మాతంగి) అక్కడవున్న బావినుంచి నీరు తోడుకుపోవడానికి వస్తుంది. దప్పిక గొనివున్న ఆనందుడు త్రాగే నీరివ్వమని ఆ కన్యను అడుగుతాడు. తాను పంచమ వర్ణమునకు చెందినది కాబట్టి అతను తాను ఇచ్చే నీరు త్రాగవచ్చా అని ఆమె సంకోచిస్తుంది. అయితే అది నిర్ణయించుకోవలసిన వాడు భిక్షువు. అతను నీరివ్వమని అడుగు తున్నాడు కాబట్టి ఆమె ఇవ్వాలి. అతను తృప్తిగానీరు త్రాగుతాడు. భిక్షువుతో తన ఈ సంబంధం తాను ఆశించ నటువంటిది. ఆమె మనస్సులో ఏదో కొత్త అను భూతి మొలకెత్తుతుంది. ఆ ఆగంతకుడు ఆమె హృదయాన్ని ఆకట్టుకున్నాడు ఆ రాత్రి ఆమెకు నిద్ర పట్టలేదు. మరుసటిరోజు ఉదయమే ఆమె బౌద్ధ విహా రానికి వెళ్ళింది. ఆమె ప్రేమలోని స్వచ్ఛతను గమనించిన బుద్ధుడు ఆమెను తన విహారంలో శిష్యురాలిగా చేర్చుకుంటాడు. ఇది తెలిసి అగ్రవర్ణములవారు కుపితులై తమ అసమ్మతిని తెలుపడానికి రాజువద్దకు పోతారు. రాజు స్వయంగా విహారాన్ని సందర్శించి బుద్ధునితో మాట్లాడుతాడు. బుద్ధుడు వర్ణవ్యవస్థలోని అవివేకమును, అది మానవ సమాజానికి చేసే చెరపును రాజుకు నచ్చజెప్పుతాడు. పరివర్తనం చెందిన రాజు తన సౌధానికి మరలి వస్తాడు. ఫిర్యాదు చేయడానికి పోయిన పెద్ద మనుష్యులు నిరాశతో వెళ్ళిపోతారు. ఆమెను బౌద్ధ భిక్షుకిగా చేర్చుకునే సమస్య ఏ చిక్కూ లేకుండానే పరిష్కార మవుతుంది. కాని తరువాత మనోహరుడైన బౌద్ధ భిక్షువుపై ఆమెకు కలిగినప్రేమ ఎట్టి ప్రసక్తి లేకుండానే విడిచివేయ బడు తుంది. బహుశా ఆ కొత్త వాతావరణంలో ఆ సమస్య ఉదయించనే లేదేమో!

కుమారన్ ఆశాన్ ఈ సామగ్రితో ఒక సుందరకావ్యం రచించాడు. కావ్యంలో చాలా మనోహరమైన వర్ణనలు కల్పనలు వున్నాయి. భిక్షువు తన అరచేతిని నీటికై సాచినప్పుడు చండాలకన్య ఎట్లా కన్పిస్తుంది?

ముఖాన్ని పూర్తిగా కప్పివున్న చీరెను
పక్కకు తొలగించుకొని
కారుమబ్బులవంటి నల్లనికురులతో
నేత్రాలనుంచి అందం ఉట్టిపడుతుండగా
ఆమె నిశ్చలంగా నిల్చింది
ఆశ్చర్యంతో తడిసిన
మెల్లని మందహాసం
ఆమె అందమైన నోటినుంచి
వికసించి వెలువడింది.
కీటకపు దెబ్బల తాకిడికి మేల్కొని
కేసరములను బహిరంగపరిచే
ఎర్ర కలువ వలె
ఉదయ కాంతిని ధరించిన
ఆమె శరీరం తేటగా ప్రకాశించింది,
కెంపువన్నె ఆకులనుకూడా మించింది.

ఆ రాత్రి రెక్కలు తెగిన మిణుగురు పురుగులాగా ఆమె కాలం గడిపింది. బుద్ధుడిని చూచినప్పుడు ఆమెకు ఎట్లా అనిపించింది ?

అప్పుడే వెలిగించిన దీపంపై శలభం వలె,
సూర్యుని ముందు భూమండలం వలె,
పండిత రత్నం ముందు
విద్యా విహీనుని తర్కరహితమైన ప్రలాపంవలె,
స్థిరమైన చైతన్యం ముందు
సోలుతూ ఊగుతూవున్న సందేహంవలె !

కాని బుద్ధభగవానుడు ఆమెకు ధైర్యం చెప్పి శాంతపరచి ఈ క్రింది సాంత్వన వచనములతో ఆమెను భిక్షుకిగా స్వీకరిస్తాడు :

బిడ్డా, నీవు రావడం మంచిదే అయింది,
సమస్తమూ నాకు తెలిసింది,
దయతలచి ఏ పాపమూ ఎరుగని
ఆనందునికి నీవిచ్చావు

అతని దప్పిక తీర్చావు
జీవన్మరణములనే దుఃఖమును కలుగజేసే
దాహమునుండి
నీవు కూడా విముక్తురాలి వగుదువుగాక!

ఈ కావ్యంలో రాజుకూ బుద్ధునికీమధ్య వర్ణవ్యవస్థపై జరిగిన చర్చ ముఖ్యాంశము. బుద్ధుని ముఖతః వెలువడిన వాక్కులు కవికి గల భావాలను సంక్షిప్తంగా శక్తివంతంగా వ్యక్తం చేశాయి:

చెప్పండి,
బ్రాహ్మణుడు ఏ లతాగ్రము నుంచో
లేక పైని మేఘాలనుంచో
ఊడి పడతాడా?
మరొక విప్పుతో రగల్చకుండానే
దానంతట అదే రగులు కున్న
హోమాగ్నినుండి బైటికి వస్తాడా?
రక్తంలో కులమనేది వ్రాసి వుందా?
లేక ఎముకలలోనో
లేదా అస్థి సారములోనో
కులం కనపడుతుందా?
చండాలస్త్రీ శరీరం
బ్రాహ్మణ బీజానికి
ఫలవంతము కాదా?
జందెము, నెత్తిపై పిలక
నుదుటిపై బొట్టు
జన్మతోటే వచ్చే గుర్తులా?
గురువు బోధించ నక్కరలేకుండానే
బ్రాహ్మణుడు పండితుడవుతాడా?

ఇంత శక్తివంతమైన వాక్కులతో కులంలోని బండారమును బట్ట బయలు చేసిన కవులెందరు వున్నారు? విప్పుతో దహించుకుపోయే అజ్ఞానుల మనస్సుల నుంచి వెలువడే అసూయాద్వేషములనే పొగయే కులము అని ఆశాన్ భావము.

కనుక కులమనే అడ్డంకును అధిగమించి ప్రేమను పెంపుజేసి దయాస్వభావము కలిగి వుండవలసిందిగా ప్రజల నుద్బోధించమని బుద్ధుడు రాజుకు హితవు చెబుతాడు. ప్రేమను గూర్చిన ప్రకరణము 'దయాగుణము'పై షేక్స్పియర్ వ్రాసిన ప్రసిద్ధ పరిచ్ఛేదమంత ప్రశస్తంగా వున్నది.

ప్రేమ నుంచే లోకం ఉదయిస్తుంది
ప్రేమ వల్లనే ప్రపంచం వర్ధిల్లుతుంది
ప్రేమ యే ప్రపంచమునకు త్రాణ
ప్రేమ సర్వులకూ ఆనందాన్నిస్తుంది
ప్రేమ అంటే జీవమే నయ్యా,
ప్రేమను కాదనడం
మృత్యువును ఆహ్వానించడమే।

ఆనందుని అభిమానించిన మాతంగి ఉన్నత జీవితం వైపుకు ఆకర్షితురాలవుతుంది. త్వరలోనే ఒకా నొక ప్రత్యేక వ్యక్తిపై ఆమెకు ఏర్పడ్డ ప్రేమ భవ్యమై పరమోదాత్త స్థితికి చేరుకుంటుంది. అగ్రవర్ణము వాడైన భిక్షువుకు తాను మంచినీరివ్వడం ఆమోదింప బడటంతో ఆమె జీవితంలో నూతనాధ్యాయం అరంభమవుతుంది. కులానికి అర్థమూ తాత్పర్యమూలేని మహోన్నత శిఖరానికి చేరుకుంటుంది. నిజమైన ప్రేమ అంటే ఏమిటో గ్రహించింది. ఇక్కడ నూత్న జీవితం కోసం చొరవ తీసుకొని తొలియత్నం చేసింది ఆమే. కాని సావిత్రి విషయంలో అట్లా కాదు. తనకు అలవిదప్పిన పరిస్థితుల మూలంగా ఆమె పులయ వర్ణము వాని ఇంటిలో తలదాచుకోవలసి వచ్చింది. బాహ్యదృష్టికి సావిత్రి నీచ స్థితికి పోయినట్లూ, మాతంగి మహనీయ శిఖరం చేరినట్లూ కన్పిస్తుంది. పైనుంచి క్రిందికైనా, లేక క్రిందినుంచి పైకైనా మొత్తంమీద కులాల ఆచారం పటాపంచ లయింది. 'దురవస్థ' కన్న 'చండాల భిక్షుకి' కావ్యం కళాత్మకంగా శ్రేష్ఠమైనది. 'దురవస్థ' గట్టి కావ్యమే. కాని ముతకనేత గనుక కొన్నిచోట్ల మోటుగా వుంది. కాని 'చండాల భిక్షుకి' దార్ఢ్యముతోపాటు, జిలుగు నగిషీ నాజూకుదనం కలది.

ఆశాన్ తన యావజ్జీవితమును అట్టడుగున పడివున్న కులాలవారి దుర్భర స్థితిని మెరుగుపరచడానికి కృషిచేస్తూ గడిపాడు కాబట్టి ఈ రెండు కావ్యాలపై ఆతని ప్రత్యేక ముద్ర వుంది. ఇతర కవులు 'వీణపూవు' 'నళిని' 'సీత' వంటి కావ్యాలు వ్రాయగలరు. కాని 'దురవస్థ', 'చండాల భిక్షుకి' వంటి కావ్యాలను వారు వ్రాయగలరని మనం ఊహించనైనా లేము. సాంఘిక జీవితంలోని స్థితిగతుల

లోకి ఆశాన్ అంతగా చొచ్చుకొనిపోయి అగ్రశ్రేణిలో నిలబడి చుట్టూ పారజూచా డన్నమాట.

జీవితంలో విమ్నోన్నతాలను సరిదిద్దేది ప్రేమ. సాంఘిక సమానత్వానికి గీటురాయి వివాహబంధానికి ఇచ్చగించడము. ఉదారస్వభావులైనవారు సాంఘిక అసమానత్వాన్ని నిర్మూలించడానికై ఎంతకనికరమైనా చూపుతారు. ఎన్ని సర్దుబాట్లకైనా సిద్ధపడుతారు.కాని అగ్నిపరీక్ష ఎదురయ్యేసరికి అంతా తప్పుకుంటారు. విఫలులవుతారు.ఆశాన్ ఈ సమస్య మూలాన్ని స్పృశించి.దీనికి సర్వోత్తమమైన పరిష్కార మార్గాన్నిసూచించాడు.ఒకే చోట కలిసి కూర్చోవడం,సహపంక్తి భోజనాలు చేయడం స్వల్ప విషయాలు. అవి సమస్య అంచును మాత్రమే తాక గలవు. ఆశాన్ అన్ని కులాలనూ ఒక చోటికి చేర్చి ఒక మహా సమ్మేళనమును సాధించా లనుకున్నాడు. ఇది ఆ రోజుల్లో పెద్ద గడబిడ తెచ్చి పెట్టింది. ఆశాన్ సూచించిన సంబంధ బాంధవ్యం ఇంకా కాగితంపై వుండగానే కేరళదేశ సాంఘిక, సాహిత్యరంగాలలో పెద్ద కలకలం బయలు దేరింది. అది ఆశించ నటువంటి పరిణామ మేమీ కాదు. ఉద్దేశ పూర్వకమైన సవాలు. కవిగా ఆశాన్‌ను అలక్ష్యం చేయడం ఎవరి తరం కాలేదు. ముస్లిములు, సవర్ణులైన హిందువులు సృష్టించిన తుపానును ఆయన ఎదుర్కొని ధైర్యంగా నిలబడ్డాడు. మోప్లా తిరుగుబాటును కావ్యానికి పూర్వ రంగంగా ఆశాన్ కవి ఎన్నుకున్నందుకు ముస్లిములకు కోపం వచ్చింది. కాని ఈనాడు ప్రజలవైఖరులలో చాలా మార్పు వచ్చింది. సాంఘిక ప్రవర్తనములో ఇట్టి మార్పు రావడానికి కవిగా ఆశాన్ వహించిన పాత్ర ప్రముఖమైనది. మరువ రానిది.

## 11. లఘు కావ్యములు

ఆశాన్ ఇంతకు పూర్వం ప్రస్తావింపబడ్డ భక్తి ప్రధానమైన కావ్యాలేగాక శ్రేష్ఠమైన భావప్రధానమైన లఘు కావ్యా లనేకం రచించాడు. అవి 'పుష్పవాటి', 'మణిమాల', 'వనమాల' అనే పేర్లతో మూడు సంపుటములుగా వెలువడ్డవి. మొదటి సంపుటమును కవియే స్వయంగా ప్రకటించాడు. రెండవ దానిని, మూడవ దానిని ఆయన మరణానంతరం ఆయన సతీమణి వెలువరించింది. వీనిలో కొన్ని స్వాగత సభల సందర్భాలకు ప్రత్యేకంగా వ్రాసినవి. మరి కొన్ని ఆయనకు ఇష్ట

లైనవారు వేరొక ప్రాంతానికి తరలి వెళ్ళినప్పుడో, లేదా కాలధర్మం చెందినప్పుడో వ్రాశాడు. అయినా అవి కలకాలం నిలిచేభావగీతాలు, తక్కినవి ప్రకృతిఅంటే ఆయనకు గల ప్రీతివల్ల, నీతిబోధనపట్ల ఆయనకు గల అభిరుచివల్ల, జీవితంలోని అనేకాంశములపై ఆయన చేసిన యోచనలవల్ల వెలువడినట్టివి. వస్తువునుబట్టి, స్వరూపమునుబట్టి వానిలో కొన్ని మలయాళ కవిత్వంలో రత్నముల వంటివి.

పెద్ద కావ్యాలలో ఆశాన్ ప్రణయతత్త్వ కవిగా స్ఫురద్రూపియై కనిపిస్తాడు. కాని లఘుకావ్యాలలో చాలా వరకు స్వాతంత్ర్యమును ప్రబోధించే భావగీత గాయకుడుగా పరితల మనస్సులను చూరగొంటాడు. "ఒరు ఉద్బోధనం" (ఒక ఉద్బోధన) అనే శీర్షికతో వ్రాసిన గీతం రూపకాలంకారమైన కావ్యఖండిక. దీనిలో కవి తన ప్రజలను నిద్రలేవండి, సమైక్యముతో ఎంత మూల్యమైనా చెల్లించి స్వాతంత్ర్యాన్ని గెల్చుకోండని ఉద్బోధిస్తాడు. "స్వాతంత్ర్యం అమృతం. స్వాతంత్ర్యం జీవం. గర్వోన్నతులైన వారికి దాస్యం చేయడం మరణం కన్న ఘోరమైన దుర్గతి", ఇవి ఆశాన్ భావాలు.

ఇంతకన్న శక్తివంతమైన పిలుపు "సింహనాదం"లో కన్పిస్తుంది. ఇందులో కూడా కవి సాటిమానవులను నిద్రమేల్కొనండని వైతాళిక గీతం ఆలాపిస్తాడు: "మేల్కొనండి, మేల్కొనండి, సోదరులారా, త్వరపడండి, యుద్ధభేరీలను మ్రోగించి కులమనే రాక్షసుడు ఎక్కడ అడుగిడినా వానిని ఎదిరించి పోరాడండి."

1922 లో ఎరమల్లూరులో జరిగిన యస్. యన్. డి. పి. యోగం వారి బ్రహ్మాండమైన మహాసభలో స్వచ్ఛంద సేవకులు పాడడం కోసం ఆశాన్ "స్వాతంత్ర్యగాథ" అనే గేయం రచించాడు. ఆ తర్వాత కూడా ఆ గేయం సాంఘిక అసమానత్వాలను తొలగించడం కోసం జరిగిన పోరాటం సందర్భంగా ఏర్పరచిన మహా సభలలో తరచు పాడబడుతూ వుండేది. ఆశాన్ కోరేది కేవలం రాజకీయ స్వాతంత్ర్యమే కాదు. సాంఘిక ఆర్థిక స్వాతంత్ర్యాలకూ, అన్నిమతాల వారు అన్నికులాలవారు సమానులుగా సహజీవనం నెరపడానికి సమమైన ప్రాముఖ్య మిచ్చి ఈ గేయాన్ని రచించాడు. ఈ గేయంలో "మా సంకెళ్ళను విరగగొట్టి మమ్ము బంధనాలనుండి విముక్తి చేయుము ప్రభూ" అని స్వాతంత్ర్య దైవమును వేడుకున్నాడు. "స్వాతంత్ర్యగాథ" గేయంనుంచి కొన్ని పంక్తులను ఇచ్చట ఉదాహరించడమైనది:

# స్వాతంత్ర్య గీతం

స్వాతంత్ర్య సామ్రాజ్య చక్రవర్తీ
బంగారు సింహాసనము నధిష్ఠించే ప్రభూ.
తేజస్సుతో పావనుడవై,
రాజహస్తంలో
కాంతిప్రభలు విరజిమ్మ
కిరణములను ధరించిన స్వామీ.
నీ ఏలుబడికి జయమగుగాక!
సంకటములను, బాధలనుచూచి
వెన్నిచ్చి పారిపోనటు వంటి
తరతరాల ప్రజానీకం
సర్వదా నీ పేరును స్తుతింతురుగాక!
ఆ స్తోత్రం ప్రపంచమంతటా
ప్రతిధ్వనించునుగాక!
నీ ఖడ్గకాంతుల ధాళధళ్యం
మా కనుగవలపై ప్రసరించుగాక!
మా పాదాలను బంధించే
సంకెలలను త్రెంచివేయి
మా చేతుల బేడీలను పగులగొట్టి
ఆవల పారవేయి ప్రభూ.
క్రిందపడిన మమ్ము పైకిలేపు,
అంతటావున్న అంధకారపు ప్రహరీలను
నేలమట్టం చేయగల
సామర్థ్యం మాకు ప్రసాదించు.
విమోచన మనే ఆనంద సాగరంలో
చెట్టపట్టాలు పట్టుకొని
సంబరంతో త్రుళ్ళింతలాడే
అవకాశం మాకు కలిగించు.
మానవజాతి సత్యమనే ఊపిరి పీల్చుకొని,
సమానత్వమును సంభావించి

ప్రేమసారమును గ్రోలి
మహనీయమైన సంతుష్టితో
యథార్థమైన ధర్మప్రధాన
సైనికులవలె సాగిపోదురుగాక!
ఈ ప్రపంచం స్వర్గతుల్యమగుగాక!

"ప్రభాత నక్షత్రం" (వేగుచుక్క) అనే గేయంలో 'ఒక దేశం, ఒక భాష, ఒక దైవం, ఒకే కులం మనకు' అనేది ముఖ్య ప్రబోధం.

సంఘసంస్కర్తయైన సహోదరన్ అయ్యప్పన్ కోర్కెపై రచించిన 'పరివర్తనం' అనే గీతంలో విప్లవాత్మకధోరణి ప్రత్యక్షంగా కన్పిస్తుంది. 'కపోత పుష్పం', 'మిన్నా మినుగు' (మిణుగురు పురుగు), 'తొట్టత్తిలె ఎట్టుకాలి', (తోటలో పాలీడు), 'భారత మయూరం' అనే గేయాలలో కవి యొక్క ప్రగాఢ ప్రకృతి పరిశీలనము, సౌందర్యారాధనము గోచరిస్తాయి. ఈ గీతాలు ఎన్నో శబ్దచిత్రాలతో కల్పనలతో అలంకృతమై వున్నవి. చివర పేర్కొనబడిన గీతంలో భారతదేశ నెమలి వర్ణన అత్యద్భుతంగా చేయబడింది. ఈ గీతం చివరి పంక్తులలో నెమలిలో కవి ఒక రాజాధి రాజుయొక్క రాజ చిహ్నమును దర్శించాడు. 'శాశ్వత స్వరాజ్యము'ను పొందిన భారతమాత ఈ పక్షికి నివాస స్థానమని గీతమును ముగించాడు. ఈ విషయంలో కవి దూరదృష్టితో భవిష్యత్తును గూర్చి జోస్యం చెప్పినట్లుగా వుంటడం గమనించ దగిన అద్భుత విశేషం. ఈ కావ్యం 1923 లో రచింప బడిన తర్వాత నాలుగు దశాబ్దాలకు నెమలిని మన జాతీయ పక్షిగా కేంద్రప్రభుత్వం ప్రకటించింది.

'కావ్యకళ లేక ఏజాం ఇంద్రియము' (సప్తేంద్రియము) అనే గేయంలో అనిర్వచనీయమైన కావ్య కళను కవి కడుసుందరంగా రేఖా చిత్రంవలె వర్ణించాడు. కావ్యదేవత స్తవముచేస్తూ కవి కావ్యకళలోని సూక్ష్మవిశేషాలనూ చమత్కారాలనూ, ఆ కళ ఉదాత్తతనూ ఎంత చక్కగా ప్రదర్శించాడంటే ఆ గేయం విశిష్టమైనదిగా నేటికీ పరిగణింప బడుతున్నది.

ఆశాన్ వైదుష్యతాముద్రను చూపెట్టే గీతములు గేయములు, పద్యములు అనేకం వున్నాయి. వాటిలో 'సి. వి. స్మారకం'. 'వణ్డింటెపాట్టు' (భ్రమర గీతము), 'సంకీర్తనం', 'దివ్యకోకిలం' 'విష్కపటతయోడు' (విజాయతీ నుద్దేశించి) పేర్కొన దగినవి.

# 12. బహుముఖ ప్రతిభ

ఇంతవరకూ మనం కుమారన్ ఆశాన్‌ను ముఖ్యంగా కవిగా, ఈజవ కులం వారి సాంఘికాభ్యున్నతి ఉద్యమానికి పాటుపడిన వ్యవహర్తగా మాత్రమే పరిశీలించి వున్నాము. అతని జీవితంలో మనం గమనించదగ్గ ఇతర అంశాలు కూడా వున్నాయి. ఈ అధ్యాయంలో వాటిలో కొన్నిటిని, విచారణ చేద్దాము.

## పత్రికా సంపాదకుడు

నాల్గవ అధ్యాయంలో తన కులం వారి పిలుపు నందుకొని 'వివేకోదయం' పత్రిక ప్రచురణ విషయంలో ఆశాన్ వహించిన పాత్రను క్లుప్తంగా ప్రస్తావించి వున్నాము. ఆ పేరు మహా వ్యక్తియైన వివేకానందుని పేరును జ్ఞప్తికి తెచ్చునదిగా వున్నందున దాని ప్రాముఖ్యాన్ని కూడా మన చర్చలో స్పృశించి వున్నాము. అది అలా వుంచినా ప్రజలకు వివేకమును ప్రబోధించే ఉద్దేశంతో ఆరంభింపబడ్డ పత్రికకు అది చక్కని పేరని చెప్పాలి. 'వివేకోదయం' పత్రిక ప్రధానంగా యస్.యన్.డి పి. యోగం సంస్థ లక్ష్యాలనూ ఉద్దేశాలనూ కార్యక్రమాలనూ తెలియజేసే పత్రికగా ఉద్దేశింపబడినప్పటికీ, దాని మొదటి సంపాదకుడైన ఆశాన్ దానిని కేవలం ఒక కులంవారి పత్రికగా చేయకుండా తగు జాగ్రత్త పడ్డాడు. ఆ పత్రికలో ప్రచురితమయ్యే సాహిత్య వ్యాసాలను, ఇంకా ఇతర విజ్ఞానదాయకమైన వ్యాసాలను అన్నికులాలకు చెందిన విద్యావంతులు ఆసక్తితో చదివేవారు.

ముఖ్యంగా ఆశాన్ స్వయంగా వ్రాసే సంపాదకీయాలు పాఠకులను మిక్కుటంగా ఆకర్షించేవి. వాటిలోని విషయము, తర్కబద్ధమైన చర్చ, చదివే వారికి నచ్చజెప్పే రచనా విధానం, మలయాళ జాతీయములతో నుడికారాలతో అలరారే వచన రచన ప్రశస్తంగా వుండేవి. అప్పటికి ప్రస్తుతమైన సమకాలిక వ్యవహారాలను నిర్భయంగా విమర్శించిన తీరు కేరళ దేశనాయకులు ఆ పత్రికను తప్పక చదివేట్టు చేసింది. నేటికి కూడా పాతతరానికి చెందిన వృద్ధులు చురుకు, పదును గల ఆ సంపాదకీయ వ్యాసాలను ఉదాహరిస్తూ వుంటారు. ప్రభుత్వ పాఠశాలల్లోని విధినిషేధాలనుగూర్చి, ఈజవకులం వారికి లేకుండా చేయబడిన 'ఉచిత ప్రాథమిక

విద్య'ను గూర్చి, వెనుకబడిన కులాల వారికి ఉద్యోగావకాశాలు లేకుండా పోవడమును గూర్చి వాటిలో చాలా ఘాటైన విమర్శ వుండేది.

వి. పి. మాధవరాయర్ దివానుగా వుండగా కొంత ఆయన చూపిన ఔదార్యంవల్లనూ, దూరదృష్టివల్లనూ, కులంవారు తరచు సమర్పించుకున్న విజ్ఞాపన పత్రములవల్ల కొంతా, ఈజవలకు శ్రీమూలం శాసన సభలో ప్రాతినిధ్యం లభించింది. సవర్ణులైన హిందువుల యాజమాన్యం క్రిందవున్న పత్రికలకు ఇది నచ్చ లేదు. "మద్రాసు మెయిల్" పత్రిక ఈ సంస్కరణను గూర్చి వ్రాస్తూ ఈజవలను బ్రాహ్మణులు ఏర్పరచిన వర్ణవ్యవస్థలో అందరికన్న తక్కువకులంవారని పేర్కొన్నది. "మలబారు మెయిలు" పత్రిక మదురై, విశేఖరి దివాన్ గారు ఈ కులంవారికి నంబూతిరీలతో ఇతర సవర్ణులైన హిందువులతోపాటు కూర్చునే అవకాశం కలుగజేసి వారి అంతస్తును పెంచినందుకు ఆయనను ప్రశంసించారు. ఇటువంటి విమర్శలను, ప్రశంసలను ఆశాన్ ఏ విధంగా స్వీకరించేవాడో తెలుసుకోదగిన విశేషం. 'వివేకోదయం' పత్రిక సంపాదకీయంనుంచి ఇందుకు సంబంధించిన ఒక భాగమును నాకు తోచిన రీతిని అనువదించి ఇచ్చట ఉదాహరిస్తున్నాను :

'నంబూతిరీలతో,(భూసురులతో—భూలోకంలో దేవతలుగా పరిగణింపబడే వారితో) లేదా దేవతలకు రాజైన ఇంద్రునితోపాటు కూర్చొనడమే ఒక అభ్యున్నతిగా ఎంచే వివేకహీనులు, మూఢులు ఈజవలలో వున్నారని పోల్చుకోవడం కష్టతరం. అటువంటివారు లేరు. వాస్తవ పరిస్థితులను పరిగణనకు తీసుకొనే ఈజవలు నిష్పక్షపాతుడైన కొత్త దివాన్ తమను మరింత బాగా చూచి న్యాయంగా వ్యవహరించ గలడని ఆశిస్తారు.'

విఖ్యాతుడైన ఇట్టి సంపాదకుని రచనలో గల చమత్కారోక్తులను, స్వారస్యమును, అపహాస్యమును, ఎత్తి పొడుపులను స్వయంగా చదివి ఆనందించవలెనంటే మొత్తం సంపాదకీయాన్నే చదవాలి. తాము వెనుకబడి వున్నామన్న భావనయే ఆశాన్‌కు ఒక శాపగ్రస్తమైన విషయంగా తోచేది. తాను ఒకరికన్న హీనుడనని భావించడం ఆయనకు నామోషీగా వుండేది. తాను ఎవరికీ తీసిపోనని ఆశాన్ సుదృఢ విశ్వాసం, ఆ అహంభావమే ఆయన రచనల్లో ప్రతిబింబించింది.

1904 లో ఆరంభింప బడిన దాదిగా 'వివేకోదయం' పత్రికకు కుమారన్ ఆశాన్ 15 ఏండ్లపాటు సంపాదకుడుగా వున్నాడు. వివాహమైన ఒక ఏడాది

తర్వాత యస్. యన్. డి. పి. యోగంనుంచి,'వివేకోదయం'నుంచి తన అధికార సంబంధమును వదులుకున్నాడు. అయితే ఆయన తెలివితేటలను, ప్రజ్ఞాప్రాభవములను శ్రీ నారాయణగురు యుక్తితో మరొక రంగంలో వినియోగించుకో గలిగాడు.

ఆయన ఆశాన్‌ను ఆల్వే లోని సంస్కృత పాఠశాలకు కార్యదర్శిగా, అద్వైతాశ్రమమునకు కూడా కార్యదర్శిగా నియమించాడు. ఇది 1920 లో జరిగింది. ఆశాన్ తన కేంద్రస్థానమును ఆల్వేకుమార్చి కొత్త బాధ్యతలను స్వీకరించాడు. అక్కడ చెరాయ్ (కొచ్చిన్‌లో వున్నది) ఈజవలు తమ సంస్థయైన విజ్ఞాన వర్ధిని తరపున 'ప్రతిభ' అనే పత్రికను తీయ తలపెట్టినామనీ, దానికి సంపాదకులుగా వుండవలసిందనీ ఆశాన్‌ను అర్థించారు. ఆశాన్ అంగీకరించాడు. ఆ పత్రిక మొదటి సంచికలో వ్రాయబడిన సంపాదకీయం పత్రిక ముఖ్య లక్ష్యాలను పేర్కొన్నది. సాంఘికంగా రాజకీయంగా ప్రస్తుతము సమకాలికము అయిన విషయాలను గూర్చి పాఠకులకు ఆసక్తి కలిగించే విధంగా తెలియజెప్పడం, సాహిత్య రచనలు ప్రచురించి పాఠకులను రంజింప జేయడం-ఇవి 'ప్రతిభ' ఆదర్శాలు. ఆశాన్ తన గేయాలను భావగీతాలను, లఘు కావ్యాలను 'ప్రతిభ'లో ప్రచురించాడు. వాటిలో "దీపార్పణం", 'సంకీర్తనం', 'గుజవిష్ఠ' చెప్పుకో దగినవి.

సాహిత్య విమర్శను గూర్చి ఆశాన్ తనకు గల భావాలను, అభిప్రాయాలను ఈ పత్రిక తాలూకు రెండు సంచికలలో 'సరస్వతీ రంగం' అనే శీర్షిక క్రింద విస్పష్టం చేశాడు. ఆ రెండు వ్యాసాలు పుస్తక సమీక్షల విషయంలో సాహిత్య పత్రికలకు మార్గదర్శక మైనవి. మంచి సమీక్ష చదివించేదిగా వుండాలి. జ్ఞానబోధకంగా విశేషాలను తెలియ జేసేదిగా వుండాలి. పూర్తిగా నిష్పక్షపాతంగా వుండాలి. ఇక సాహిత్య విమర్శకు ఆశాన్ కవి స్వయంగా చేసిన దోహదమును పరిశీలిద్దాము.

## విమర్శకుడు

ఉత్తమ కవులందరూ ఉత్తమ విమర్శకులు కారు. కాకపోతే గొప్ప కవులలో చాలా మందికి విమర్శనాత్మక దృష్టి, పరిశీలనా వివేచనము వుంటాయి. స్రష్టయైనవాడు ఇతరుల రచనలను గూర్చి విమర్శలు వ్రాయడం తరచు నీరసమైన కార్యంగా బేజారెత్తించే వ్యాసంగంగా భావిస్తాడు. కుమారన్ ఆశాన్ మహాకవి, అభిజ్ఞుడైన విమర్శకుడు. సాహిత్య పత్రిక సంపాదకుడుగా కొన్ని కావ్యాల

సాహిత్య మూల్యమును నిర్ధారణచేసే అవకాశం ఆయనకు కలిగించి. అందు వలన ఆయన సాహిత్య వివేచనా పటిమను తెలుసుకోవడానికి 'వివేకోదయం', 'ప్రతిభ' మున్నగు పత్రికలలో ఆయన వ్రాసిన పుస్తక సమీక్షలు, ఇతర సారస్వత వ్యాసాలు ఉపకరిస్తాయి.

ఆశాన్ వ్రాసిన గ్రంథ విమర్శనములలో మూడు మహా కావ్యాలనుగూర్చి ఆయన వ్రాసి ప్రచురించిన సమీక్షలు ప్రముఖస్థాన మాక్రమిస్తాయి. ఒకటి వళ్ళతోళ్ కావ్యం 'చిత్రయోగం'. రెండవది ఉళ్ళూరు పరమేశ్వర అయ్యర్ కావ్యం "ఉమాకేరళం.', మూడవది పంతళం కేరళవర్మ కావ్యం 'రుక్మాంగద చరితం'. 'చిత్రయోగం'పై వ్రాసిన విమర్శ కేరళలోని సాహిత్య పక్షాల గూళ్ళలో పెద్ద కలకలానికి కారక మైంది. సంక్షిప్తంగా వ్రాసిన ఈ సమీక్షలో సంస్కృతా లంకారికులు నిర్ధరించిన సూత్రాలకూ నిబంధనలకూ కట్టుబడివుండి వారిని సంతృప్తి పరిచే నిమిత్తం ఒక మహా కావ్యం రచించడం అవసరమా అని ఆశాన్ ప్రశ్నిం చాడు. సముద్రం, పర్వతాలు, ఋతువులు మొదలగు వానిని వర్ణించడంకోసం ఒక కథను ఎందుకు బలిచేయాలి అని ఆయన అడిగాడు. సంస్కృత మహా కావ్య ముల రచనా విధానమును గ్రుడ్డిగా అనుకరించడాన్నీ, అందుకు దారి తీసిన కవి ఛాందస వైఖరినీ ఆశాన్ తీవ్రంగా విమర్శించాడు. అంతే గాక ఆ కావ్యంలో సుప్రసిద్ధ సంస్కృత కావ్యాలను పోలివున్న భాగములను ఉదాహరించాడు కూడా:

ఇది వళ్ళతోళ్‌కూ, ఆయన అభిమానులకూ కోపావేశాలు కలిగించింది. అప్పటికే వళ్ళతోళ్, ఆశాన్—వీరుభయులూ కేరళలో పేరు మిగిలిన కవులుగా పరిగణింప బడ్డారు. ఇద్దరికీ సాధారణంగా కవుల మధ్యవుండే అసూయాద్వేషాలు అప్పటికి లేవు అని నిస్సందేహంగా నిష్కర్షగా చెప్పడానికి వీలు లేదు. ఆ రోజు లలో సాహిత్యరంగంలో కూడా కులభేదాలు ప్రాబల్యం వహించి వుండేవి. ఆ కారణంగా ఆ సమీక్షను ఈజవ కులానికి చెందిన కవి నాయర్ కులానికి చెందిన కవిని విమర్శించినట్లుగా కొందరు సంభావించారు. వెంటనే వళ్ళతోళ్‌ను సమర్థిస్తూ మరొక కవి ఉణ్ణికృష్ణన్ నాయర్ ఒక లేఖ ప్రచురించాడు. ఇందువల్ల తన వైఖ రిని సమర్ధించుకుంటూ 'చిత్రయోగం' కావ్యంపై ఆశాన్ సమగ్రమైన విమర్శక వ్యాసం వ్రాయవలసి వచ్చింది. కావ్యవిమర్శలో ఈ వ్యాసం ఒక ప్రత్యేకత గలది. ఇందులో విమర్శకుని సూక్ష్మబుద్ధి, నిశిత పరిశీలనం ప్రస్ఫుటంగా కన్పి స్తాయి. అంతే గాక దానిని చదివిన వా రెవరైనా లోతులకు చొచ్చుకొని పోయే

ఆశాన్ గ్రహణశక్తిని, సంస్కారము నాగరికత వ్యక్తమయ్యే ఆతని ఉత్తమ అభిరుచిని, ఆయన ప్రగాఢ పాండిత్యమును ప్రశంసించకుండా వుండలేరు.

తాము నిష్కపటంగా, వున్నది వున్నట్లుగా ఆ కావ్యాన్ని విమర్శించి నందు వల్ల కులభేదాలు తల ఎత్తి తన విమర్శ కులం ప్రాతిపదికపై వ్రాయబడిందనే అపోహలు కలుగడం ఆశాన్‌కు మనః క్లేశం కలుగ జేసింది. కొన్ని పత్రికలు ఆశాన్‌ను ఖండిస్తూ అసభ్యమైన భాషను ప్రయోగించాయి ఈ విధంగా రెచ్చ గొట్ట బడినప్పటికీ ఆయన కోపోద్రిక్తుడై సమచిత్తతను గోల్పోక ఎంతో నిగ్ర హంతో తన వైఖరిని విశదం చేశాడు. ఆ సుదీర్ఘమైన సమీక్షను ఇట్లా ముగిం చాడు: "విజాయతీతో తమ భావాలను వ్యక్తం చేసినందుకు కులాన్నీ వృత్తినీ తూర్పారబట్టుతూ, అటువంటి మురికి విమర్శలు ప్రచురిస్తూ సాహిత్య విమర్శ అనే వేషంతో ప్రజలను పెడదారి పట్టింప ప్రయత్నిస్తే, అందుకు వారికి సిగ్గులేక పోతే మనం విచారం వ్యక్తం చేయడంతప్ప చేయగలిగింది ఏమీ లేదు."

తక్కిన రెండు మహా కావ్యాలపై వ్రాయబడ్డ విమర్శలు అంత ఘాటుగా లేక కొంత అనుకూలంగా వున్నాయి. అయినప్పటికీ ఆధునిక కవులు అటువంటి సంప్రదాయ బద్ధమైన కావ్యాలు వ్రాయవలసిన అగత్య మేమిటనీ, ఎప్పుడో భూమిలో పడి శిలారూపం దాల్చిన ప్రాచీనావశేషములవంటి సారస్వత రీతులను ఇప్పుడు అనుకరించడ మెందుకనీ ఆశాన్ ప్రశ్నించాడు. ఉళ్ళూరు కవి రచించిన 'ఉమాకేరళం'లో ఆశాన్‌కు కొన్ని మహా కావ్యలక్షణాలు కనిపించాయి.

ఈ వ్యవహార మంతటిలోనూ వళ్ళతోళ్ పూర్తిగా మౌనం వహించి వూరుకో లేదు. అప్పుడాయన 'ఆత్మ పోషిణి' పత్రికకు సంపాదకుడు. ఆయన తన పత్రికలో ఆశాన్ రచించిన స్మృతికావ్యం "ప్రరోదనం" పై చాలా ఘాటైన విమర్శ ప్రచురించాడు. వెంటనే ఆశాన్ లేఖినినుండి ఆ విమర్శకు సమాధానం వచ్చింది. ఈ విమర్శలు, మరికొన్ని సంక్షిప్త సమీక్షలు తరువాత 'నిరూప ణంగళ్' (సారస్వత విమర్శలు) అనే పేరుతో పుస్తకరూపంలో వచ్చాయి. వీటిలో వళ్ళతోళ్ రచనయైన 'బంధనస్థనాయ అనిరుద్ధన్'పై ఆశాన్ చాలా అను కూలంగా వ్రాసిన సంక్షిప్త సమీక్ష కూడా వుంది. దీనిని బట్టి ప్రతి కక్షియైన కవియైనప్పటికీ శ్రేష్ఠమైన సృజనాత్మక రచన చేస్తే ఆశాన్ హర్షించ గలిగేవాడనీ, హర్షించాడనీ నిరూపిత మవుతున్నది.

## అనువాదకుడు

అనువాదాల రూపంలో కూడా ఆశాన్ మలయాళ సాహిత్యాన్ని సుసంప న్నం చేశాడు. ఆయన చేసిన అతిముఖ్యమైన అనువాదం 'బుద్ధ చరితం.' సర్ ఎడ్విన్ ఆర్నాల్డ్ రచన 'లైట్ ఆఫ్ ఏషియా'ను ఆశాన్ పద్యకావ్యంగా రచిం చాడు. తాను బౌద్ధతత్త్వాభిమాని గనుకను, బుద్ధుని జీవితం తన మనసు నాకర్షిం చింది గనుకను ఆ కావ్యాన్ని నిరాడంబరమైన శైలిలో పద్యకావ్యంగా రచించి మలయాళ కావ్యప్రియులకు అందజేయడం బాగుంటుందని ఆశాన్ భావించాడు. ఈ అనువాదాన్ని ఆయన 1903 లోనే ఆరంభించినప్పటికీ ప్రథమ సర్గ 1915లో పూర్తిచేయ గలిగాడు. ఆ తరువాత వేరే పనుల వత్తిడివల్ల చాలాకాలం వరకు తిరిగి ఆ పనిని చేపట్ట లేకపోయాడు ఈ అనువాదం తాలూకు కొన్ని భాగాలు 'వివేకోదయం' పత్రికలో సీరియల్‌గా ప్రచురితమైనవి. తరువాత 1918 లో కొంత అనువదించాడు. కాని చివరిదైన అయిదవ భాగం 1924 వరకు అసం పూర్తిగా అలాగే వుండిపోయింది. అనువాదం విషయంలో ఒక అంశం ముఖ్యంగా చెప్పుకో దగింది. ఆరంభంలోని ప్రథమ, ద్వితీయసర్గలు యథా తథమైన అను వాదాలు. ఆ తరువాతవి స్వేచ్ఛానువాదాలు. మూలంలోని ఎనిమిది సర్గలలో ఆశాన్ అయిదు మాత్రమే చేయగలిగాడు. చివరి సర్గ ఆశాన్ చేసిన ఆఖరి రచన. ఆశాన్ తన అనువాదంలో మూలానికి న్యాయం చేకూర్చాడు. అనువాదంలో ఎంతో సౌలభ్యం చూపాడు. మక్కికి మక్కీగా తర్జుమా చేసినట్లు లేదు. అనా యాసంగా సుఖంగా సాగింది పద్య రచన.

ఆశాన్ చేసిన మరొక ముఖ్య రచన 'బాలరామాయణం'. ఇది వాల్మీకి రామాయణం ఆధారంగా రచింప బడింది. అయితే దీనిని అనువాదమని చెప్ప డానికి వీలు లేదు. ముఖ్యంగా పిన్నవారికోసం దీనిని రచించాడు. కాని పెద్దలు కూడా దీనిని చదివి ఆనందించి ప్రయోజనం పొందవచ్చు. భాష కడు సులభమైనది. పదప్రయోగం, శైలి ఇంపైనవి. ఇది అనుష్టుప్ ఛందస్సులో రచింప బడటంవల్ల శ్లోకాలను కంఠస్థము చేయవచ్చు. మొత్తం రామాయణమును కవి ఈ విధంగానే వ్రాయాలనుకున్నాడు. కాని మూడు కాండములు—అంటే బాలకాండము, అయోధ్యా కాండము, అరణ్యకాండము మాత్రమే వ్రాయగలిగాడు.

## మనశ్శక్తి

లోగడ చెప్పినట్లుగా ఆశాన్ ఆంగ్లకవిత్వముచే బహుధా ప్రభావితు డైనాడు. అతడు ఆంగ్లములో అనేక వచన గ్రంథములను కూడా అధ్యయనం

చేసి వాటి అందచందాలను ఆకళింపు చేసుకున్నాడు. వాటిలో జేమ్స్ ఎల్లాన్ రచించిన "ఆజ్ ఎ మాన్ థింకెత్" (ఒక మనుష్యుని యోచన) అను గ్రంథ మొకటి. దీనిని మలయాళములోని కనువదించి "మనంపోలె మాంగల్యం" అను శీర్షికతో 'వివేకోదయం' పత్రికలో సీరియల్‌గా ప్రకటించాడు. ఆ తరువాత ఇది పుస్తకరూపంలో వెలువడినప్పుడు పేరు మార్చి "మనశ్శక్తి" అని పేరు పెట్టారు. కృతార్థుడు కావడానికైనా, విఫలుడనడానికైనా ఉన్నతుడవడానికైనా,పతనం చెంద డానికైనా మానవుడు తనకు తానే బాధ్యుడు. కాబట్టి మానవుడు స్వయం కృషితో తనను తాను వృద్ధిచేసుకోవాలి అని ఈ గ్రంథం ముఖ్యంగా వాదించింది. ఒక వ్యక్తి తల్లిదండ్రు లెవరైనప్పటికిని అతని పరిస్థితు లెటువంటి వైనప్పటికిని ఉన్నత భావాలతో ఘనకార్యములు చేసి ఎంత గొప్ప స్థితికైనా చేరవచ్చు. ఆశాన్ ఇటువంటి జీవిత దృక్పథంతో ప్రేరితుడై తన పుస్తకమును చదివిన పాఠకులు కూడా ఈ దృక్పథంవల్ల మేలు పొందగలరని ఆశించాడు.

'రాజయోగం' అనే గ్రంథం ఆశాన్ చేసిన సమర్థవంతమైన అనువాదం. దీని మూలమును పతంజలి యోగసూత్రం ఆధారంగా స్వామి వివేకానందుడు రచించాడు. ఆశాన్ ఈ గ్రంథమును కొన్ని సంస్కృత శ్లోకాలతో 1908 అక్టో బరులో స్వామికి అంకిత మిచ్చాడు.

ఇంకా అనేక గ్రంథములను ఆశాన్ మలయాళంలోనికి భాషాంతరీకరణం చేశాడు. మీడోస్ టేలర్ రచన 'తార' అను నవలను 'దైవికమాయ ప్రతీకారం' అనే పేరుతో అనువదించాడు. ఆంగ్ల గ్రంథమైన 'మైత్రేయి' ని అదే పేరుతో మలయాళంలో రచించాడు. ఆశాన్ చిన్నప్రాయములో వున్నప్పుడే అనువాద కళనుగూర్చి కొంత యోచన చేశాడు. విద్యార్థిగా వుండగానే 'మేఘదూతము'ను అనువదించే ప్రయత్నం చేశాడు. మొదలుపెట్టి కొంత వరకు చేశాడు కూడా. కాని దీనిని అసలు పూర్తే చేయలేదు. మైసూరులో నివసించిన రోజుల్లో శంకరా చార్యుల వారి 'సౌందర్యలహరి' ని, కృష్ణమిశ్రుని 'ప్రబోధ చంద్రోదయము'ను అనువదించాడు (5 వ అధ్యాయమును చూడండి.)

## ఆశాన్ కర్మాగారము :

ఆశాన్ ఏ విధంగా, ఎట్టి పరిస్థితులలో కళాకారుడుగా తన సృజనలకు ఒక రూపమివ్వ గలిగిందీ తెలుసుకోవలసిన విశేషం. ప్రతి కళాకారునికీ ఒక ప్రత్యేక పద్ధతి వుంటుంది. తన కళా ఖండమును తీర్చి దిద్దడంలో, దానికి పరిపూర్ణత

విషయంలో కళాకారుడు తన బాట అంటూ ఒకటి ఏర్పరచుకుంటాడు. కొందరు రచన పూర్తి అయిందంటే మళ్ళీ దాని వంక కన్నెత్తి చూడరు. అసలు ఆ శ్రద్ధ వారికి వుండదు. కాని మరి కొందరు తాము వ్రాసిన దానిని అంతులేకుండా మార్పు చేర్పులు చేస్తూ చెక్కి, చెక్కి, జిలుగు, నగిషీ, బింకము ఆపాదిస్తారు. వారికి ఎంతకీ తృప్తి కలుగదు. చాలా మంది రచయితలు ఉత్తర దక్షిణ ధృవాలకు చెందిన ఈ ఉభయవర్గాల వారి మధ్యన వుంటారు. అయితే తాము తలపెట్టిన రచనకు ఒక పథకమంటూ నిర్ణయించడం, కృత్యాద్యవస్థ పడటం, చివరకు రచన ఆరంభించి ముగించడం విషయంలో కళాకారుడు మానసికంగా ఎంత నలిగి పోతాడో సరిగ్గా అంచెనా కట్టి చెప్పడం కష్టం.

ఒక రచనకు దీర్ఘావలోకనంతో పథకం నిర్ణయించుకోవడంలో ఆశాన్ కడు నేర్పరి. రచన చేయడానికీ, ప్రసంగించడానికీ ముందు అతను ఎంతగా యోచిస్తాడో దానినిబట్టి రచయిత వ్యక్తిత్వం తెలియ వస్తుంది. చాలా మంది ఆశాన్‌ను అంతర్ముఖుడని అన్నారు. కారణ మేమంటే అతను తన సృజనాత్మక కృషిని మొదట చాలా మేరకు మనస్సులోని అంతరాళాలలో చేసేవాడు. కలం పట్టుకొని కాగితంపై వ్రాయడానికి ముందు తాను నిర్మింప తలపెట్టిన కావ్య సౌధ మును మొదట మనస్సులో ఊహించుకొని దానికి ఒక ఆకార మిచ్చుకునేవాడు. దీనినే మనం కల్పన చేయడం అంటాము. ఇలా లోలోపల కల్పించుకునే దశలో వున్నప్పుడు ఆశాన్ సంక్షుభిత వ్యక్తియై కలతజెంది అదో మాదిరిగా వుండే వాడు. తన మనస్సు ఇలా కళవళ పడుతున్నప్పుడు ఆయన వర్తన ఎట్లా వుండేదో ఆయన సతీమణి భానుమతి అమ్మ తన జ్ఞాపకాలలో ఈ విధంగా వ్రాసి పెట్టుకుంది :

"ఆశాన్ అంతర్ముఖుడు అన్న విషయం జ్ఞాపక ముంచుకో దగింది. ఏ విషయాన్ని గూర్చి అయినా ఆయన కావ్యమో గేయమో వ్రాసేముందు నిరంత రము ఏదో ధ్యానంలో నిమగ్నుడై వుండే వాడు. తాను వ్రాయ నమకట్టిన రచ నను గూర్చి నోట్సు వ్రాసి పెట్టుకునే అలవాటు ఆయనకు లేదు. ప్రతిదీ మనస్సు లోనే భావించుకొని ఆ భావనలోనే ఒక పథకం వేసుకొనేవాడు. కావ్యారంభం ఎట్లా చేయాలి, దానిని పెంపుచేయడమెట్లా, ఎట్లా దానిని ముగించాలి మున్నగు విషయాలను ముందుగానే మనస్సులో నిర్ణయించుకునేవాడు. ఒక నిర్ణయం తీసు కున్నాక రచన సాగే దశలో మొదట ఊహించుకున్న పథకాన్ని మార్పు చేయడ మంటూలేనే లేదు. అటువంటి ఆలోచనే ఆయనకు ఇచ్చగించదు. మొదటే సరిగా

ఆలోచించుకోక ఏదో ఆషామాషీగా రచన ఆరంభించిన వారికే అటువంటి మార్పు చేర్పులు అవసరమవుతాయి, అవి ఆయన తరచు అంటూ వుండేవారు."

ఆశాన్ రచించిన బృహత్కావ్యాలలో నిర్మాణ సౌష్ఠవం, పౌందిక, యుక్తాయుక్త విచక్షణ కన్పిస్తాయంటే అందుకు ఆయన మొదటే శ్రద్ధతో కావ్యనిర్మాణ రీతిని భావనచేయడం, తగు విధంగా పథకం వేసుకోవడం ముఖ్య కారణమని చెప్పాలి. అయితే రచన చేస్తున్నప్పుడు మాత్రం శబ్దప్రయోగం విషయంలో, మరింత శ్రద్ధ వహించేవాడు. ఆ దశలో పునర్విమర్శ, సవరణలు అధికంగానే వుండేవి. (ఈ పుస్తకం 12 వ పేజీలో ఆశాన్ వ్రాతప్రతి ఛాయా చిత్రమును చూడండి. కొట్టివేతలు, మార్పులు హెచ్చుగానే వున్నాయి.)

ఆశాన్ తరచు కాన్వాస్ పడక కుర్చీలో కూర్చొని ముందర ఒక చెక్క వేసుకొని దానిపై చిత్తు పుస్తకం పెట్టుకొని వ్రాసేవాడు. అప్పుడప్పుడు లేచి గదిలో పచారుచేస్తూ, పదాలను గొణుగుతున్నట్లు పదేపదే ఉచ్చరిస్తూ, సంస్కృత ఛందస్సులో కావ్యం వ్రాస్తున్నట్లయితే ఛందోరీతులను మననం చేసుకుంటూ, అనుకున్న దానిని తిరిగి దిద్దుకుంటూ లేదా పూర్తిగా మార్చివేస్తూ కావ్యలోకంలో విహరించేవాడు. ఈ విధంగా ఆశాన్ తన కృతులకు ఆకారము, రంగు, రుచీ, పరిమళము సంతరించేవాడు. నిజమైన కళాకారుని వైనమే అది కదా!

# 13. 'కరుణ'

ఆశాన్ చివరకు వ్రాసిన పెద్ద కావ్యము 'కరుణ.' చాలా మంది కావ్య ప్రియులు, విమర్శకులు ఆయన కావ్యములలో కెల్ల ఇది అత్యుత్తమకృతి అని అంటారు. ఈ అభిప్రాయంతో ఏకీభవించని వారు కూడా కొందరున్నారు. కొందరు గొప్ప రచయితల విషయంలో వారి అత్యుత్తమ రచన ఏదో వ్రేలెత్తి ఇదమిత్థంగా చూపడం సులభం. కాని ఆశాన్ ఇటువంటి రచయితల శ్రేణికి చెందినవాడు కాడు. కొంత మంది విమర్శకులు 'సీత' ఆయన రచించిన వాటిలో శ్రేష్ఠమైన కావ్యమంటారు. మరి కొందరు 'నళిని' గొప్పదని అంటారు. అయితే ఓట్లపద్ధతి గనుక అనుసరిస్తే అత్యధిక సంఖ్యాకులు 'కరుణ'కే వోటు వేస్తారు.

ఇందులో కూడా ఆశాన్ సుప్రసిద్ధ కథను ఇతి వృత్తంగా స్వీకరించాడు. ఇది వాసవదత్త, ఉపగుప్తుల కథ. ఈ కథ భారతీయ భాషలన్నింటిలో

కావ్యాలుగా నాటకాలుగా వ్రాయబడింది. వాటిలో టాగూరు కావ్యం 'అభిసారం' వాసికెక్కినది. 'బోధిసత్వావదాన కల్పలత' ఆ కావ్యానికి మూలమనిపిస్తుంది. ఆశాన్ డా. పాల్ కారస్ రచన 'గాస్పెల్ ఆఫ్ బుద్ధ' అనే గ్రంధం (బుద్ధ చరిత్ర)లో వున్న కధను యధాతధంగా స్వీకరించాడు. ప్రాథమికంగా కథ ఒకటే అయినప్పటికీ, వివరాలను పరిశీలిస్తే పెద్దమార్పులు గోచరిస్తాయి. ఆశాన్ కావ్యంలోని కథను సంక్షిప్తంగా వివేదిస్తాను :

వాసవదత్త ఉత్తర మధురకు చెందిన సుప్రసిద్ధవేశ్య. ఈమె సౌందర్యరాశి. నృత్యం, తదితర స్త్రీ సంబంధమైన కళలలో వైదుష్యము కలది. మధురానగరి సంపన్నులు ఆమెను సంతోష పెట్టడానికి తమ సంపదను ఆమె పాదాలవద్ద గ్రుమ్మరించే వారట. కాని చిత్రమేమిటంటే ఆమె శ్రీమంతుల నందరినీ కాదని, సిరిసంపదలనూ,విషయ సుఖములనూ త్యజించి బుద్ధభగవానుని శిష్యుడైపోయిన ఉపగుప్తుని వరించింది. తన సౌందర్య లావణ్యములతో అతనిని ఆకర్షించి అతనిలో మరులు కొలుపడానికి చాలా ప్రయత్నిస్తుంది. కాని అతను చలించడు. ఆమె తన చెలికత్తెద్వారా ఉపగుప్తునికి సందేశం పంపుతుంది. అతను "వాసవదత్తవద్దకు ఉపగుప్తుడు రావడానికి ఇంకా కాలమాసన్నం కాలేదు" అని సమాధానం చెప్పి పంపుతాడు.

వాసవదత్త ఆశ్చర్య చకితయై పూర్తిగా నిరాశ చెందుతుంది. కారణమేమంటే ఆమె అతని ప్రేమను కోరింది కాని అతని సంపదను గూర్చి పట్టించుకోలేదు. అంతటితో ఆమె ఉపగుప్తుని సంగతి వదిలి తిరిగి విషయ సుఖములలో మునిగి తేలడం మొదలు పెట్టింది. ఆమె కొక కొత్త ప్రేమికుడు లభించాడు. అతను దూరదేశంనుంచి వచ్చిన చెట్టియార్. ఆమెకు అంతకుముందే ఒక ప్రేమికుడున్నాడు. అతను కళాకారులకు నాయకుడు. హస్త కళలందు కౌశలము గలవాడు. ఈ ఇద్దరు ప్రేమికులూ ఘర్షణ పడతారు. ఆమె వారిద్దరిలో ఒకరి తరపు చేరుతుంది. పరిస్థితులు ఆమె చేయి జారిపోతాయి. కళాకారుల నాయకుని హత్యకు ఆమె కారకురాలవుతుంది. న్యాయస్థానంలో ఆమెపై అభియోగం మోపబడి విచారణ జరుగుతుంది. చివరకు వాసవదత్తకు శిక్ష విధిస్తారు. ఆమె చేతులను, కాళ్ళను నరికి ముక్కును చెవులను కోసేస్తారు. ఈ విధంగా అవయవచ్ఛేదము చేయబడిన శరీరమును శ్మశాన వాటికలో వదిలి వేస్తారు. మృత్యువు ఎప్పుడు వస్తుందా అని ఆమె క్షణమొక యుగంగా ఎదురుచూస్తూ వుండగా ఉపగుప్తుడు ప్రత్యక్షమవుతాడు. ఆమె ఆత్మ జీవన్మరణములమధ్య కొట్టుమిట్టాడు

తున్న ఈ ఘట్టంలో ముఖ్య కథనం వుంది. వాసవదత్త భిక్షువును గుర్తు పట్టుతుంది. ఆయనకు జరిగినదంతా తెలుసు. ఆమె స్థితిని అర్థం చేసుకొని సంక్షుభితమై వున్న ఆమె మనస్సుకు శాంతి కలుగ జేస్తాడు. ఆమె ఉద్రేకాన్ని ఉపశమింపజేసి, ఆమెను ఉదాత్త స్థితికి గొనిపోయి వినూత్న దృష్టిని ప్రసాదించి ఆమెను నిర్వాణమునకు సిద్ధపరుస్తాడు.

కుమారన్ ఆశాన్ కృతులలో "కరుణ" నిశ్చయంగా నిస్సందేహంగా గొప్ప కావ్యం. మలయాళ భాషలో ఇది నిజంగా పాఠకుల ఆదరాభిమానములకు మిక్కుటముగా పాత్రమైన కావ్యం. నిత్యం కాయకష్టం చేసుకొని జీవించే సామాన్య పాఠక జనం కూడా ఈ కావ్యంలోని కొన్ని పంక్తులను జ్ఞాపకం పెట్టుకొని వల్లిస్తూ వుంటారు. జన బాహుళ్యమును ఇంతగా ఆకర్షించిన కావ్యాలు మరే భాషలోనూ అంతగా లేవనుకుంటాను. 'కరుణ' ను స్వామీ బ్రహ్మవ్రత నాటకంగా వ్రాశారు. 1930,1940 ప్రాంతాలలో ఒక నాటక సమాజంవారు ఆ నాటకాన్ని ఎన్నోచోట్ల దిగ్విజయంగా ప్రదర్శించారు. ఈ నాటక సమాజంవారు కేరళ దేశంలోని అన్ని ప్రాంతాలలో దీని ప్రదర్శన లిచ్చారు. కొన్నేండ్లవరకూ జనం ఈ నాటక ప్రదర్శనలను వెర్రిగా ఎగబడి చూచారు. ఈ ప్రదర్శనలవల్ల కావ్యప్రాచుర్యం అధికమైంది. 'కరుణ'ను చలన చిత్రంగా కూడా తీశారు. కాని ఆ చిత్రం పరిమితంగా మాత్రమే ప్రదర్శితమైంది. ప్రేక్షకులను పెద్దపెట్టున ఆకర్షించ లేదు. కొన్ని కావ్యాలు ,జనబాహుళ్యాన్ని ఆకట్టు కుంటాయి. కాని రసజ్ఞులనూ విమర్శకులనూ ఆకర్షించ లేవు. మరి కొన్ని రసజ్ఞుల ప్రశంసలకు పాత్రమవుతాయి గాని జనాన్ని రంజింప జేయలేవు. అసలవి జనం దాకా పోవు. కాని 'కరుణ' ఎటువంటి అపురూప కళాఖండమంటే అది పండితపామరులను సమంగా ఆకర్షించి వారి మనస్సులను చూరగొన్నది. జోసెఫ్ ముండస్సేరి వంటి విఖ్యాత విమర్శకుడు ఈ కావ్యం గొప్పదనాన్ని ప్రస్తుతించారు. ఈ విధంగా ఒక వంక గంభీరము గాఢత్వము, మరొక వంక జనంలో ప్రాచుర్యమూ పేరూ పొందడానికి 'కరుణ'లో గల సహజ గుణవిశేషము లేమిటి ?

మొట్టమొదటి విశేషం కావ్య ఇతి వృత్తం. ఏ మాత్రం సున్నిత హృదయం గలవారినైనా అది కదలించి వేస్తుంది. స్త్రీ పురుష సంబంధమనేది అనేక విధములైన సంక్లిష్ట ఉద్రేకాలకు మూలాధారము. ప్రేమను అనర్గళంగా వ్యక్తం చేయడానికి స్త్రీ పుంసజాతక సంబంధి (sex) అనేది ప్రబలమైన అంశము. అందులోనూ పరంపరాగతంగా శరీరాన్ని అమ్ముకునే వృత్తికి చెందిన వేశ్య

కథలో కేంద్రస్థానం వహించిన పాత్ర అయినప్పుడు అది సూటిగా స్వాభావికంగా మానవ మాత్రులను ఆకర్షిస్తుంది. కేరళ కవిత్రయము వారిలో తక్కిన ఇద్దరైన వళ్ళతోళ్, ఉళ్ళూరు కవులు కూడా వేశ్యలను సంస్కరించే విషయమై కవితలు వ్రాశారు. వళ్ళతోళ్ రచించిన 'మగ్దలెన మరియం', ఉళ్ళూరు రచన 'పింగళ' వేశ్యలను వారి వృత్తినుంచి మాన్పింపజేసే ఉద్దేశంతో వ్రాసిన కావ్యాలే.

'ప్రణయ గాయకుడు' అనే పేరు పొందిన ఆశాన్ ప్రేమకు సంబంధించిన వివిధాంశములను గూర్చి కవితలు వ్రాసిన భావ కవి. 'నళిని', 'లీల' 'దురవస్థ', 'చండాలభిక్షుకి' వంటి అతని కావ్యాలను గూర్చి ఇదివరకే చర్చించి వున్నాము. ఆయా కావ్యాలలో ప్రేమ భావన అమలిన శృంగారమనే ఉత్తుంగ శిఖరాలనుండి వాలుగావున్న మైదాన భూములగుండా ప్రవహించు దావి వలె క్రిందికి దిగి వస్తుంది. ఆ కావ్యాల నాయికలు కూడా విభిన్న పీఠములపై అధివసించివున్న వారి వలె కన్పిస్తారు. అందరికన్న నళిని శిఖరాగ్రంపై వుంటుంది. ఆమె తరువాత దిగువన ఒకరి తరువాత ఒకరు వున్నట్లుంటారు. కరుణ దగ్గరకు వచ్చే సరికి నాయిక అందరికన్న దిగువస్థాయికి చేరుకున్నట్లుగా వుంటుంది. వాసవదత్త నైతికంగా దుర్నడత అనబడే ప్రవర్తనమును అపకీర్తిగా ఎంచని వేశ్య. అంతే కాదు, క్రూరమైన హంతకి కూడా. అటు వంటి వ్యక్తిలో కూడా స్వచ్ఛమైన ప్రేమ రవంతగా వున్నది. ఉపగుప్తుని చూడగానే ఆ రవ్వ జ్వాలగా పైకి ఎగసి వస్తుంది. అతను ఆమె ప్రేమను ఆమోదించి స్వీకరిస్తే ఆ పేద సన్యాసి పాదాలపై తన సర్వస్వమును అర్పించడానికి ఆమె సిద్ధంగా వున్నది. కావ్యనాయికయొక్క ఈ వింతవైఖరి ప్రతిపాఠకుని ఊహకు గిలిగింతలు పెడుతుంది. ఉపగుప్తుని తీరు మరింత వింతైనది. నవయవ్వనంలో ఆమె జీవితం మూడు పూవులారు కాయలుగా వున్నప్పుడు ఆయన ఆమె వద్దకు రాడు. పూరేకులు రాలిపోయిన తర్వాత ఆమె వద్దకు వెళ్ళడానికి నిశ్చయించుకుంటాడు. ఆమెను దర్శించడానికి అతనికి అదే తగిన సమయము. కాని సామాన్య మర్త్యులకు అప్పటికే కాలాతీతమై పోతుంది. ఐహికమైన జీవనమే ఏకైక యథార్థమని భావించువారికి నిజంగా అది చాలా జాప్యమే. కాని మరణానంతర జీవితం (ఆముష్మికము)పై విశ్వాస మున్న వారికి అది జాప్యము కాదు.

కథను నాటకీయంగా పరిశీల ముందుంచడంలో కవి చూపిన ప్రజ్ఞాప్రాభవములనుబట్టి ఒక కళాత్మకమైన కృతిగా 'కరుణ' కావ్యజగత్తులో ఉన్నత స్థాన

మలంకరించి వున్నదని చెప్పాలి. అశాన్ రచించిన ప్రతి పెద్ద కావ్యం నాటక పక్కీని దృష్టిలో వుంచుకొని నాటకీయమైన సన్నివేశంతో కావ్యారంభము చేయడం జరిగిందనీ, ఆ నాటకతత్వం ప్రాతిపదికపై కవి కావ్యసౌధాన్ని నిర్మిస్తాడనీ ఇదివరకే మనం తెలుసుకొని వున్నాము. అటు వంటి నాటక తత్వం 'కరుణ' కావ్యంలో మహోన్నత శిఖరములకు చేరుకున్నది. ఈ కావ్యంలో మరొక ముఖ్య విశేషం కవి కలంతో సృజించిన రేఖా చిత్రాలు, చిత్తరువులు పుష్కలంగా వుండటం. నాటకీయమైన ఘట్టాలలో కవి అనేక వాస్తవిక చిత్రాలను చొప్పించి కావ్యానికి అనన్యమైన ఒక విశిష్టత నాపాదించాడు. కావ్యారంభమే అట్టి మేళవింపుకు చక్కని ఉదాహరణము. నాటకీయ ధోరణీ, వర్ణనలు—ఈ రెండింటి సమ్మేళనంతో 'కరుణ' తేజో విలసితమైన సజీవరచనయై అత్యంతరమ్యమైన కళాఖండంగా రూపొందినది.

కొన్ని పంక్తులలో కథా రంగమును వివరించిన తరువాత, నాయిక కూర్చొనివున్న పరిసర ప్రదేశమును వర్ణించి, మనోజ్ఞమైన ఆమె భంగిమను ఈ దిగువ పంక్తులలో కవి చిత్రించాడు:

అల్పముగా అవనత వదనయై
పైటను ఉంగరాల జుట్టుపై
ఒక ప్రక్కగా వేసుకొని
చెవులకు పెట్టుకున్న
దుద్దులదాళ్ళు మెరిసిపోవగా
మల్లెమొగ్గలతో అలంకరించుకున్న
కారుమబ్బువంటి నల్లని ఆమె కొప్పు
దర్శనీయంగా అగుపిస్తున్నది.
చంద్రబింబమువంటి ఆమె ముఖము
నుదుటిపై కస్తూరీతిలకంతో
శోభాయమానంగా వుంది.
బంగారు కమలమునకు
సరిదీటుగా వున్న
నునుపైన ఆమె కుడిపాదం
ఎడమతొడపై వేసుకు
ఎంత ఆకర్షణీయంగా వుంది!

పన్నీటిలో ముంచిన
పరిమళ భరితమైన
వన్నెల విసనకర్రతో
చెలికత్తె మెల్లగా వీస్తూవుంటే
గాజుల గల గలలతో
ఆ మోహనాంగి
చూపరులను వశ్యం చేసుకుంటూ
మన్మధుని రాణివలె
ఆశీనురాలై వుంది.

మలయాళ మూలంలో ఈ వర్ణన ఒక సమగ్రమైన విందు చిత్తరువువలె వుంది. ఇక ఆ ప్రతిమ కదలి సాగిపోతుంది:

ఆ పడుచు నల్లని కురులను జడలుగా అల్లుకొని
ఒక చేత పూలగుత్తి పట్టుకొని
సెలయేటిమడుగు అలలనుండి
పైకిలేచు కమలమువలె
ఆమె కుడిపాదం ఊపితే
అందెల ఘలంఘల సవ్వడి.
మెల్లని పిల్లవాయువు వీస్తే
ఆమె చీరెమడతలు
అలలవలె కదలిపోతాయి.

ఆమె ఎవరికోసమో కుతూహలంతో నిరీక్షిస్తూ వుంది. ఉపగుప్తుడి వద్ద నుంచి చెలికత్తె తిరిగి రాగానే నాటకీయమైన ఘట్టం ఆరంభమవుతుంది. మదన మోహితయైన స్త్రీ ప్రగాఢ కాంక్షతో కాంతుని కామించితే అట్టి ఉద్రిక్త ఆవేగ పూరిత అవస్థలో వెలువడే మనోభావాలతో సంభాషణ వాస్తవికతతో మొదలవుతుంది:

అంతటి అందగాడైన పురుషుడు
నావంటి కోమలాంగిని
అలక్ష్యంచేయడం క్రూరంకాదా?

ఇట్లా మాట్లాడుతూ వాసవదత్త ఉపగుప్తునిపట్ల తన ప్రేమ స్వచ్ఛమైన దనీ, ఫలాపేక్ష లేనిదనీ స్పష్టం చేస్తుంది. తానొక వేశ్యవలె అతనిని కోరడం లేదని చెబుతుంది. ఈ దృశ్యం అంతములో సంపన్నుడైన చెట్టియార్‌ను కవి ప్రవేశ పెడతాడు. సొగసుగా అలంకరించిన ఎద్దులబండిలో అతను వస్తాడు. అతని ప్రవేశమే ఒక మనోరంజకమైన వర్ణన. అది నాటకీయమైన సంఘర్షణ మును పెంపుచేస్తుంది.

నాయిక వైఖరిని యుక్తమైన ఒక ఉపమానంతో కవి ప్రతిభావంతంగా వర్ణించాడు:

ఆడహంస కొలను ఒడ్డుపై
కొంతసేపు అటూ ఇటూ సంచరించి
బిడియంతో గిర్రున తిరిగి
మళ్ళీ తన కొలనులోనికి వెళ్ళినట్లు
ఆమె మందగమనంతో వెడలిపోయింది.

రెండవ దృశ్యం ప్రతి అంశంలో దీనికి పూర్తిగా భిన్నమైనది. అందులో కూడా వాసవదత్తయే ముఖ్య పాత్ర. కాని పురుషులలో కామం రేకెత్తించే చతుర యైన మదవతి కాదు. అంగములు ఛేదింపబడి కురూపిగా చేయబడ్డ స్త్రీ. అసహ్య మైన దురవస్థలో దీనావస్థలో వున్న దౌర్భాగ్యురాలు. ఆమె విటారుగా ఉన్నతంగా వుండే అశోక వృక్షం క్రింద లేదు. ఏ కాలపుదో ఒక మర్రిచెట్టు క్రింద వుంది. అక్కడ కూడా ఆమె చెలికత్తె వుంది. కాని ఆమె తన యజమానురాలికి సౌఖ్యం చేకూర్చడానికి సువాసన లీనే వీవనతో విసరడం లేదు. ఆమెపై వాలడానికి వచ్చే కాకులను తోలడానికి చిన్న కొమ్మ పట్టుకు నిల్చొని వుంది. మొదటి దృశ్యంలోని వర్ణన సామగ్రి అంతా వైభవాన్నీ శోభనూ ప్రదర్శించగా, రెండవ దృశ్యంలోని వివరణలు అసహ్యమునూ, అవమానమునూ దృగ్గోచరం చేస్తాయి. మొదటి దృశ్యం అంతములో చెట్టియార్ ప్రవేశించగా, రెండవ దృశ్యం చివరన ఉప గుప్తుడు వస్తాడు. ఇట్లా ప్రతి అంశం విషయంలో పరిపూర్ణ ప్రావీణ్యంతో, చక్కని పనితనంతో రెండు దృశ్యముల తారతమ్యమును కవి ప్రదర్శింప జేయ డంవల్ల కొంచెం శ్రద్ధగా సవిమర్శకంగా చదివిన వారికి కావ్య వైదుష్యము, కావ్యంలో నాటక తత్వమును చొప్పించడంలో కవికి గల అసాధారణ ప్రతిభ బోధపడుతుంది.

చివరిదైన మూడవ దృశ్యం సంఘర్షణమును ఒక పర్యవసానానికి తెస్తుంది. అంతరమైన సంఘర్షణ వాసవదత్తలోని వేశ్యకూ. పరిశుద్ధమైన స్త్రీకి మధ్య జరుగుతుంది. ఆ స్త్రీలో ప్రచ్ఛన్నంగా వున్న దివ్యత్వం తిరిగి మేల్కొం టుంది. ఉపగుప్తుని పేరే ఆమెకు జీవమును ప్రసాదించే అమృత మైనది. అతి కష్టంమీద కలగా పులగంగా వున్న తన అనుభూతులను వ్యక్త . చేయడానికి ఆమె ప్రయత్నిస్తుంది. ఆమె సరిగా మాట్లాడ గలిగిన స్థితిలో లేదు. అంగవిచ్ఛేదము వల్ల మాట్లాడే శక్తిని గోల్పోయింది. అయినా వెలుపలికి వచ్చీ రాని ఆమె మాటలను అర్థం చేసుకునే శక్తి అతనికి మాత్రమే వున్నది. హృదయ విదారక మైన ఈ భీకర విషాద దృశ్యం ఎవరినైనా కంపింపజేసి మూర్ఛిల్ల జేస్తుంది. కాని ఉపగుప్తుడు నిశ్చలుడై స్థిరంగా వుంటాడు ఆమె దయనీయ స్థితిని చూచి అతను కూడా చలిస్తాడు. కాని అధికంగా అతని మనస్సు చలింపదు. గంభీరవదనుడై ఆమె హృదయంలో మొలకెత్తిన స్వచ్ఛవిసర్గ ప్రేమను గుర్తించి దానిని పరిగణి స్తాడు. శోచనీయమైన ఆమె దురవస్థకు తన సానుభూతి తెలుపుతాడు. జాలిచెంది కరుణాంతరంగు డవుతాడు. ఆమె ఘోరాతి ఘోరమైన నేరం చేసినప్పటికీ ఆమెను ఖండించి ద్వేషించడు. ఆమె ప్రేమను భక్తిభావమును గౌరవిస్తాడు. తానూ ఆమెను ప్రేమిస్తాడు, కాని ఆ ప్రేమ భిన్నమైనది. అతని ప్రేమ పరిశుద్ధ మైనది. వ్యసనం లేనిది, ఇంద్రియ సుఖాసక్తి లేనిది. విశ్వమానవ సంబంధ మైనది. ఇదే 'కరుణ' కావ్యం సారాంశం.

ఉపగుప్తు డంటాడు :

సోదరీ విలపింపకు,
భయాన్ని విడనాడు,
శాంతి నీకు లభిస్తుంది,
అష్టాంగ మార్గమును
సూచించిన స్వామి
పవిత్ర చరణ కమలములను
దీర్ఘకాలం కడిగిన ఈ చేతితో
మెల్లగా నీ నుదుటిని స్పృశింపనీ.

ఇలా అంటూ తన వ్రేళ్ళను ఆమె నుదుటిపై తట్టి, ఆమె కన్నీటిని తుడు స్తాడు. తాను శాంతికి నిలయమైనట్లు ఆమె అనుభూతి చెందుతుంది. ఆత్మ ఆమె శరీరాన్ని వదిలిపోయేముందు ఒక్క క్షణం వినూత్న ప్రాణి అవుతుంది.

ఉపగుప్తుడు వివేకము గల వాడు. మంచి చెడ్డలను గ్రహించగల వాడు. అట్టి వాని కరుణ కూడా భౌతిక రూపం దాల్చుతుంది. మండుతూ వున్న ఆమె చితిపై అతను ఒక కన్నీటి బొట్టు రాల్చు తాడు :

అది మరేమీ కాదు,
కరుణ లోతులలో
ప్రవర్ధనము చేయబడ్డ
ప్రకాశమానమైన ముత్యము ;

ఈ కన్నీటి బొట్టు కూడా ప్రేమ కరుణలనే పరిశుద్ధ భావాలకు అనర్గళ మైన వ్యక్తీకరణ. "ఒక్క రమణీయ శబ్దంలో పుష్పించిన కావ్యదేవతల సౌంద ర్యాన్ని" ఆ ఒక్క కన్నీటి బొట్టులో దర్శించ గలము.

ఇంత వరకూ 'కరుణ' కావ్యంలో వర్ణనలతో రూపొందించిన చిత్తరు వుల మహత్తర సౌందర్యాన్ని తిలకించాము. యథార్థానికి కావ్యంలో ఈ అంశం చదువరిని మరీ మరీ ఆకర్షిస్తుంది. ఇక కావ్యంలోని రెండవ అంశం కవి ప్రయో గించిన వినూత్న కల్పనలు. కావ్యం నిండా అట్టి కల్పనలు కొల్లలుగా వున్నవి. వాటిలో కొన్ని నవనవోన్మేషంగా వున్నాయి.

కౌతుకంతో నిండిన వాసవదత్త నేత్రాలను కవి ఇట్లా చిత్రించాడు :

గాజు పేటికలో తేటయైన నీటిలో
పట్టివుంచిన చిరుచేప
విసురుగా లేచి దూసుకు పోయినట్లు—

శ్మశాన వాటికలోని మర్రి చెట్టు కవి కళ్ళకు ఇట్లా కన్పించింది:

బ్రహ్మాండమైన మర్రిచెట్టు
ఒకటి అక్కడ వుంది.
శ్మశానంలో పొడుగాటి కొరివి దయ్యం
దాని నెత్తిన మంటలతో
వణికిపోతున్నట్లుగా వుంది ఆ వృక్షం.

విధివిలాసాల మర్మం ఎవరికి తెలుస్తుంది ? అవి దుర్భేద్యమైనవి. విధి వక్రమార్గాలను కవి ఒక త్రాసుతో పోల్చి చక్కగా చెప్పాడు :

సుఖ సంతోషాలు కేవలం భ్రమలు

విధి అనే త్రాసు ఎటు మొగ్గు చూపుతుందో
ఎటు పైకి తేలుతుందో ఎవరు చెప్పగలరు ?

వాంఛ అనేది మానవుణ్ణి ఎట్లా అవివేకిని చేస్తుంది ?

భయంకరమైన కొండ చిలువ చుట్టలను
అవివేకి మాత్రమే నిద్రలో
తలగడ అని భ్రాంతి చెందుతాడు

ఇటువంటి శబ్ద చిత్రాలు కావ్యాన్ని వాస్తవ పూరితమైన దానినిగా, మన స్పృకు హత్తుకు పోయే దానినిగా చేస్తాయి. సృజన మహిమాన్వితంగా కనిపిస్తుంది.

'కరుణ' కావ్యాన్ని మనోరంజకమైన దానినిగా చేసే మరొక విశేషం అందులో పాడుకోవడానికి అనువుగా వుండే భావగీత లక్షణం. అది వంచిప్పాట్టు (పడవపాట) అనే జానపద ఛందస్సులో రచింప బడింది. దాని సూక్ష్మ సంగీత లక్షణం ఎవరికైనా ఇట్టే పట్టేస్తుంది. సులభంగా ఎటుపడితే అటువంగే స్వభావం గల ఈ సంగీతమయ ఛందస్సును కుమారన్ ఆశాన్ ఈ కావ్యంలో ఎంతో ప్రయోజన మాశించి వాడాడు. కృతార్థు డయ్యాడు.

ఆశాన్‌కు భగ్నప్రేమ అంటే మోజు ఎక్కువ అని విమర్శించేవా రున్నారు. అట్లా చూస్తే 'కరుణ' తో సహా ఆశాన్ వ్రాసిన కథా కావ్యాలన్నీ సఫలముగాని ప్రణయమును చిత్రించినవే. వాసవదత్త ఆత్మ నిర్గమించడానికి కొద్ది క్షణాల ముందు ఉపగుప్తుడు ప్రత్యక్షం కావడం మరణ శయ్యపై మానవునిదహన సంస్కారం జరుపడం వంటిదేనని విమర్శకుల వాదము. పునర్జన్మ పొందిన వాసవదత్తకు ఈ లోకంలో బ్రతకడానికి అవకాశం కల్పించి వుండవలసింది అని వా రంటారు. ఇట్టి విమర్శకులకు ఆశాన్ ఇచ్చే సమాధానం బహుశా మూల కథలో వాసవదత్తకు ఉపగుప్త డిచ్చిన సమాధానం వలెనే వుంటుందనుకుంటాను. "తథా గతుని ఉపదేశమునైనాసరే నీవు పాటించి వుండే దానివి కావు. నీ మనస్సు చెప్పినట్లు వినేదిగా లేదు. చపల చిత్తులు అంతే. అస్థిరమైన సౌందర్యం అనే మాయనే నమ్ముకొని నీవు ఉన్నావు."

కవిత్వం ప్రేమ యొక్క భౌతిక స్థితినే హెచ్చుగా ఆదరిస్తూ అందులోనే మునిగి తేలే ప్రమాదంగల కేరళ దేశంలో ఆశాన్ కొత్త బాటవేయ దలచాడు. నిజమైన ప్రేమ అనేది శాశ్వతమైనదనీ, అది మహోత్కృష్ట రూపంలో సిద్ధించా

లంటే దానిని మరణం తరువాత పరలోక జీవితంలోనే అపేక్షించి ప్రాప్తింప జేసుకోవాలనీ ఆయన కేరళ సాహితీపరులకు చెప్ప దలచుకున్నాడు. బుద్ధుని ధర్మమును, సంఘమును శరణు జొచ్చిన వ్యక్తికే నిర్వాణం సాధ్యమవుతుంది. మహా పాపియైన వ్యక్తికి సైతం, జీవితంలో తుది ఘడియలలో కూడా కరుణ వల్లనే నిర్వాణం ప్రాప్తిస్తుంది.

# 14. ముగింపు

ఆశాన్ సృజనాత్మక ప్రతిభ మహోన్నత శిఖరాల నందుకొని కవితా లోకంలో ఆయన జాజ్వల్యమానంగా ప్రకాశిస్తూవుండగా క్రూరమైన విధి ఆయనను ఈ ప్రపంచంనుంచి వేరుచేసింది. ఆ వచ్చిన మృత్యువు కూడా కడు విషాదపూరితంగా, అకస్మికంగా, ఎవరూ ఊహించని విధంగా వచ్చింది. ఆంగ్లమహా కవి షెల్లీవలెనే మలయాళ మహాకవి ఆశాన్ నీటిగండంవల్ల మృత్యువు పాలైనాడు.

1924 జనవరి 16 వ తేదీన ఇది సంభవించింది. తిరువనంతపురానికి ఉత్తరాన 15 మైళ్ల దూరంలోవున్న తోన్నక్కల్ నుంచి ఆల్వే వెళ్లడానికి ఆయన సిద్ధమయ్యారు. అక్కడ ఆయనకు 18 ఎకరాల పొలంవుంది. ఆల్వేలో వున్న పెంకుల ఫ్యాక్టరీలో ఆయనకు కొన్ని షేర్లు (కొన్నివాటాలు) వున్నాయి. ఆ ఫ్యాక్టరీ సమావేశంలో ఆయన పాల్గొనవలసి వుంది. కోయిలోన్‌నుంచి అలెప్పీ వెళ్లడానికి ఆనాటి ఆఖరి పడవలో ప్రయాణం చేస్తున్నాడు. కోయిలోన్ నుంచి బయలుదేరినప్పుడే పడవనిండా జనం క్రిక్కిరిసివున్నారు అష్టముడి సరస్సు పెద్ద అలలతో కల్లోలితమై వుండగా పడవ అలలను చీల్చుకుంటూ వెడుతూంది. నిద్రపోయేసౌకర్యం ఆ పడవలోలేదు. ఆయన కవిత్వమంటే అభిమానం గల కొందరు ప్రయాణీకులు కొన్నిపద్యాలు చదివి వినిపించండని పంతులుగారిని కోరారు అందుకాయన సంతోషంతో అంగీకరించాడు. అప్పుడాయనవద్ద ఒక నోట్ బుక్కు ఉంది. అందులో 'శ్రీ బుద్ధచరితము' (5 వ కాండము), 'కరుణ' కావ్యం ఆయన స్వయంగా వ్రాసుకున్నవి వున్నాయి.

అర్ధరాత్రి దాటింది. పడవ ప్రమాదకరమైన తావులన్నీ దాటివెళ్లింది. ఇక కాసేపు కునుకు తీయవచ్చునని అనుకొని ఆశాన్ క్రిందవున్న మొదటి తరగతి అరలోకి వెళ్ళాడు. అది చలికాలపు రాత్రి. చలిచలిగా వుంది. ఆశాన్ తాను వేసుకున్న ఖాదీకోటు తీసేయ లేదు. తలపై పల్చని ఉన్ని శాలువా కప్పుకొని నిద్రపోయాడు. ఆ నిద్రనుంచి మళ్ళీ లేవలేదు. పడవ పల్లన వద్ద ఒక చిన్న కాలువలో మునిగిపోయింది. మామూలు పరిస్థితుల్లో అల్లకల్లోలంగా వుండే సముద్రంకూడా ఆశాన్‌ను భయపెట్టలేదు. ఎందుచేతనంటే ఆశాన్ గజ ఈత గాడు. కాని విచిత్రమేమిటంటే ఈ విషాద సంఘటన చిన్నకాలువలో జరిగింది. అంతకన్నా వింత ఏమిటంటే 'రక్షకుడు' అనే పేరుగల పడవలో ప్రయాణం చేస్తూవుండగా ఒక మహాకవి మరణం సంభవించింది. ఇంతకన్న పరిహాసా స్పదమైన పేరు మరొకటి వుంటుందా? ఆశాన్ మృతదేహం మరుసటిరోజుగాని దొరకలేదు. తీరాచూస్తే నుదుటిపై కొంచెం గీసుకుపోయి వుంది. సహజంగానే అదే చావుదెబ్బ అని ఊహించారు.

బహుశా తనకు చివరిరోజులు వచ్చాయని ఆశాన్‌కు భవిష్యద్ జ్ఞానం కలిగిందేమో! ఇది వట్టి ఊహ అని కొందరు కొట్టిపారవేయవచ్చు. ఈ విషాద సంఘటనకు కొద్ది రోజులుముందు కొట్టాయం నివాసి శంకు గారికి ఆశాన్ రెండు ఉత్తరాలు వ్రాశాడు. వాటిలో కొట్టాయంలో జరుగబొయ్యే సాహిత్య సభలలో తాను మొదట అనుకున్న ప్రకారం పాల్గొన గలనో లేదో అన్న సందేహం వెలి బుచ్చాడు. అంతేకాదు, ఇంటినుంచి బయలుదేరి ప్రయాణమై వెళ్ళేటప్పుడు తన ఇద్దరు కుమారుల భవిష్యత్తును గూర్చి భార్యతో మాట్లాడటం గమనించదగ్గ విశేషం. పైగా వెడుతూ భార్యతో 'వెడతాను' అని చెప్పి బయలుదేరాడు. ఇట్లా చెప్పి బయలుదేరడం అసాధారణ విశేషం. ఆయన ఎన్నడూ భార్యతో అలా చెప్పి ఏ వూరికీ ప్రయాణమై వెళ్లలేదు.

చనిపోయినప్పుడు ఆశాన్ వయస్సు 51 సంవత్సరాలు. ఆయన భార్య భానుమతి అమ్మకు 23 ఏళ్ళుంటాయి. ఇద్దరూ భార్యా భర్తలుగా ఏడేండ్లు మాత్రమే కాపురం చేశారు. వీరికి ఇద్దరు కుమారులు. పెద్ద పిల్లవాడు ఐదేండ్లవాడు. చిన్న వాడికి రెండేండ్లుంటాయి. ఇంటి యజమాని అకాలమరణం చెందితే కుటుంబం గతి ఏమవుతుందో ఊహించ వలసిందే! తీరని ఈ నష్టం ఆశాన్ కుటుంబానికీ, ఆయన సహచరులకూ, మిత్రులకూ మాత్రమే వాటిల్ల లేదు. కేరళ దేశం

యావత్తూ ఆయన మృతికి దుఃఖించింది. 15 ఏండ్లపాటు సృజనాత్మక రచనలవల్లా 20 ఏండ్ల సంఘసేవవల్లా ప్రజలాయనను అంతటి గౌరవ భావంతో సమాదరించారు.

ఇంత చిన్న పుస్తకంలో కుమారన్ ఆశాన్ జీవిత చరిత్రనూ, ఆయన సాధించిన విశేషాలనూ సాకల్యంగా సవిస్తరంగా చిత్రించడం దుస్సాధ్యం. పైగా నానా గుణవిశేషములు సమ్మిశ్రితమై వున్న కవి విశిష్ట వ్యక్తిత్వాన్ని గూర్చి వ్రాయవలసివస్తే అది మరీ దుస్తరకార్య మవుతుంది. ఆశాన్ చాలా వరకు అంతర్ముఖుడు. తన సొంత డైరిలో ఆయన వ్రాసి పెట్టుకున్న విషయాలు సంక్షిప్తంగా, జరిగినవి జరిగినట్టుగా మాత్రమే వ్రాసిన ధోరణిలో వున్నాయి. ఆశాన్ ఎప్పుడూ ఆవేశంలో కొట్టుకుపోయి తత్సంబంధమైన భావావేశ దౌర్బల్యమును వ్యక్తంచేసే రచనలకు పూనుకో లేదు.

ఆశాన్ దృఢగాత్రుడు నిండుగా పుష్టిగా స్ఫురద్రూపిలా వుండే వాడు. తన రచనలలో ఆత్మను గూర్చి అధికంగా ప్రస్తావించినప్పటికీ, శరీరాన్ని ఆయన అలక్ష్యం చేయ లేదు. తోట పని చేయడమంటే ఆయనకు సరదా. కాయ కష్టం చేయజాలక పోతే దానికి బదులు క్రమం తప్పకుండా వ్యాయామంచేసి శరీరారోగ్యాన్ని కాపాడు కునేవాడు. ఇలా వ్యాయామం చేసి కూడా తన బరువు తగ్గించుకో లేకపోయాడు. రమారమి 160 పౌనుల బరువుండే వాడు. ఆయన ఎత్తుకు ఆ బరువు చాలా అధికమే. అందు చేత 'కూనీ' పద్ధతి అచరించి చూచాడు, అంటే ప్రకృతి చికిత్స. దానితో ఆయన బరువు 100 పౌనులకు దిగి పోయింది. ఇలా సన్న బడేటప్పటికి ఆయనకు సన్నిహితులైన సహచరులు ఆందోళన చెందారు. అప్పుడు ఆశాన్ తాను చేస్తూ వున్న దానిని పునర్విచారణ చేసుకొని తిరిగి శరీర దార్ఢ్యతను కాపాడుకోవడం మొదలు పెట్టాడు. ఆశాన్ ముఖ్యంగా శాకాహారి. అయితే మాంసాహారమును ఏవగించుకొన లేదు. ఆయన భార్య శాకాహారి కావడానికి సంసిద్ధతను వెలి బుచ్చింది. కాని ఆమెపై అనవసరంగా ఇటువంటి ఖాయిదా విధించడం ఆశాన్‌కు ఇష్టం లేదు.

బైటి వారికి ఆశాన్ మేరు గంభీరుడు, మహోదాత్తుడు. కాని ఒక్కొక్కప్పుడు మరీ అభమూ శుభమూ ఎరుగని పసిపిల్లవాడిలా ప్రవర్తించే వాడని ఆయన భార్య భానుమతి అమ్మ అన్నది. ఇందులో అసంగతమైన దేమీ లేదు. మహా పురుషులైన వారు చాలా మంది అలా ప్రవర్తించే వారని మనం వింటాము.

ఆశాన్ జీవిత తత్త్వమునూ, సమస్యలను ఎదుర్కోవడంలో ఆయన అవలంబించిన విధానాలనూ పరిశీలిస్తే ఆయనలో మనకు ప్రాక్పశ్చిమాల అసదృశమైన సమ్మేళనం గోచరిస్తుంది. యోగులపంథా అనుసరించు వ్యక్తిలో పాశ్చాత్య దృక్పథం చక్కగా మేళవింపు చెందినట్లు ఆయన మనకు అవగత మవుతాడు. పైకి పరస్పర విరుద్ధంగా కన్పించే ఈ రెండు వైఖరుల అసాధారణ సమీకరణమే ఆశాన్ తన జీవితాశయం విషయంలో కృతార్థుడు కావడానికి బహుశా కారణ భూతమైనదేమో! ఏమైనప్పటికీ ఈ లక్షణమే ఆయనను ఇతర సమకాలిక మహా కవులైన వళ్ళతోళ్ నారాయణ మీనన్, ఉళ్ళూరు పరమేశ్వర అయ్యర్‌లకు భిన్నుడుగా రూపొందించిన దేమో!

బౌద్ధమతమంటే ఆశాన్‌కు ప్రత్యేకాభి మానమన్న సంగతి ఆయన రచనల వల్ల స్పష్టమవు తున్నది. అయితే దీని అర్థం ఆయన బౌద్ధమతం పుచ్చుకున్నాడని కాదు. ఆధ్యాత్మిక విషయములందు గాఢమైన ఆసక్తికలవ్యక్తిగా మాత్రమే కాక, కులభేదాలు పాటించే హైందవ మతంలో వుండటమూ, వేరుపడి పోవడమా అన్న సందిగ్ధావస్థలోపడి అటో ఇటో తేల్చుకుందామని గట్టిగా ఆలోచిస్తున్న కులంవారి నాయకుడుగా కూడా ఆశాన్ అనేక ప్రపంచ మతములను గూర్చి అధ్యయనం చేశాడు. ఈ శతాబ్ది రెండవ దశకంలో కేరళ లోని ఈజవనాయకులు తమ కులం వారంతా హిందూమతమును విడనాడి, కులభేదాలు లేని మరేదైనా మతంలో చేరి పోవాలని అనుకున్నారు. కొందరు క్రైస్తవమతం మంచిదన్నారు. మరి కొందరు ఇస్లాం మతంలో చేరాలన్నారు. కొంత మంది బౌద్ధమతం పుచ్చుకోవడం మంచి దన్నారు. అయితే అధిక సంఖ్యాకులు తమ పునాదిని మార్చడం ఇష్టం లేక, మార్పు కోరలేదు. ఇట్టి అయోమయ స్థితిలో ఆశాన్ చూపిన మార్గం కొనియాడ దగింది. ఆయన మార్గదర్శకత్వం డొంక తిరుగుడు లేనిది. విశద మైనది ఉద్రేక రహితమైన తార్కిక బుద్ధికి అనుగుణ మైనది. దూరదృష్టితో కూడు కున్నది. 1923 లో జరిగిన యస్. యన్. డి. పి. యోగం మహా సభలో అధ్యక్షోపన్యాసమిస్తూ ఆశాన్ చెప్పిన మాటలు ఆయన వాదమును, ఆయన వైఖరిని స్పష్టం చేసేవిగా వున్నవి :

"కుల నిర్బంధాలను అధిగమించాలంటే మరొక మతం పుచ్చుకోవడం మంచిదేమోనని యోగం తరచు ఆలోచిస్తూ వచ్చింది. ప్రస్తుతం బౌద్ధమతం మొగదలలో వుంది. నా ఆప్త మిత్రుడూ, మన కులానికి గొప్ప నాయకుడూ అయిన 'మితవాది' పత్రిక సంపాదకుడు శ్రీ సి. కృష్ణన్ మనం బౌద్ధమతంలో చేరితే

మంచిదని వాదించే వారిలో ప్రముఖుడై వున్నాడు. ఆయనపట్ల మనకు గల ప్రేమాభిమానాలు, గౌరవ భావమునుబట్టి ఆయన చేసిన సూచనను మనం గట్టిగా ఆలోచించవలసి వున్నది. నాకు సంబంధించి నంతవరకు బౌద్ధమతం చెప్పే ధర్మం, మోక్షం తెలుసుకున్న తరువాత నాకు ఆ మతమంటే గొప్ప గౌరవ భావం ఏర్పడి పోయింది. ఆ భావం ఇప్పటికీ అలాగే వుంది. కాని సవినయంగా నేను మనవి చేసేదేమిటంటే—కొన్నేండ్లుగా పెంపొందించుకుంటూ వచ్చిన మానసిక వైఖరిని ఒక్క మారే చొక్కాను విడిచి అవతల పారవేసినట్లుగా విడనాడలేము. అది మన తత్వ శాస్త్ర రీత్యా సమర్థనీయమైనది కాదు. ఇది ఒక అంశము. రెండవ దేమిటంటే దానివల్ల కలిగే భౌతిక ప్రయోజనాల విషయంలో నాకు విశ్వాసం లేదు. మూడవ దేమిటంటే కొన్ని లక్షల మంది జనం వున్న మన కులం వారిని మూక ఉమ్మడిగా ఒక్క మారే మరొక మతంలోకి మార్చడం సాధ్యమైన పనికాదు. మన ప్రజలందరూ ఒకే మనస్థితిలో వుంటా రనుకోవడం పొరపాటు. ఎవరి ఇష్టా యిష్టాలు, ఎవరి అభిమానాలు వారికున్నాయి. రకరకాల అభిప్రాయాలు గల వా రున్నారు. కాబట్టి మతం మార్పిడి అవివేకమైన చర్యే అవుతుంది. అది కుల విచ్ఛిన్నానికి కూడా దారి తీయవచ్చు. పైగా మతానికి సంబంధించిన విషయాలలో స్వామివారు (నారాయణగురు) మనకు హితవు చెప్పాలి. మత తత్త్వం మున్నగు విషయాలలో అంత అనుభవం, విజ్ఞానంగల వ్యక్తి జీవించి వుండగా మనం హితోపదేశం కోసం మరొక చోటికి వెళ్ళడం ఆ మహానుభావుని అవమానించడమే కాగలదు...."

మతం మార్పిడి విషయంలో ఆశాన్ 'మత పరివర్తన రసవాదం' అనే చిన్న పుస్తకం వ్రాశాడు. తర్క బద్ధంగా, హేతుబద్ధంగా ఒక విషయాన్ని గూర్చి వాదించాలి అన్న అభిప్రాయానికి ఈ పుస్తకం చక్కని ఉదాహరణ. ఆశాన్ అన్ని సందర్భాలలో జనాన్ని అనుసరించి పోలేదు. మనిషి చాలా స్వతంత్ర వైఖరి గలవాడు. కాబట్టే అనేక పర్యాయాలు ఒంటరివాడై పోయాడు. అలా ఏకాకిగా వుండిపోయేవాడు. ఇతరు లెవరైనా తిరుగుబాటు చేస్తే ఆయన తొందరపడక, నెమ్మదిగా ప్రశాంతంగా వుండమని హితవు చెప్పే వాడు. మతం మార్పిడి విషయంలో ఆయన అనుసరించిన వైఖరిని పరిశీలిస్తే ఇట్టి ఓర్మి, వినామం ఆయనలో కనిపిస్తాయి. అవతలివారు మార్పు వాంఛించక నిలవ నీరులా వుండిపోదామని అన్నారా ఆయన తిరుగుబాటుదారుగా, విప్లవ వాదిగా వ్యవహరించేవాడు. ఆయన పెద్ద కావ్యాలలో ఇటువంటి విప్లవ భావాలు కనిపిస్తాయి. కవిగా భావాలలో

తిరుగుబాటు,రచనా సంవిధానంలో విప్లవాత్మక వైఖరి ఆయనలో మనకు స్పష్టంగా గోచరిస్తాయి. కవితా రచనలో ఆశాన్ నైపుణ్యం క్రమేణా పెంపొంది పరిణతి చెందింది. "వీణ పూవు" కావ్యంతో కావ్యరచనా కళలో పట్టభద్రుడై ఆ తరువాత విలుకడగా స్థిరంగా ఒక్కొక్క మెట్టే పైకెక్కి అభ్యుదయం సాధించాడు. కవిత్వ లక్ష్యం విషయంలో, ఆ లక్ష్యాన్ని సాధించడానికి అవలంబించ వలసిన శిల్పం, పవితనం విషయంలో ఆశాన్ ఎన్నడూ ఎవరితోనూ రాజీ పడలేదు. మేరు పర్వతంవలె విశ్చలంగా గంభీరంగా విలబడ్డాడు అయితే సంప్రదాయపు విలువలను త్రోసి పుచ్చలేదు. వాటికి గట్టిగా అంటి పెట్టుకొనే వున్నాడు. అభ్యుదయమనే దానివి పరిణామం (క్రమ వికాసం) ద్వారా, విప్లవం ద్వారా—రెండు విధాలా సాధించ వచ్చునని ఆయన అభిప్రాయం. పరిణామము, విప్లవము రెండూ సహజీవనం నెరప వచ్చు, 'దురవస్థ' కావ్యంలో సాంఘిక వ్యవస్థలో విప్లవం రావాలని ఆయన ఇచ్చిన పిలుపు ఎంత ఖండితమైనదంటే చాలా మందికి అది మన స్తాపం కలుగ జేసింది. కొందరికి కోపం వచ్చింది. ఆశాన్ కావాలనే అలా చేశాడు. అన్యమార్గానికి ఎడమివ్వకుండా, సంధికి సమ్మతించక దృఢంగా విల్చున్నాడు. కాని మూక ఉమ్మడిగా మతం మార్పిడి ప్రస్తావన వచ్చే సరికి ఆయన పరిణామ మార్గాన్ని సమర్థించాడు. సాంఘిక కల్లోలాన్ని తిరస్కరించాడు. బహుశా విప్లవాత్మక భావాలు వ్యాప్తి జెందినప్పుడే పరిణామానికి అవసరమైన ఉరవడి, ఉధృతం ఒనగూరుతాయని ఆశాన్ అభిప్రాయం కాబోలు.

మీకై మీరే ధర్మశాస్త్రాలను మార్చండి
లేదా ధర్మశాస్త్రమే తప్పక మిమ్మల్ని మారుస్తుంది.

అవి ఆశాన్ సంఘంలోవి సనాతన వాదులను, వారి నాయకులను హెచ్చరించాడంటే ఆయనలో మనకు ఒక విప్లవ కవి మాత్రమే గాక గొప్ప ప్రవక్త కూడా కనపడతాడు. శంఖారావము వంటి ఈ పిలుపునుబట్టి ఆయన తాను ఏ కాలంలో జీవిస్తున్నాడో దాన్ని దాటి చాలా ముందుకుపోయి అభ్యుదయ పథంలో విల్చున్నాడని చెప్పాలి. సమకాలిక చరిత్రలో మనం చూస్తూ వున్న దేమిటి? విబంధనలు నిర్బంధాలు తీవ్రమైన మార్పుకు లోనవడమో, లేదా పాతబడిపోయిన ఆ విబంధనలను ఇంకా పట్టుకు వేళ్ళాడుతూ వున్న వారిని వారి వారి స్థానాలనుంచీ, గద్దెలనుంచీ దింపడమో జరిగింది. ఆశాన్ సాహిత్య కేదారంలో, సాంఘిక క్షేత్రంలో విప్లవ బీజాలు నాటాడు. గడచిన నాలుగు దశాబ్దాల చరిత్రను పరిశీలిస్తే

ఆయన చెప్పిన మాటలు ఎంత వరకు నిజమయ్యాయో, అవి ఎటువంటి సత్యాన్నో బోధపడుతుంది. అంతే గాక అప్పుడు మార్పును వ్యతిరేకించి, వున్నచోటే వుండి పోదాము అని వాదించిన వారి వైఖరి ఎంత హాస్యాస్పదమైనదో కూడా మనకు అవగత మవుతుంది.

ఆశాన్ మొత్తం జీవితాన్ని ఒక్కమారు వెనక్కు తిరిగి సింహావలోకనం చేస్తే ఆయనకు మృత్యువుతప్ప తక్కినవన్నీ ఆలస్యంగానే అందుబాటులోకి వచ్చాయని చెప్పాలి. మృత్యువు మాత్రం మరీ త్వరగా ముంచుకొచ్చింది. ఆయనలో కవిత్వం ఆలస్యంగా మొగ్గ తొడిగింది. "వీణ పూవు" వ్రాసినప్పుడు ఆయన వయస్సు 35. సాహిత్యలోకంలో పరిగణన కూడా ఆలస్యంగానే లభించింది. వివాహం ఆయన 45 వ యేట జరిగింది. మరి అదీ చాలా ఆలస్యమే కదా. ఆయన కావ్యాల ఆరంభముకూడా ఉపాంతఘట్టముతో మొదలవుతుంది.

ఆశాన్ ప్రతి కావ్యం అబలలపై వెలుగును ప్రసరింపజేసి, సంఘంలో అట్టడుగున పడివున్న వారి స్థితిగతులను మెరుగు పరచండి అన్న ప్రబోధాన్ని పదే పదే వినిపింప జేసింది. స్త్రీ ప్రతిపత్తిని పెంచడం ద్వారా కాల్పనిక ప్రణయ సిద్ధాంతాన్ని సుసంపన్నం జేసి, ప్రేయసీ ప్రియులను లోకం సమానులుగా చూచేట్టు చేయగలిగాడు. ఈ విషయంలో కూడా ఆయనకూ ఆంగ్లమహాకవి షెల్లీకీ సాదృశ్య మున్నది. మలయాళ కవిత్వంలో రినైజాన్సు ఉద్యమానికి (పునరుజ్జీవనోద్యమానికి) నాయకత్వం వహించే భాగ్యం ఆశాన్‌కు కలిగింది.

ఈ మహా కవి సంస్మరణను శాశ్వతం చేయడానికై ఇటీవల ప్రజలూ, కేరళ ప్రభుత్వమూ తగు ఆసక్తిని, ఉత్సాహాన్ని చూపడం జరిగింది. ఆయన జన్మస్థలమైన కాయిక్కరలో ఆయన స్మారకార్థం పెద్ద హాలు ఈ మధ్యనే నిర్మించడం జరిగింది. ప్రతి సంవత్సరం ఇసుక తిన్నెలకు పేరుపడిన అక్కడి బీచీలో మూడు రోజులపాటు సాహిత్య వైజ్ఞానిక మహా సభలు జరుగుతున్నాయి. వాటిలో ప్రసిద్ధ రచయితలు, కళాకారులు పాల్గొంటున్నారు ఆశాన్ తన జీవితంలోని చివరి మూడు సంవత్సరాలను గడపిన తోన్నక్కల్‌లో కేరళ ప్రభుత్వం మరొక స్మారక మందిరమును నిర్మించింది. ఆశాన్ ఉపయోగించిన వస్తువులను ఆయన వ్రాత ప్రతులను అక్కడ భద్రపరచి ప్రదర్శింప జేస్తున్నారు. ఆయన నీటిలో మునిగి చనిపోయిన పల్లనలో మరొక స్మారక భవనము, పాఠశాల వున్నాయి.

ఆ స్థలానికి 'కుమారకోడి' అని పేరు పెట్టారు. తిరువనంతపురంలో కేరళ విశ్వ విద్యాలయ కార్యాలయం ఎదుట శాసన సభ్యుల వసతి గృహం ప్రక్కన ఆశాన్ జ్ఞాపకార్థం ఒక కట్టడమును నిర్మించి, ఆ మహాకవి నిలువెత్తు విగ్రహాన్ని ప్రతి ష్ఠాపించేందుకు విశాలమైన స్థలాన్ని కేటాయించారు. విగ్రహ ప్రతిష్ఠాపన త్వరలో జరుగనున్నది. *

కుమారన్ ఆశాన్ పేరిట అకాడమీలు పాఠశాలలు కేరళ రాష్ట్రంలోను, రాష్ట్రం వెలుపల ప్రారంభింప బడినవి. వీటిలో ముఖ్యంగా చెప్పుకోదగింది మద్రాసులోని ఆశాన్ మెమోరియల్ స్కూలు. ఈ మహా కవికి ఇంకా ఎన్ని స్మారక చిహ్నాలు నెలకొల్పినా సమంజసమే కాగలదు. ఆయన అంత యోగ్యుడు, శ్రేష్ఠుడు. ఆయన అభిమానులు ఎటువంటి స్మారక చిహ్నాలు ఏర్పాటు చేసినప్ప టికీ అన్నిటికన్న మలయాళ ప్రజలను ఉత్తేజ పరిచేవి అమరమైన ఆయన కృతులు. అవి ఎల్లప్పుడూ మనతో సంభాషించ గలవు. మనం వాటినుంచి ఎల్లప్పుడూ పాఠాలు నేర్చుకో వచ్చు.

---

* ఈ పుస్తకం ఆంగ్లంలో ప్రచురింప బడిన తర్వాత విగ్రహ ప్రతిష్ఠాపన జరిగింది.

## ఈ పుస్తక రచనకు ఉపకరించిన గ్రంథములు


1. మహాకవి కుమారన్ ఆశాన్ — పి. ఒ. కేశవన్
2. కుమారన్ ఆశాన్ — కె. సురేంద్రన్
3. శ్రీ నారాయణ పరమహంసన్ — కె. కె. పణిక్కర్
4. మహాకవి కుమారన్ ఆశాన్ — కున్నత్తు జనార్దన మీనన్
5. ఆశాన్, ఒరు పఠనమ్ — జోసెఫ్ ముండశ్శేరి
6. మనుష్య కథాను గాయికళ్ — „ „
7. మాట్టొలి (ప్రతిధ్వని) — „ „
8. వీణ పూవు కణ్ మున్పిల్ — కె. యం. డానియల్
9. ముంతిరి చారు — కె. యం. జార్జి
10. రాజాంకణం — కుట్టి కృష్ణ మారార్
11. చింతా దీపం — ఎన్. గోపాలపిళ్ళె
12. నిరూపణంగళ్ — కుమారన్ ఆశాన్
13. కావ్యకళ కుమారన్ ఆశానిలూడె — పి. కె. బాలకృష్ణన్


## కావ్య సంపుటములు


కుమారన్ ఆశాన్ సంపూర్ణ రచనలు (3 సంపుటములు.)

ఆశాన్ స్మారక గ్రంథం.

ఆశాన్ సోవనీర్ (1958)

కుమారనా శాన్తె కవిత. (కవితా సమితి)

ఆశాన్ (విమర్శక వ్యాసములు)

ఆశాన్ కవిత (ఆశాన్ అకాడెమి, తిరువనంతపురం)